## చేపగారి చాతుర్యం

ఈ చేపగారి చాతుర్యం చూడండి. నీటిలో ఉండి కూడా అందనంత ఎత్తులో ఉన్న కీటకాన్ని గుటుక్కుమనిపించాలని దాని కోరిక. అందుకే గురి చూసి నోట్లోని గ్రూవ్, నాలుక సాయంతో నీటిని అతి బలంగా పైకి స్ప్రేలా విరజిమ్ముతుంది. ఆ ధాటికి కీటకం బాలెన్స్ తప్పి నీట్లో పడగానే మింగేస్తుంది. భారత్ సహా ఆసియా దేశాలు, ఆస్ట్రేలియా ఉత్తరప్రాంతంలో కనిపించే ఈ చేప నీటి ఉపరితలం నుంచే కొమ్మలు, రెమ్మలు, ఆకులపై పాకే కీటకాలను చూడగలిగే కనుదోయిని కలిగిఉంటుంది.



రసమయ నవలా తరంగం

సంపుటి : 29 | సంచిక : 1

ఫిబ్రవరి : 2006 | 337వ సంచిక

# చతుర

## ఈ నెల నవల




అనూహ్యమైన కథాంశంలో అంతర్లీనంగా హాస్యాన్ని మేళవించి దృశ్యాదృశ్యమైన ఆధునిక పోకడలపై సంధించిన వ్యంగ్య శరం

**శరత్** నవల

# ఎవరు?



బొమ్మలు:



## రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (15)



# కాదేదీ హాస్యానికనర్హం

ఎందుకు నవ్వు నాలుగందాల చేటు? పెద్ద మనుషులకు కోపం తెప్పిస్తుంది గనక. అలాంటి నవ్వులో ధిక్కారం ఉంది. ఎద్దేవా చేసే తనం ఉంది. తృణీకారానికి మారుపేరుగా మారిన నవ్వు అది.

కొందరికి నవ్వంటే భయం "ఎక్కువగా నవ్వకు, ఏడుస్తావు జాగ్రత్త" అంటూ హెచ్చరిస్తారు కూడాను.

నవ్వు చెడ్డదీ, ఏడుపు మంచిదా?

ఏడుస్తున్న మనిషిని ఓదార్చి మన గొప్పదనాన్ని నిరూపించుకోవచ్చు (పక్కవాడి బాధను చూసి ఆనందించని మనుషులెందరు? )

కన్నీరుమున్నీరుగా విలపించినంత కాలం ఎవరికీ అభ్యంతరం ఉండదు. కాని నవ్వే మనిషంటే జెలసీ. ఆర్గ్యుమెంటు కోసం నవ్వు ప్రమాదకరమైనదని అంగీకరించినప్పటికీ, దుఃఖం వాంఛనీయమా?

దుఃఖాన్ని పంచుకోవాలంటే ఆ వ్యక్తి పట్ల సానుభూతి ఉండాలి. ఇది ప్రయత్నంతో కూడిన విషయం కూడా నవ్వుతున్న మనిషిని చూసి నవ్వకుండా ఉండగలగటం కష్టం. వద్దన్నా మనిషి నుండి మనిషికి వ్యాపిస్తుంది నవ్వు. పైగా దాచుకోవటం వీలుపడదు. ఎంతటి వారైనా పళ్లికిలించాల్సిందే.

కాదేదీ హాస్యానికనర్హం అంటారు హాస్య రచయితలు. గౌరవ ప్రతిష్ఠలు, మర్యాదలు, 'నీ బాంచెన'లంటూ కూర్చుంటే నవ్వించలేం. అధికార మదాంధులు నడిచే బాటలో అరటి తొక్కలు విసరటం హాస్య రచయిత పని.

లెక్కకు మించిన ఇబ్బందులతో, మన సహనాన్ని పరీక్షించి, నరకానుభవాన్ని తలపిస్తున్న ఈ లోకంలో నవ్వే ప్రతిమనిషీ ఎగరవేయగలిగిన తిరుగుబాటు జెండా.

చెట్టులా కనిపించని చెట్టొకటి పెరుగుతుంది చిలీ దేశంలో, దాని పేరు మంకీ పజిల్.

హాస్యమంటే ఏమిటో నిర్వచించ ప్రయత్నించారు తాత్వికులు. ఇది చూసి నవ్వుకున్నారు జనం. అరిస్టాటిల్, ప్లేటో, సోక్రటీస్, కాంట్ లాంటి వాళ్లందరూ "హాస్యరసమంటే..." అంటూ ప్రారంభిస్తారు. కాని దీని రహస్యమేమిటో, ఏ గ్రంథులు, ఏ అణుసముదాయం మనలో ఈ ప్రతిస్పందన కలిగిస్తాయో మాత్రం ఎవరికీ అంతు పట్టలేదు.

"భేషజం లేని వాళ్లే సహజంగా నవ్వగ

లరు" అన్నాడు పద్దెనిమిదవ శతాబ్దికి చెందిన ఇటాలియన్ తత్వవేత్త వికో.

ఇంగ్లిష్ సాహిత్యంలో ఐరిష్ హాస్యానికో ప్రత్యేకత ఉంది.

"మాకు సీరియస్ ఆలోచనలు రావని కాదు. కాని మా సీరియస్‌నెస్ చుట్టూ హాస్య మనే హేలో ఉంటుంది. జీవిత తాత్వికతను చిరునవ్వుతో వ్యాఖ్యానించటం మా స్వభావం. షా, జె.ఎం.సింజ్, వైల్డ్, ఈట్స్ లాంటి వాళ్ల అనేక గంభీరమైన విషయాలను జోకుల్లా మార్చారు. మా జీనియస్లులందరూ హాస్యరుషులు. వాళ్ల జ్ఞానబోధ వ్యంగ్యోక్తుల రూపంలోనే ఉంటుంది. అందువల్లనే ఐరిష్ హ్యూమర్ అంటే ఇంగ్లీషువాళ్లకు భయం." అన్నాడు షానోకేసీ.

* * *

జీవితంలో విషాదం ఉంది. విషాదంలోంచే హాస్యం పుడుతుంది.

* * *



గొగోల్

"ఇరుగు పొరు గుల్నీ, పొట్టీ, పొడుగు, గుడ్డీ, మెల్లా, నత్తీ ఉన్న వాళ్లను చూసి ఎద్దేవా చేయటమెం దుకు? మనమీద సవారీ చేస్తున్న దుర్మార్గుల్ని, దోపిడీదార్లని, నియంతల్ని చూసి నవ్వు. మనం వ్యంగ్యాస్త్రాలు సంధించాల్సింది వాళ్ల మీద." అన్నాడు గొగోల్.



ఈట్స్

హాస్య రచయితల జీవితాలన్నీ విషాదమయమని వ్యాఖ్యానించడం ఒక అలవాటుగా మారింది. నిజానికి అందరి బతుకులూ అంతే. మనం రోజూ చేస్తున్నవన్నీ దుఃఖాన్ని అధిగమించే ప్రయత్నాలే. హాస్య రచయితలు ఈ విషయంలో మరి కాస్త ఎక్కువ కృషి చేస్తారు విషసర్పాలను ఆడించినట్లుగా. అది వాళ్లవృత్తి.

కష్టాలు కలకాలం ఉండాలని కోరుకుంటారు కాబోలు. ఒక హాస్యరచనను సమీక్షిస్తూ "ఇందులో ప్రతిమాటా బంగారం" అన్నాడొకాయన. ఇలా పోల్చడం సబబుకాదు. బంగారం ఉన్నచోట సాహిత్యమే ఉండదు. ఇంక హాస్యమెక్కడ? బంగారాన్ని ధిక్కరించి ఎద్దేవా చేసినప్పుడే కదా మనం నవ్వుకునేది.

హాస్యమంటే నాన్సెన్స్ అంటారా? సెన్స్ ఉన్నా రాజకీయ, ఆర్థిక, సామాజిక నిపుణులే కదా మనని సమస్యల సుడిగుండాలలోకి నెడుతోంది.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

## చతుర సమీక్ష

ఫిబ్రవరి 'చతుర' నవల ఎవరు?

సమీక్షకుని పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

# కాలాతీతం

ఫ్రెంచ్ నవల

## ఫాదర్ గోరియా

బాల్జాక్

(1835)

ప్రముఖ ఫ్రెంచ్ నవలాకారుడు బాల్జాక్ నవల 'ఫాదర్ గోరియాకు', షేక్స్పియర్ నాటకం 'కింగ్ లియర్'కూ పోలిక చూస్తారు కొందరు. ఉన్నదంతా కృతజ్ఞత లేని కూతుళ్ళకిచ్చి బికారులైన తండ్రులే ఇద్దరూ.

ఈ నవల కథా కాలం 1819. ఇతివృత్తంలోకి వస్తే, మదాం వాకర్ నడుపుతున్న బోర్డింగ్ హౌజ్ (పేదలకు భోజనవసతి, సౌకర్యాలు కల్పించే చోటు)లో ఆరేళ్ళుగా ఉంటున్నాడు గోరియా. ఒకప్పుడు బాగా బతికినవాడే. ఉన్న వస్తువులొక్కొక్కటే అమ్ముకుని దీనావస్థకు చేరుకున్నాడు. డబ్బంతా ఏం చేశాడని అందరికీ అనుమానం. స్టాక్ ఎక్స్ఛేంజిలో లేదా ఆడవాళ్ళ మీద పెట్టి ఉంటాడు. స్త్రీ వ్యసనం ఉండని మగవాళ్లెవరు? అప్పుడప్పుడూ ఇద్దరు ఫాషనబుల్ పడతులు వచ్చిపోతుంటారు కూడాను.


బాల్జాక్

"ఇది మర్యాదస్తులుండే చోటు. బ్రోతెల్ కాదు" అంటూ చీవాట్లేసింది మదాం వాకర్.

"ఆ పిల్లలు నా కూతుళ్లు" అంటూ నసిగాడు గోరియా. కూతుళ్ళట! అంత డబ్బున్న పిల్లల తండ్రి ఈ పేద కొంపలో ఎందుకుంటాడు అనే అనుమానంఅవిడకు. మూడేళ్ల తర్వాత ఖర్చులు మరింత తగ్గించుకున్నాడు గోరియా. మరింత చిన్నగదికి మారాడు. చిరిగిన దుస్తులు ధరించేవారు. ఆడపిల్లలు రావటం మానేశారు.

"నీ కూతుళ్ళు రారేం"? అంటూ ఎత్తిపొడిచింది మదాం వాకర్.

ఉన్నదంతా పిల్లలకు ఊడ్చిపెట్టిన గోరియా పాత్ర పాఠకులకు కంటతడి పెట్టిస్తుంది. తండ్రి ప్రేమకు హద్దులుండవు. ఆత్మత్యాగం చెయ్యటంలోనే ఆనందం అనుభవిస్తాడు గోరియా. ఇద్దరు కూతుళ్ళు డెల్ఫైన్, అనాస్టాసీ. అడిగితే కొండమీది కోతినైనా తెచ్చిస్తాడు. వాళ్ల సుఖమే అతడి ఏకైక లక్ష్యం. ఘనంగా కట్నాలిచ్చి పెళ్లిళ్లు చేశాడు. ఒక అల్లుడు ఫ్రెంచి అరిస్టోక్రాట్, మరొకడు జర్మన్ బ్యాంకర్. ఇంకా ఏమన్నా లాగొచ్చేమోనని కూతుళ్ళు కొన్నాళ్లు తండ్రిని బాగానే చూశారు. రాదని తెలిసి తమ ఇళ్లకు రావద్దని ఆంక్షలు పెట్టారు.

అవసరాలన్నీ తగ్గించుకుని, ఉన్నవన్నీ అమ్మి గోరియా వాళ్లకేవో ఇస్తూనే ఉన్నాడు. సిగార్లు తాగటం మానేశాడు. ఒక పూట

భోజనం చెయ్యకపోయినా ఫరవాలేదు. ఎంత మిగిలినా మిగిలినట్టే. పిల్లలకేమైనా కొనొచ్చు "వాళ్ళ కోసం ఏమైనా చేస్తాను" అని తెగింపుగా చెప్పేవాడు. చెప్పటమే కాదు. చేసి చూపించటానికి కూడా సిద్ధపడ్డాడు. కాని కూతుళ్లకు మాత్రం గోరియా ఒక "ముసలి పీనుగు", త్వరగా ఛస్తే పీడా పోను" అనుకుంటుంటారు. వాళ్లు ప్రేమించనందుకు కూడా అతడికి బాధ లేదు. వాళ్ల కోసం తను, తన కోసం వాళ్ళు కాదు. అది పిచ్చి ప్రేమ. తండ్రి ప్రేమ. తన డబ్బు, కానుకలు తీసుకున్నప్పుడైనా వాళ్లొక్కసారి నవ్వితే చాలు.

గోరియాకు సమాంతరంగా మరో పాత్ర కూడా ఉంటుంది నవలలో. డబ్బు సంపాదించి, సమాజంలో పైకెగబాకాలని పారిస్ నగరానికి వచ్చిన యువకుడు యూజీన్ ది రాస్టిగ్నాక్. ధనవంతులతో పరిచయం పెంచుకోవటం ద్వారా సమాజంలో హోదా కూడా వస్తుంది. అందుకే డెల్ఫైన్, అనాస్టాసీల దృష్టి నాకర్షిస్తాడు. వాళ్ళ భర్తలతో స్నేహం చేస్తాడు. గోరియాను ఎంత చులకనగా చూస్తున్నారో అర్థమవుతుంది అతడికి. పైకి ప్రేమలు నటించినా, గోరియా కూతుళ్ల దాంపత్యాలలో సుఖం లేదు. అందరూ అహంకారులు. స్వార్థపరులు.. భార్యాభర్తల మధ్య కూడా ఎవరి జీవితం, ఎవరి సంతోషం వారిదే. అత్యాశ, తమ విపరీత వాంఛలు తీర్చుకోవటానికి ఏమి చెయ్యటానికైనా సిద్ధం. నీతి, అవినీతి, మంచి చెడు మధ్య తేడాలు లేవు. వాళ్ళను శాసిస్తున్నది ధనం. ఎంత సంపాదించినా చాలదు.




యూజీన్‌కు కూడా డబ్బు కావాలి. వాత్రిన్ అనబడే ధనపిపాసి ఒక సలహా ఇస్తాడు. విక్టోరైన్ టాల్ఫర్ ఒక ధనిక యువతి. ఆమెకో అన్న ఉన్నాడు. అతణ్ణి డ్యూయెల్ (ప్రత్యర్థుల మధ్య యుద్ధం)లో చంపేస్తే మిలియన్ ఫ్రాంకుల ఆస్తి ఆమెకే దక్కుతుంది. అప్పుడామెను పెళ్లాడి సుఖపడవచ్చు ఈ వ్యూహం చెప్పినందుకు తనకు యిరవై శాతం ఇవ్వాలి. యూజీన్ సందిగ్ధంలో పడతాడు. నిజానికి అతడు డెల్ఫైన్ పట్ల ఆకర్షితుడైనాడు. అందువల్ల గోరియాతో సాన్నిహిత్యం పెంచుకుంటాడు.

తన కూతురూ, యూజీన్ కలుసుకోవటానికి అనువుగా ఒక అపార్ట్‌మెంట్ కూడా కొంటాడు గోరియా. ఇది అతడి స్తోమతకు మించిన విషయం కాని కూతురు తన కళ్ల ముందు తిరుగుతూ కనిపిస్తుందంటే ఏమైనా చెయ్యటానికి సిద్ధం.

విక్టోరైన్ సోదరుడు డ్యూయెల్‌తో మరణించాడని తెలుసుకుంటాడు యూజీన్. ఈ హత్యతో సంబంధం లేకపోయినప్పటికీ, వాత్రిన్ తప్పించుకు తిరుగుతున్న నేరస్తుడని తెలుసుకుంటారు పోలీసులు. అతడి డ్రింకులో మత్తు మందు కలిపి అరెస్టు చేస్తారు.

యూజీన్, గోరియా బోర్డింగ్ హౌజ్ ఖాళీ చేసి మరో చోట సెటిల్ కావాలనుకుంటారు. అంతలో, భోరుమని ఏడుస్తూ డెల్ఫైన్ వస్తుంది. జర్మన్ భర్త ఆస్తంతా లాక్కున్నాడు. యూజీన్ కావాలనుకుంటే దానిమీద హక్కు లేదని రాసివ్వాలట. అంటే, గోరియా చేసిన త్యాగమంతా గాలిలో కలిసిందన్నమాట. ఇంతలో అనాస్టాసీ కూడా వస్తుంది. తన ప్రేమికుడి అప్పులు తీర్చటానికి ఆమె తన నగలన్నీ అమ్ముకుంది. ఈ రహస్యం తెలిసిన భర్త, ఆస్తంతా తన పేర రాయించుకున్నాడు. మొత్తంమీద ఆమెకింకా 12,000 ఫ్రాంకులు తక్షణం కావాలి. గోరియా దగ్గర చిల్లి గవ్వ లేదు. ఉన్నదంతా పోగు చేసి పెద్ద కూతురి అపార్టుమెంటు మీద పెట్టాడు.

కూతుళ్లిద్దరూ పోట్లాడుకుంటారు. "మీరు

కీచులాడుకుంటే నేను చూడలేను. చచ్చిపోతాను" అని రోదిస్తాడు గోరియా. అనాస్టాసీ కోపంగా వెళ్లిపోతుంది. తండ్రికి సీరియస్‌గా ఉన్నదని తెలిసీ, డెల్ఫైన్ తన ప్రియుడు యూజీన్‌తో నాటక ప్రదర్శనకు వెళుతుంది. మర్నాడు గాని ప్రేమికులకు ముసలి గోరియా జ్ఞాపకం రాడు. అప్పటికి అతడి పరిస్థితి మరింత దిగజారుతుంది. చిన్న కూతుర్ని పోటు వస్తుంది. కూతుళ్ళు మాత్రం చివరి చూపుగా కూడా రారు. అయినా వాళ్ల మీద మమకారం చావదు. "పాపం, చిన్న పిల్లలు" అనుకుంటాడు. అతి గారాబం వల్ల "ప్రేమ, బాధ్యత" అంటే ఏమిటో తెలియకుండా పెరిగారు వాళ్లు. తప్పు తనదే వాళ్లనెందుకు నిందించటం? !

అంతలోనే కోపం వస్తుంది. పిల్లల్ని తక్షణం తీసుకు రమ్మని మనిషిని పంపు

## బాల్జాక్ (1799-1850)

"ప్రపంచ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన గొప్ప నవలాకారులెందరో! అందరూ అద్భుత ప్రతిభావంతులే, నిరంతర కృషి ఫలితంగా ప్రతిభ రాణిస్తుంది. నా దృష్టిలో బాల్జాక్ ప్రతిభావంతుడు కాదు. జీనియస్. అలాంటి రచయిత మరొకడు లేడు. ఎంత ప్రయత్నించినా మరెవరూ అలా రాయలేరు" అన్నాడు సామర్‌సెట్ మాం. "తోడేళ్ల రాజ్యంలో, ఒక తోడేలు కథలు రాస్తే, వాటి రక్తపిపాస చాల సహజమన్నట్టుగానే చిత్రిస్తుంది. ఈ సమాజంలో ధనాశ, దురాశ ఉంటే తప్పేమిటంటాడు బాల్జాక్ అని వ్యాఖ్యానించాడు అప్టన్ సింక్లెయిర్.

సమకాలీన ఫ్రెంచి సమాజాన్ని యథాతథంగా చిత్రించటమే తన లక్ష్యమన్నాడు బాల్జాక్. సుమారు నాలుగువేల పాత్రలతో ఒక బృహద్రచన చెయ్యాలని కోరిక. అనేక వేల పేజీల పుస్తకం పాఠకుల సౌలభ్యం కోసం నవలలుగా, కథలుగా ప్రచురించవచ్చు. పుస్తకాలకు వేర్వేరు పేర్లు పెట్టినా, సమగ్ర రచనలన్నీ కలిపి "హ్యూమన్ కామెడీ" (ఇటాలియన్ కవి డాంటె కావ్యం "డివైన్ కామెడీ" పేరు దీనికి ప్రేరణ) అని టైటిల్ పెట్టాలని అతని భావన. బాల్జాక్ జీవితం లాగానే, కృషి కూడా అర్ధాంతరంగా ముగిసింది. రెండువేల పాత్రల గురించి మాత్రమే రాయగలిగాడు. ప్రేమ, సెంటిమెంటు కాదు, ఆర్థిక విషయాలు మాత్రమే జీవితాన్ని శాసిస్తున్నాయని చూపిన తొలి నవలా రచయిత బాల్జాక్.

ఆనర్ ది బాల్జాక్ పూర్వీకులు 'బాల్సా'లు. 'ది' అనేది గౌరవ వాచకం. గొప్పకోసం తగిలించుకున్నాడు. వాళ్లది దిగువ మధ్య తరగతి కుటుంబం. 'లా' చదివి, రచయితగా బతకాలని నిర్ణయించుకున్నాడు. తొలి దశలో యాభైకిపైగా "థ్రిల్లర్లు" రాశాడు. సీరియస్‌గా

బాధ పెట్టానని తెలిసి, దగ్గరున్న చివరి వెండి సామాన్లు కొన్ని అమ్మటానికి వేస్తాడు. ఆఖరి క్షణాల్లో కూడా అతడి కోరిక ఒకటే. పిల్లలు బాధ పడకూడదు. చెల్లెలి కోసం వెండి అమ్ముతున్నాడని డెల్ఫైన్‌కు అసూయ. అతడి మీద కోపం. తండ్రికి తనంటే ప్రేమ లేదని యూజీన్‌కు చెబుతుంది. ఆయనింకెక్కువ రోజులు బ్రతకడు. వెళ్ళి చూడమంటాడు యూజీన్. ముసలాడి సంగతెందుకు.? పార్టీ కెడదామంటుంది డెల్ఫైన్. గోరియాకు గుండె

తాడు. "రామంటే, లాక్కు రండి" అని చెబుతాడు మరోసారి. "ఇంతకూ కారణం అల్లుళ్ళే" అంటాడు. మనసు పరిపరి విధాల పోతుంది. "వాళ్ళ కోసం ఇంకా సంపాదించాల్సిందని" ఏడుస్తాడు. యూజీన్ స్వయంగా వెళ్ళి పిలుస్తాడు. డెల్ఫైన్ వస్తానంటుంది. కాని అప్పటికే ఆలస్యమైంది.

చివరి క్షణాన అతడు చూడగలిగింది యూజీన్‌నూ, మరో మెడికల్ విద్యార్థినీ. అంత్యక్రియలకు కూడా సరిగా డబ్బుండదు.

కూతుళ్ళు అప్పుడు కూడా రారు. 'ధనాశ' ఆడించిన నాటకాన్ని స్వయంగా దర్శించిన యూజీన్ పారిస్‌ను గెల్చుకోవటమే తన ధ్యేయమనుకుంటాడు.

* * *

పంథొమ్మిదవ శతాబ్ది పారిస్ నగర జీవితానికి అద్దం పట్టిన నవల 'ఫాదర్ గోరియా'. ధనికుల స్వార్థపూరిత విలాసాలు, వాళ్లను అనుకరిస్తూ ఎలాగైనా పైకి ఎగబాకాలనుకునే మధ్య తరగతి మనుషులు, మానవీయ విలువలకు, ప్రేమాభిమానాలకు తిలోదకాలిచ్చిన యువతీ యువకులు, పిల్లల కోసమే బతికి, జీవన చరమాంకంలో దయనీయమైన బతుకీడ్చే వృద్ధులు ఇందులోని పాత్రలు. కట్నం కోసం పెళ్లిళ్లు, అక్రమ సంబంధాలు. ప్రేమ ఎరజూపి డబ్బు లాగే నయవంచకులు, ఘరానా వ్యక్తులుగా చలామణీ అయ్యే నేరస్తులు, జూదరులు - వీళ్ళూ ఆ నగర పౌరులు, "సుఖాలు" విసిరిన గాలంలో చిక్కుకున్న చిరుచేపలందరూ. బోర్డింగ్ హౌజ్‌ను కథా స్థలంగా తీసుకున్న తొలి నవల ఇదే కావచ్చునంటారు సాహిత్య చరిత్రకారులు. భిన్న పాత్రల ప్రతిస్పందనలు ఏక కాలంలో చూపగలిగిన సౌలభ్యం ఇందులో ఉంది.

"మనుషులను మంచి, చెడు అంటూ విభజించి చూడగూడదు. స్వంత అవసరాలకు అనుకూలంగానే అందరూ ప్రవర్తిస్తారు" అన్నది బాల్జాక్ విశ్వాసం. తను స్వయంగా అలాగే జీవించాడు. యూజీన్‌లాగే అతడు కూడా 'డబ్బు, కీర్తి" కోసమే బ్రతికాడు.

"హ్యూమన్ కామెడీ" మొత్తం ఒకటే ఇతివృత్తం అనుకున్నాడు గనక, ఇవే పాత్రలు (ఎప్పటికప్పుడు మరణించినవి తప్ప) మిగతా నవలల్లో, కథల్లో కూడా దర్శనమిస్తాయి. కాని బాల్జాక్ ఇతర కథలలో లేని రచనా నైపుణ్యం, సహజత్వం "ఫాదర్ గోరియా"లో ఉంది.

ఎం. వసంత ✦

---

సాహిత్య ప్రస్థానం ప్రారంభించింది. ముప్పైయ్యవ ఏట. అప్పటి నుండి ప్రతి ఏటా కనీసం రెండు పెద్ద నవలలు, డజను నవలికలు, పాతికముప్పై కథలూ ప్రచురించాడు. రాసినంతసేపూ కాఫీ గొంతు దిగుతుండాల్సిందే. బాల్జాక్ జీవిత కాలంలో తాగిన 50,000 కప్పుల కాఫీయే అతడి మరణానికి కారణమంటారు. అతడి పాత్రలలాగానే, బాల్జాకు కూడా డబ్బే ప్రాణం. విలాస జీవితం, దుబారా ఖర్చులు, బేషజం కోసం చేసే అప్పులు అనంతం. ధనిక స్త్రీ, అయిదుగురు పిల్లల తల్లి అయిన మదాం హన్స్కాను ప్రేమించి, నిరీక్షించి, మరణానికి ఏడాది ముందు వివాహమాడాడు. పాశ్చాత్య రచయితల సంగతి ప్రస్తావించినప్పుడు, వాళ్ల దురలవాట్ల గురించీ, వివాహేతర సంబంధాల గురించీ ఎంతైనా చెప్పుకోవచ్చు కాని రచనా క్రమంలో వాళ్ల కఠోర శ్రమకు విస్తుపోక తప్పదు. 'తిరగ రాయటమంటే బాల్జాకు ఇష్టం. మొదట రఫ్ డ్రాఫ్ట్ ప్రింటర్ ప్రూఫ్ పంపిస్తాడు. దాని ఆధారంగా కొత్త డ్రాఫ్ట్ రాస్తాడు. మళ్లీ ప్రూఫులు, మళ్లీ తిరగ రాత. ప్రింటర్‌కూ, రచయితకూ తగాదాలు అనేక సార్లు (ప్రింటర్లకు) నష్టపరిహారం కూడా చెల్లించుకున్నాడు.

బాల్జాక్ సుమారు వంద దాకా నవలలు రాశాడు. అందులో ఎప్పటికీ నిత్యనూతనంగా ఉన్న ఆణిముత్యాలు కనీసం రెండు. మొదటిది - 'యూజినీ గ్రాండె' (1833) అమాయకురాలైన హీరోయిన్ (యూజినీ) పిసినారి తండ్రి చేతిలో అనుభవించిన నరకాన్ని, ప్రియుడు చేసిన మోసాన్ని చిత్రించిన కరుణ రసప్రధానమైన నవల. అందులో పిసినారితనాన్ని విశ్లేషించిన తీరు ప్రశంసనీయం. రెండవది - ఒకే ఒక్క నవల ద్వారా బాల్జాక్‌ను పరిచయం చేసుకోవాలనుకున్న వాళ్లు చదవవలసినది 'ఫాదర్ గోరియా' (Le Pere Goriot).

ఏమిటా నవల?
ఏమిటి దాని ప్రత్యేకత?
ఎందుకంత సంచలనం?
ఎవరి నోట విన్నా దాని
గురించిన చర్చే ఎందుకు?
ఆ నవల ప్రస్తావన లేకుండా పత్రికలు,
టివి, రేడియోలలో ఇంటర్వ్యూలు
జరగడం లేదు. స్నేహితులు,
ప్రేమికులు, విద్యార్థులు... అందరూ
ఆ నవల విశ్లేషణలో తలమునకలై
పోవడానికి కారణమేమిటి?
ముఖ్యమంత్రి మొదలుకుని
కిందిస్థాయి సిబ్బంది వరకు...
ఆఖరుకు కోర్టులో జడ్జీలు, లాయర్లు
ఆ నవల గురించిన తర్జన భర్జనల్లో
పడ్డారంటే... అంతగా ప్రభావం
చూపించిన ఆ నవలలోని ఇతివృత్తం
ఏమిటి? సమాజాన్ని కుదిపేసే
శక్తి దానికెలా వచ్చింది?
సరికొత్త కథాంశంతో, ఆధునిక
విపరీత పోకడలపై వ్యంగ్యాస్త్రాలను
సంధిస్తూ అందరినీ ఆకట్టుకుని
ఆసక్తిగా చదివించే ప్రవాసాంధ్రుడు
***శరత్*** నవల ***ఏవరు?***
ఈ నెల చతుర కానుక.







తెలుగు నవలా ప్రపంచంలో, పాఠకులలో 'ఎవరు' నవల కలిగించిన సంచలనం అంతాఇంతా కాదు. ఎవరి నోట విన్నా, ఏ కాలేజీలోనయినా, ఏ ఇద్దరు స్నేహితులు కలుసుకున్నా, ప్రేమికులు కలుసుకున్నా ఆ నవల గురించే చర్చ. ఆ నవల చదవనివారిని అమాయకుల్లా జనాలు భావిస్తున్నారు. ఏ రాజకీయ నాయకుడి ఇంటర్వ్యూ కానీ, లేక సినిమా వారి ఇంటర్వ్యూ కానీయండి లేక ఏ గొప్పవారితోనన్నా రేడియో చర్చలు కానీ, టివిలో చర్చలు కానీయండి అందులో 'ఎవరు' నవల గురించి ప్రస్తావన కానీ, దానిపై అభిప్రాయం అడగడం కానీ వుండకుండా వుండదు.

ఆ నవలను సత్యశ్రీ అనే వర్థమాన రచయిత రాశాడు. నిజం నిష్ఠూరంగా వున్నా సరే సత్యాన్నీ అందరికీ విడమర్చి చెప్పాలన్నది అతని పాలసీ. ఈ నవల రాసినందుకు గానూ ఆ రచయితను మెచ్చుకోవాలో లేక నిందించాలో తెలవక చాలామంది తికమక పడుతున్నారు. ఇటువంటి రచనలు సమాజానికి ఏమయినా మేలు చేస్తాయా లేదా అన్నది ఎవరికీ అర్థం కావడం లేదు. మేధావులు ఈ మధ్య తరచుగా ఈ విషయం మీద వాదోపవాదాలు జరుపుకుంటున్నారు. కొంతమంది ఇటువంటి నవలలు సంఘానికి మేలు చేస్తాయని అందువల్ల ప్రజలలో అక్రమ సంబంధాలు అంటే భయం ఏర్పడి బుద్ధిగా వుంటారని తద్వారా సంఘంలో నీతి పెరిగి జనం చాలా వరకు ఋజువర్తనులై వుంటారనీ కొందరంటారు. మరికొందరు ఇటువంటి నవలలను నిషేధించాలనీ ఇటువంటి రచనల వల్ల సమాజానికి ఏ మాత్రమూ ఉపయోగం లేదనీ, కొన్ని కాపురాలు కూలిపోతున్నాయనీ, చాలామంది భర్తలు భార్యలను అనుమానంగా చూస్తున్నారని ఇంకా అలాంటివే చాలా జరుగుతున్నాయనీ, ప్రజలలో స్వేచ్ఛ తగ్గిపోయి ఒకరిపట్ల ఒకరికి నమ్మకం బదులుగా అనుమానం ఏర్పడుతున్నదనీ వాదిస్తారు.

సత్యశ్రీ మటుకు ఈ నవల మీది సంచలనాలు, వివాదాలు గమనిస్తూ 'తాంబూలాలిచ్చేశాను ఇక తన్నుకు చావండి' అన్న పద్ధతిలో కులాసాగా కాలం గడుపుతున్నాడు.

ముఖ్యమంత్రి శేషాచలం ఆ రోజు చాలా సంతోషంగా వున్నాడు. అధిష్ఠానవర్గాన్ని ఎలాగో ఒప్పించి అసమ్మతి వాదులయిన ఇద్దరు మంత్రులను మంత్రివర్గం నుండి తప్పించాడు. ఆ సంతోషంతో విలేఖరుల సమావేశం ఏర్పాటు చేశాడు. విలేఖరుల ప్రశ్నలన్నింటికీ సంతోషంగా జవాబులిచ్చాడు.

ఈతరం దినపత్రిక విలేఖరి రేవన్. అది సాయంకాలం వెలువడే దినపత్రిక. ఈ మధ్యనే చాలా ప్రసిద్ధి చెందుతోంది.

" 'ఎవరు' నవల మీద మీ అభిప్రాయం ఏమిటి? " అని అడిగాడు రేవన్.

టివిలో ఆ విలేఖరుల సమావేశం లైవ్ వస్తోంది. వీక్షకులు అందరూ ఆసక్తిగా ముందుకు వంగారు ముఖ్యమంత్రి ఏం సమాధానం చెబుతాడో అని. ఆ ప్రశ్న అడగాలని తమకు తోచనందుకు ఇతర విలేఖరులు నాలుక కరచుకొని ముఖ్యమంత్రి సమాధానం సరిగ్గా వచ్చేలా టేప్ రికార్డర్లూ, మైక్రోఫోన్‌లు సరిగ్గా పట్టుకున్నారు.

పాత్రికేయుల సందడి చూసి ఇదేదో ముఖ్యమయిన నవలలా వుందే అని భావించి చదవలేదు అంటే బావుండదేమో అని "నవల బావుంది" అని క్లుప్తంగా అన్నాడు.

"ఆ నవల భావాలతో ఏకీభవిస్తారా? "

శేషాచలం ఏం సమాధానం చెప్పాలో తెలీక మనసులో గింజుకున్నాడు. కానీ అందరూ చూస్తున్నారని "చాలా గొప్ప భావాలు అవి. ఏకీభవిస్తున్నాను" అన్నాడు.

ఒక నిముషం నిశ్శబ్దం. పాత్రికేయులూ, ప్రేక్షకులలో కొందరు సంతోషపడ్డారు.

## రచయిత పరిచయం

శరత్ పుట్టిందీ, పెరిగిందీ నల్లగొండ జిల్లా నూతనకల్లులో. స్థిరపడింది మాత్రం కెనడాలోని నయాగరా ఫాల్స్‌లో. (భౌతికంగా, మానసికంగా మాత్రం ఎప్పుడూ భారత్‌లోనే ఉంటానంటారు!). ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.ఎ., పుణె విశ్వవిద్యాలయంలో కంప్యూటర్ మేనేజ్‌మెంట్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేశారు. పెరుగుతున్న వయసులో మధుబాబు, గిరిజ శ్రీ భగవాన్ నవలలు చదివిన ఆ రోజులు, గల్లీల్లో మిత్రులతో అమ్మాయిల గురించి పెట్టుకున్న ముచ్చట్లు గుర్తుకు వస్తే ఎప్పుడు భారత్‌కి వచ్చేద్దామా అనిపిస్తుందంటారు. ప్రస్తుతం యుఎస్‌లో సీనియర్ సాఫ్ట్‌వేర్ ఎనలిస్ట్‌గా ఒక బేంక్‌లో పనిచేస్తున్నారు. రోజూ యుఎస్‌కి, కెనడాకి నయాగరా రివర్ క్రాస్ చేస్తూ అప్ ఎండ్ డౌన్ చేస్తారు. శరత్ ఇల్లు కూడా నయాగరా నది పక్కనే ఉంటుంది. ఆ నది ప్రవాహ సవ్వడిని వింటూ, గలగలా పారే ప్రవాహాన్ని చూస్తూ, పక్షుల కిలకిలారావాల్ని వింటూ, పావురాల సందడి చూస్తూ చెట్ల కింద సిమెంట్ బల్లపై కూర్చొని రచనలు చేయడం అంటే ఆయనకెంతో ఇష్టం. స్కైయింగ్, క్యాంపింగ్, ట్రావెలింగ్ ఆయన హాబీలు. 'నేస్తమా... ఇంక సెలవు', 'తుది శ్వాస', 'జలధార', 'ఫ్లాష్ ఫ్లాష్', 'రోబో రేప్', 'ఎయిడ్స్' నవలలు ఇంటర్‌నెట్ సర్క్యులేషన్‌లో ఉన్నాయి. హిప్నాటిజం ఇతివృత్తంగా 'నీ రాధను నేను'అనే కథను రాశారు. ఈ తరం పాఠకులకి రేపటి తరం సబ్జెక్ట్‌లతో రచనలు అందివ్వాలనేది తన అభిలాష అంటారు.

**నాగం శరత్**
171, మెక్‌బ్రైడ్ డ్రైవ్, సెయింట్ కేథరిన్స్ ఒంటారియో, కెనడా, ఎల్2ఎస్4ఇ3

కొందరు అసంతృప్తి చెందారు.

ముఖ్యమంత్రి తన సీటులోనుండి లేవబోతుండగా రేవన్ "ఒక్క నిమిషం సార్. మీ బ్లడ్‌గ్రూప్ ఏమిటి?" అని అడిగాడు.

"బి పాజిటివ్. ఎందుకు?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

ముక్కున వేలు వేసుకున్నారు చూస్తున్న ప్రేక్షకులు. హవ్వ హవ్వ ఎవరయినా బి పాజిటివ్ అని చెబుతారా, అది నిజంగానే తన గ్రూప్ అయినా సరే. ఏ 'ఓ' గ్రూపో లేక 'ఏ' గ్రూపో అనో చెప్పాలి కానీ అని అనుకున్నారు. కొంతమంది నిజాన్ని ధైర్యంగా చెప్పిన ముఖ్యమంత్రిని మెచ్చుకున్నారు.

ఆ ప్రశ్నను పట్టించుకోకుండా "మీ శ్రీమతి బ్లడ్‌గ్రూప్ ఏమిటి?"

ఇవన్నీ ఎందుకు అడుగుతున్నాడో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూనే "గుర్తుకు లేదు".

"మీకు ఎంతమంది పిల్లలు?"

ఈ ప్రశ్నలన్నీ విటుదారి తీస్తున్నాయో ప్రెస్ సెక్రటరీ కనకాంబర రాజు గమనించగలిగాడు. అలాగే పాత్రికేయులూ, చాలామంది ప్రేక్షకులు కూడా పసిగట్టగలిగారు.

ఎందుకివన్నీ అడుగుతున్నాడో సందర్భం ఏమిటో అర్థం కాక అసహనంగా "అయిదుగురు" అన్నాడు

"మీ మొదటి సంతానం బ్లడ్ గ్రూప్?"

ముఖ్యమంత్రి నోరు తెరిస్తే చాలు ముఖ్యమంత్రి రాజకీయ జీవితం సమాధి అయే అవకాశాలు ఉండవచ్చునని గ్రహించి ప్రెస్ సెక్రటరీ కనకాంబరరాజు "ముఖ్యమంత్రి గారికి ఇంకో ముఖ్యమయిన పని వుంది. సమావేశం ముగిస్తున్నాము" అని విలేఖరులకు చెప్పి శేషాచలాన్ని కళ్లతోనే వారించాడు.

"అవునవును. ఇప్పటికే ఆలస్యం అయింది. మరోసారి మాట్లాడుకుందాము" అని త్వరత్వరగా సెలవు తీసుకున్నాడు శేషాచలం.



తగినంత మసాలా దొరక్క విలేఖరులు ఉసూరుమన్నారు. ధైర్యంగా ఈ ప్రశ్నలు అడిగినందుకు తోటి విలేఖరులు రేవన్‌ని అభినందించారు. కీలకమయిన వ్యక్తిగత ప్రశ్నకి ముఖ్యమంత్రి సమాధానం దాటవేయడంతో టివి ప్రేక్షకులు ఆశాభంగం చెందారు.

కారులో ఇంటికి వెళుతూ రాజుని అడిగాడు శేషాచలం "ఎవరు' నవల గొప్పదనం ఏమిటి? అందరి ముందూ అడిగేసరికి బావుండదని చదివానని చెప్పానుగానీ మనకంత తీరిక వుంటుందటయ్యా? "

"సార్. మీరు ఆ నవల చదవలేదా. చదివే ఆ విలేఖరి అడిగిన ప్రశ్నలకి సమాధానం ఎందుకిస్తున్నారో అని అనుకున్నాను".

"ఆ విలేఖరి మా బ్లడ్‌గ్రూప్స్ గురించి అడిగాడు. అంతేకదా. ఆ నవలకు దానికి ఏమిటి సంబంధం? "

"చాలా వుంది సార్. ఆ నవల చదివితే మీది బి గ్రూప్ అని చెప్పి ఉండకపోదురు"

"బి గ్రూప్ చేసిన నేరమేమిటయ్యా? " ఆశ్చర్యపడిపోతూ అడిగాడు.

"సార్. ఆ నవల రిలీజ్ అయిన దగ్గరి నుండీ ఎవరైనా తమది బి గ్రూప్ అని చెప్పుకోవాలంటే సిగ్గుపడుతున్నారు. అందరూ ఓ అనో, ఏ అనో చెప్పుకుంటు న్నారు. బి గ్రూప్ వున్న అమ్మాయిలను అబ్బాయిలు పెళ్ళి చేసుకోవడం లేదు. అలాగే అమ్మాయిలు కూడా బి గ్రూప్ అబ్బాయిలంటే పెదవి విరుస్తున్నారు."

"అలాగా. ఎందుకు బి గ్రూప్ అంటే అంత విముఖత్వం"

"ఎక్కువ మంది నేరగాళ్ళ బ్లడ్‌టైప్ బి నేనట. వాళ్ళలో మోసకారులూ, నమ్మదగని వారూ వుంటారట"

"అలాగా. మరి మా పెద్దాడి గ్రూప్ చెప్ప బోతే ఎందుకు ఆపావో అర్థం కాలేదు"

"అది... అది మీకు నేను డైరెక్ట్‌గా చెప్ప లేను సార్. ఆ నవల చదివి మీరు తెలుసు కుంటేనే బావుంటుంది".

"చెప్పవయ్యా ఫర్వాలేదు"

"వద్దు సార్. బాగుండదు. నేను చెబితే ఎందుకు బాగుండదో మీకు ఆ నవల చది వితే తెలుస్తుంది. ఆ నవల చదివిన తరు వాత మా మీద నీకు అనుమానమా అని అనుకునేరు. ఎందుకయినా మంచిదని నేను మిమ్మల్ని సమాధానం ఇవ్వకుండా వారిం చాను. ఆ నవల చదివాకనే మీరు అటు వంటి ప్రశ్నలకి సమాధానం ఇస్తే మంచిది. తెలిసీ తెలియక సమాధానం ఇస్తే మీ పరువు పోయే ప్రమాదం వుంది సార్"

"అయితే ఆ నవల నేనూ చదువుతాను. ఎల్లుండి పెద్దగా అధికార కార్యక్రమాలు లేవు కదా. విశ్రాంతి తీసుకొని చదువుతాను. ఫ్యామిలీతో గడిపినట్లూ వుంటుంది".

"ఒక చిన్న జాగ్రత్త చెప్పమంటారా సార్"

"ఏమిటి"

"మీరు ఆ నవల చదువుతున్నట్లు మేడంకు తెలవకపోవడం మంచిది"

"? !"



రవీంద్ర అప్పుడప్పుడే స్థిరపడుతున్న హీరో. అతడికి భార్యా, ఒక కొడుకు ఉన్నారు. అన్యోన్యమయిన జీవితం. ఆ మధ్య ఒక సినిమా వారపత్రికలోని 'తుంటర్వ్యూ' కాలమ్‌కి ఇంటర్వ్యూ ఇచ్చాడు. అందులో విలేఖరి అడిగితే అమా యకంగా బ్లడ్ గ్రూప్ బి అని చెప్పాడు. ఆ విషయాన్ని ప్రముఖంగా ప్రచురించింది ఆ పత్రిక.

అప్పటి నుండీ అభిమానుల నుండి వచ్చే ఉత్తరాలలో 'మీది బి గ్రూప్ కదా. మీది సంకుచితమయిన మనస్తత్వం అయి వుంటుంది. మీరు జీవితంలో ఎందరిని మోసం చేశారు? మీరు అంత నిజాయితీ పరులు కాదనుకుంటాను' అని అడుగుతుం డటం చూసి ఈ బ్లడ్ గ్రూప్‌ల గొడవేమిటి అని తన అసిస్టెంట్‌ని అడిగాడు.

'ఎవరు' నవల గురించి చెప్పాడు అసి స్టెంట్.

పెద్దగా నవలలు చదవని రవీంద్ర కాస్త వీలు చూసుకొని ఆ నవల చదివాడు. చది విన తరువాత ఏదో అనుమానం లీలగా మొదలయ్యింది. మొదట్లో ఆ అనుమా నాన్ని తేలిగ్గా కొట్టిపారేశాడు. తీసిపారేసు కున్నాడు.

ఆ మధ్య అవకాశాలు తగ్గాయి. షూటిం గ్‌కి సమయానికి రాడని, డబ్బుల గురించి వేధిస్తాడని ఏవేవో చాడీలు, ఫిర్యాదులు

ఎక్కువయ్యాయి. బి గ్రూప్ అని తెలవ డంతో ఆ ఫిర్యాదులకి ఇంకా మసాలా ఎక్కువయింది. దానితో ఇంకా అవకాశాలు తక్కువకాసాగాయి. దానితో కొంచెం తీరిక ఎక్కువయ్యి మనసుకి ఖాళీ దొరికి ఉన్న చిన్న అనుమానం పెనుభూతం కాసాగింది. తన సినీ కెరీర్ కాస్త ఇబ్బందిలో పడటంతో ఆ ఉక్రోషాన్ని ఇప్పటికే కాస్త భార్య మీద చూపించడం మొదలుపెట్టాడు. తన అను మానం కనుక నిజమయితే అప్పుడు భార్య సంగతి ఇంకా చూడాలి అనుకున్నాడు. తన ఓటమికి తననే బాధ్యుడిని చేసుకోలేక తనకు తెలవకుండానే కోపాన్ని, క్షోభను భార్య మీదికి మళ్ళిస్తున్నాడు.

ఎంతో అన్యోన్యంగా వుండే భర్త ఇలా ఎందుకు తయారవుతున్నాడో రమణికి అర్థం కావడంలేదు. సినీ అవకాశాలు తక్కు వయి కోపాన్ని తన మీద వెళ్ళదీస్తున్నా డేమో అని మొదట్లో సర్దుకుంది కానీ భర్త ధోరణి అలాగే కొనసాగుతుండటంతో ఈ మధ్య బాగా వ్యధకు లోనవుతోంది. రవీం ద్రకి కూడా తన మనస్తత్వం ఎలా సంకుచి తంగా తయారవుతున్నదో అర్థం కాసా గింది. బి గ్రూప్ రక్తం కావడం వల్లనే ఇలా ప్రవర్తిస్తున్నానా అనికూడా ఆలోచించసా గాడు. తనలో వున్న అనుమానం నివృత్తి కావాలంటే రమణికి రక్త పరీక్ష చేయిం చాలి. రమణి కూడా 'ఎవరు' నవల గురించి చదివేవుంటుంది, లేదా వినే ఉంటుంది. రక్తపరీక్షకి అడిగితే వేరే విధం గా భావించవచ్చు ఆమెకు అనుమానం రాకుండా రక్తపరీక్ష చేయించడం ఎలా?

ఆ అవకాశం రానే వచ్చింది రవీంద్రకి. రమణి విజయవాడకి వెళ్ళి చుట్టాల కార్లో వస్తుండగా ప్రమాదం జరిగి బాగా రక్తం అవసరమయింది. అప్పుడు రక్త పరీక్ష చేస్తే బ్లడ్ గ్రూప్ ఏ అని తెలిసింది. ఇక రవీంద్ర ముందు ఇంకో ముఖ్యమయిన పని ఉంది... అప్పుడు కానీ అతని అనుమానం నివృత్తి కాదు.

* * *

లక్ష్మికి సంగీతం మీద ఆసక్తి ఎక్కువ, చదువు మీద తక్కువ. అందుకే చదువులో అత్తెసరు మార్కులతో నెట్టుకు వచ్చింది. లోకల్‌గా సంగీత కచేరీలలో పాల్గొనడంతో మంచి ప్రశంసలు, గుర్తింపు లభించాయి.

"బాబాయి భీమవరం నుంచి ఒక సంబంధం తీసుకు వచ్చాడు. ఫోటో చూడమ్మా. పేరు వైభవ్ అట. ఎం.టెక్ చేసి ఏదో చిన్న కంపెనీలో ఇంజినీర్‌గా చేస్తున్నాడట" అని కూతురికి ఫోటో చూపిం చాడు యశస్వి.

ఫోటో చూసింది. వైభవ్ బాగానే ఉన్నాడు. వెంటనే ఆసక్తి పెరిగి "బ్లడ్ గ్రూప్ కనుక్కున్నారా నాన్న గారూ" అని అడిగింది.

అబ్బాయి నచ్చాడని అర్థమయింది యశ స్వికి. "కనుక్కోలేదమ్మా"

"ఈ కాలంలో అదే ముఖ్యమయింది నాన్నగారూ. తెలుసుకోండి. ఇంతకూ నా బ్లడ్ గ్రూప్ వాళ్ళు అడిగారా"

"అడిగారు. చెప్పాను"

తన గ్రూప్ బి కాదు కాబట్టి పెద్దగా అభ్యంతరం వుండక పోవచ్చులే అనుకు న్నది. తను ఓ గ్రూప్‌లోనో లేక ఏ గ్రూప్‌లోనో పుట్టాల్సింది. ఛ. ఎందుకు ఏబి గ్రూప్‌లో పుట్టాను? ఇంకా నయం బి గ్రూప్‌లో పుట్టలేదు అని అనుకున్నది. ఒక రకంగా నయమేలే ఏబి గ్రూప్‌లో పుట్టినం దువల్ల కాస్త కళ అబ్బింది. సంగీతం అంటే ఎంత ప్రాణమో తనకి. బి గ్రూప్ అబ్బాయి దొరికితే కష్టమే. తన అభిరుచిని ప్రోత్స హించక పోవచ్చు ఓ అబ్బాయి అయితే అతగాడు చెప్పినట్లే వినాల్సి రావచ్చు ఏ అబ్బాయి అయితే చాలా వరకు చెప్పినట్లు వింటాడు. ఇంతకీ నాకు ఏ బ్లడ్ గ్రూప్ ఉన్న అబ్బాయి ఇష్టం?

ఇది వరలో జాతకాలు, రాశులు చూసి

పెళ్ళిళ్ళు చేసేవారట. శాస్త్ర విజ్ఞానం పెరిగిన తరువాత అవి పెద్దగా పట్టించుకోవడం మానేశారు. ఆ సమయంలో ఆ ఖాళీని పూరించడానికా అన్నట్లుగా 2024 సంవత్సరంలో అంటే ఒక రెండేళ్ళ క్రితం 'ఎవరు' నవల వచ్చి సంచలనం సృష్టించింది. ఇప్పుడు ఎవరూ బ్లడ్ గ్రూప్‌లు చూసుకోకుండా పెళ్ళిళ్ళు చేసుకోవడం లేదు.

నాన్నగారు ఇంకా పాత కాలం మనిషి, అందుకే అబ్బాయి బ్లడ్ గ్రూప్ అడగడం మరచిపోయాడు.



ఒక వేళ అబ్బాయిది బి గ్రూప్ కాకుండా వేరే గ్రూప్ అయితే ఈ ఏబి గ్రూప్ దాన్ని చేసుకుంటాడా. ఏ ఓ గ్రూప్ అమ్మాయిలనో ఇష్టపడవచ్చు. బి గ్రూప్ వాళ్ళే లోకంలో నలభై శాతం ఉంటారట. వాళ్ళని తను వద్దని, ఓ, ఏ వాళ్ళు తనని వద్దనీ అంటే ఇక చేసుకునేదెవరు? ఏబి వాళ్ళేనా? ఇద్ద రిదీ ఒకే గ్రూప్ అయి ఒకే విధమయిన అభిరుచులుంటే ఏం బావుంటుంది. వైవిధ్యం వుండొద్దూ? ఒక విధంగా అదే మంచిదేమో. ఒకే విధమయిన ఆసక్తులు ఉంటాయి కాబట్టి భర్తతో ఘర్షణ ఉండదు. ఒక సర్వే ప్రకారం ఒక విధమయిన అభిరు చులు కలిగిన దంపతులే గొడవలు లేకుండా సంసారం చేస్తారని చదివింది. ఎటూ తేల్చుకోలేకపోయింది. చూద్దాం అను కుంది.

తనది 'ఓ' నో, 'ఏ' నో అయితే ఎవర యినా కళ్ళు మూసుకొని చేసుకునేవారు. తన తల్లిదండ్రుల వల్లే ఈ ఇబ్బంది వచ్చింది. ఇంతకూ అమ్మానాన్నల గ్రూప్‌లు ఏమిటో తెలుసుకోవాలనిపించింది. వెంటనే చేస్తున్నపని ఆపి వేసి మమ్మీ దగ్గరకి వెళ్ళింది. వినిత మైక్రోవేవ్ ఓవెన్‌లో అన్నం పెడుతోంది.

"మమ్మీ నీ బ్లడ్ గ్రూప్ ఏమిటి? నాన్నగారు కూడా నీ టైప్ తెలిసే చేసుకున్నారా? "

"నాదా బి పాజిటివ్. అప్పట్లో బ్లడ్ గ్రూపులు ఎవరూ పట్టించుకునే వారు కాదు"

మమ్మీకి బి గ్రూప్ కావడంలో ఆశ్చర్యం లేదు అనుకుంటూ" మరి నాన్నగారిది?

"నాకు గుర్తుకు లేదు"

సరే నాన్న గారినే అడుగుతాను అని వెళ్ళి గార్డెనింగ్ చేస్తున్న యశస్విని "నాన్న గారూ మీ బ్లడ్ గ్రూప్ ఏమిటి? " అని అడి గింది.

"అదా. ఏమయ్యుంటుంది. గుర్తుకులేదే. డైరీలో రాసి పెట్టాననుకుంటా. ఎందు కమ్మా ఆ వివరం" అన్నాడు చెట్ల పాదులు తీస్తూ.

"జస్ట్ క్యూరియస్. ఎప్పుడు చెబుతారు డైరీ చూసి"

"రేపు చూస్తాలే" అన్నాడు మరో చెట్టు పాదులు తీస్తూ

ఇవాళే చెబితే బావుండేది అనుకుంటూ కొంచెం ఉత్సాహాన్ని తగ్గించుకుంటూ "సరే" అని తన గదికి వెళ్ళి నాన్న గారి గ్రూప్ ఏమై ఉంటుంది అనుకుంది. ఓ నా, ఏ నా, బి నా, ఏబి నా? అన్ని లక్షణాలు కొంచెం కొంచెం కనిపిస్తున్నాయి కాబట్టి ఏబి అయి వుండవచ్చు.

మరునాడు తండ్రి కాస్త తీరికగా ఉన్న ప్పుడు అడిగింది "అతగాడి బ్లడ్ గ్రూప్ తెలుసుకున్నారా నాన్న గారూ"

"ఇంకా కనుక్కోలేదమ్మా. బాబాయి ఊరెళ్ళి వచ్చాక తెలుసుకుందాము" అన్నాడు టీ తాగుతూ.

"ఓకె. మీ గ్రూప్ ఇవాళ చెబుతానన్నారు"

"ఇప్పుడే చూసివచ్చి చెబుతాను" అని టీ తాగి కప్పు టేబుల్ మీద పెట్టి లోపలికి వెళ్ళాడు. లక్ష్య టాబ్లెట్ పిసిలో బ్రౌజ్ చేస్తూ కూర్చుంది. యశస్వి తిరిగి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"చూశారా? "

"చూశాను" అంటూ తన బ్లడ్ గ్రూప్ చెప్పాడు.




శేషాచలంకి కొద్దిరోజులయిన తరువాత గానీ ఆ నవల చదవడానికి కుదరలేదు. ఆ తరువాత ఎలాగో వీలు చూసుకొని చది వాడు. మొదట చదువుతున్నపుడు మామూ




## గులాబి బాలా...

'ఓ హో గులాబి బాలా... అందాల ప్రేమ మాలా...' 'అవునండీ.. గులాబీలంటే ఇష్టపడని వారెవరుంటారు చెప్పండి.

మనం ప్రేమించే గులాబీలు, మన మీదా.. తమ ప్రేమని మనకి ఉపయోగపడేలా చాటుకుంటున్నాయి. ఎలాగంటారా!.. హార్టీకల్చరల్ థెరఫీ రీసెర్చి గ్రూపు, కన్సాస్ స్టేట్ యూనివర్సిటీ వాళ్ళు "నిజమే"నని ఋజువు చేశారు.

"ఒక గదిలో కొంతమంది స్త్రీలని కూర్చోబెట్టి 5 ని॥ల టైపింగ్ అసైన్‌మెంటిచ్చారు" మరో గదిలో మరికొంత మంది స్త్రీలకి కూర్చోబెట్టి అదే 5 ని॥ల టైపింగ్ అసైన్‌మెంట్ ఇచ్చి, వాళ్ళెదురుగా రంగు రంగుల గులాబీలు అందంగా అలంకరించారట. గులాబీలుంచిన గదిలోని వనితలు ఇచ్చిన పనిని అతిత్వరగా పూర్తి చేశారట. గులాబీలు చూడటం వలన పని వత్తిడి ఫీలవకుండా, మానసికోల్లాసంతో త్వరగా ముగించామని, గులాబీల సుమధుర వాసనలు... తమ విచారాన్నీ, కోపాన్నీ తగ్గించి... కాన్‌సెన్‌ట్రేషన్ పెంచాయని చెప్తున్నారట.

సో... వర్కింగ్ స్పాట్లలో... ఫ్రెష్ గులాబీలుంటే ఆడుతూ, పాడుతూ పని జరిగిపోయేలా ఉంది. బాగుంది కదూ!

లుగానే అనిపించింది. ఆ తరువాత ఆసక్తి పెరిగింది. నవల పూర్తయేసరికి ఏవో అనుమానపు బీజాలు ప్రవేశించాయి. బ్లడ్‌గ్రూపుల గురించిన జపనీస్ కాన్సెప్ట్ గురించి వివరిస్తూ పోయాడు రచయిత. నవలలో సగం వరకు బ్లడ్ గ్రూప్‌లను బట్టి మనస్తత్వాలు వివరిస్తూ పోయాడు. తన గ్రూప్ బి మనస్తత్వం గురించి చదవడం కొంచెం ఇబ్బందికరంగా అనిపించింది. ఇక నుండీ ఎవరికీ తన గ్రూప్ చెప్పకూడదని అనుకున్నాడు. దక్షిణ కొరియాలో అమ్మాయిలు బి గ్రూప్ ఉన్న అబ్బాయిలను ఇష్టపడటం లేదట. జపాన్‌లో కూడా అదే పరిస్థితి అట. అదే పరిస్థితి ఈ రాష్ట్రంలో కూడా వచ్చింది ఆ నవల విడుదల అయిన దగ్గరి నుండి.

నవల సగం అయిన తరువాత నుండీ అందులో రేకెత్తించిన అనుమానాలు చూస్తూంటే అసౌకర్యం కలగసాగింది శేషాచలానికి. నవల చదవడం పూర్తయ్యేసరికి తన పరిస్థితి గురించి తను అనుమానపడాలా వద్దా అన్న సంశయం పీడించసాగింది. ఛ. తప్పుకాదూ. భార్యామణి మీద అలా అనుమానపడటం భావ్యం కాదే. పోనీ ఒకసారి ధ్రువపరచుకుంటే పోలా. ఛ. తప్పుకాదూ. ఇలాంటి ఆలోచనలు చేస్తున్నానని తెలిస్తే ఏమనుకుంటుంది. తన ఆలోచనలు ఇలా సాగుతున్నాయని తెలిస్తే ప్రజలు ఏమనుకుంటారు? అయినా ఈ నవల చదివిన ఎవరయినా ఇలా ఆలోచించకుండా ఉండగలరా? ఏమో. ఎందుకు ఉండరు. భార్య మీద పూర్తి విశ్వాసం ఉన్న వారు ఎంత మందిలేరు. మరి తన ఆలోచనలు ఎందుకిలా సాగుతున్నాయి?

అంటే భార్య మీద తనకు అంత విశ్వాసం లేదా? అలాంటిదేమీ లేదే. ఇంతవరకూ ఇలా ఎప్పుడూ ఆలోచించలేదే. సంపూర్ణ

విశ్వాసంతోనే ఉన్నానే. ఇప్పుడే ఎందుకు ఇలాంటి పెడ ఆలోచనలు. ఇది తన తప్పా లేక నవల తప్పా. నవలలో తప్పేం వుంది? వాస్తవాలు రాశాడంతే కదా. ఆ విషయాలు చదివినంత మాత్రాన తను అలా మనసులో స్పందించడం ఏమిటి? ఎక్కడ వుంది లోపం? జస్ట్ విషయాల్ని ధ్రువపరుచుకున్నంత మాత్రాన పొరపాటు అవుతుందా? అలా చేస్తే తప్పేం అవుతుంది? కాదనుకుంటూ, కానీ భార్యకు తెలిస్తే ఏమనుకుంటుంది. విషయం తెలిస్తే తనను క్షమిస్తుందా? పిల్లలకు కూడా తన అనుమానాలు తెలిస్తే ఇంకా ఏమన్నా వుందా. సిగ్గుతో కుంచించుకుపోవడమే.

శేషాచలానికి ఏమీ తోచక అలా వదిలివేశాడు. ఆ విషయాన్ని ముఖ్యమంత్రిగా తీరిక దొరకక పోయినప్పటికీ ఏ మాత్రం తీరిక దొరికినా ఇదే విషయం మనసు



తొలవనారంభించింది. భార్య కుముదినిని అడగాలంటే భయం. తనూ ఆ నవల చదివే వుండవచ్చు. అడిగితే అనుమానం వస్తుందేమో. ఈ టాపిక్ గురించి గానీ బ్లడ్ గ్రూప్‌ల గురించి కానీ ప్రస్తావిస్తే తన మీది గౌరవం తుడిచి పెట్టుకుపోయే ప్రమాదం వుంది. ఎలా ఈ విషయం తెలుసుకోవడం. అప్పుడు గుర్తుకువచ్చాడు 'బదరీ'. కరెక్ట్ అతడయితేనే ఇటువంటి పనులు సవ్యంగా పూర్తిచేయగలుగుతాడు. ఈ విషయానికి అంత ప్రాధాన్యం లేక పోయినా ఒక్కసారి అన్నీ కన్ఫర్మ్ చేసుకుంటే తప్పేం వుంది. బదరీని ఈ పనికి వినియోగించాలనే నిర్ణయించుకున్నాడు.

శేషాచలం బదరిని పిలిపించుకొని చెప్పాడు "నా భార్య బ్లడ్ గ్రూప్ ఆమెకు తెలియకుండా తెలుసుకోవాలి".



బదరీ ఇతర వివరాలేమీ అడగడు. అదే అతనిలో శేషాచలానికి నచ్చే ముఖ్యమయిన విషయం. అందుకే ఇలాంటి వ్యక్తిగత వ్యవహారాలు బదరికే అప్పగిస్తుంటాడు. అయితే ఈ పని విని బదరి మనసులోనే నవ్వుకున్నాడు కానీ బయటికి నవ్వకుండా జాగ్రత్త పడ్డాడు. ఆ తరువాత ఇంకా ఏం వివరాలు తెలుసుకొమ్మంటాడో కూడా ఊహించగలిగాడు. ఈ పని పెద్దగా కష్టం కాదు గానీ ముందు ముందు అప్పగించే పనులు కొద్దిగా కష్టం కావచ్చు. చాలా తిరగవలసి రావచ్చు.

ఫ్యామిలీ డాక్టర్‌ని అడిగితే తెలిసిపోయే దానికి తనను ఎందుకు నియోగించాడా అని బదరి కాసేపు ఆలోచించాడు. ఫ్యామిలీ డాక్టర్‌ని అడిగితే చిన్నతనంగా ఉంటుంది ఆ డాక్టర్‌ని అడగడం భార్యకు తెలిస్తే అది ఇబ్బందికరంగా పరిణమించవచ్చు లేదా తనకు అర్థం కాని వేరే విషయాలు వుండవచ్చు అని బదరి ఆలోచనలు ముగించి పనిలో పడ్డాడు. అయితే అది అతడనుకున్నంత మరీ చిన్న విషయం కాదని అప్పుడతడికి తెలియదు.

* * *

బాబుని తీసుకొని రవీంద్ర ఎప్పుడూ వెళ్ళే ల్యాబ్‌కి వెళ్ళాడు. బాబు బ్లడ్ గ్రూప్ తెలుసుకోవాలని చెప్పాడు. అసిస్టెంట్ ముసిముసిగా నవ్వుతూ "అయితే మీరు 'ఎవరు' తాలూకే నన్న మాట" అన్నాడు

రవీంద్రకి అర్థమయినా అర్థం కానట్టు ముఖం పెట్టి "ఎవరు తాలూకు ఏమిటి? " అన్నాడు

"అదే సార్. 'ఎవరు' నవల. ఆ నవల విడుదలయ్యాక మా ల్యాబ్‌లకు చాలా గిరాకీ పెరిగింది. చాలా మంది తమ పిల్లల బ్లడ్ గ్రూప్ తెలుసుకోవాలని వస్తున్నారు. మీరు చదవలేదా ఆ నవల" అన్నాడు మరింత ముసిముసిగా నవ్వుతూ.

అవును కాదన్నట్లుగా తల ఊపి పక్కకు తిప్పుకున్నాడు. పొడిగించడం రవీంద్రకి ఇష్టం లేదని గమనించి బాబు రక్తం తీసే పనిలో పడ్డాడు. కొద్దిసేపట్లోనే రిజల్ట్ చెప్పాడు. 'ఓ' గ్రూప్. ఎవరు నవలలో చెప్పిన బ్లడ్ గ్రూప్ కాంబినేషన్ రిజల్ట్స్ గుర్తుకులేదు. బాగా ప్రయత్నించాడు గుర్తుకు తెచ్చుకోవడానికి కానీ లాభం లేకపోయింది. ఇంటికి త్వరగా వెళ్లి ఆ నవల తిరిగేయాలనుకున్నాడు. త్వరగా ఇంటికి పోనీయమని డ్రైవర్‌కి చెప్పి ఎప్పుడు ఇంటికి వెళతానా అని ఆరాటపడిపోయాడు. ఆ నవల తనతో పాటుగా తెచ్చుకుంటే పోయేది అనుకున్నాడు.

ఇంటికి వెళ్ళాక రమణి చేస్తున్న పని చూసి నోట మాటరాలేదు రవీంద్రకి.

* * *

"చెప్పండి" అంది లక్ష్య ఉత్సాహంగా.

"ఓ" అని చెప్పాడు యశస్వి.

"ఆశ్చర్యం లేదు నాన్నగారు. మీరు చేసే ప్రతి విషయంలో మీరు చూపించే పట్టుదల, నాయకత్వ లక్షణాలు, నిజాయితీ చూస్తే అది కరెక్ట్‌గా సరిపోతుంది"

కూతురు చెప్పిన విషయాలు విని సంతోషపడ్డాడు. "నువ్వు ఏ గ్రూప్ వాళ్ళని పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడుతున్నావు? "

"ఓ లేదా ఏ. ఓ గ్రూప్ వాళ్ళకయితే మీలాగే నాయకత్వ లక్షణాలు వుంటాయి. జీవితంలో మంచిగా పైకి రాగలుగుతారు. నిజాయితీగా కూడా వుంటారు. ఏ అయితే నాయకత్వ లక్షణాలు అంత వుండకపోయినా మంచి వాళ్ళయి వుంటారు. చెప్పింది వింటారు. ఎక్కువ గొడవలు వుండవు వారితో"

"నీ గ్రూప్ ఏమిటమ్మా"?

"నాది ఎబి నాన్నగారూ. నా గ్రూప్ వాళ్ళు కళాభిరుచి వున్నవారయి వుంటారు. సంఘంలో గుర్తింపు వచ్చే పనులే చేస్తారు. నాయకత్వ లక్షణాలు కూడా కొన్ని వుంటాయట. రాజనీతిజ్ఞులుగా, డిప్లొమాట్స్‌గా

బాగా పనికివస్తారు"
"మరి బి వాళ్ళ సంగతి ఏమిటి? "
"వాళ్ళకీ ఓ వాళ్ళకీ తేడా తెలుసుకోవడం కొంచెం కష్టమే కానీ వాళ్ళలో అంత నిజాయితీ వుండదు. సంకుచిత మనస్తత్వం, చీటింగ్ ఎక్కువగా వుంటుంది. ఎక్కువ మంది నేరస్థులు, హత్యలు చేసేవారు ఆ గ్రూప్ లోనే వుంటారట. జనాభాలో పది శాతానికి పైగా బి వాళ్ళు వుంటారు"



"అలాగా"
"అందుకే ఎందుకయినా మంచిదని బి గ్రూప్ ఉన్న వారిని ఎవరూ ఇష్టపడడం లేదు. ఈ పరిస్థితి ఇప్పుడిప్పుడే మన రాష్ట్రంలో వస్తున్నది కానీ జపాన్‌లో, దక్షిణ కొరియాలో ఎప్పటి నుండో వుందట. అక్కడ వాళ్ళు మనం ఇదివరలో రాశుల గురించి పట్టించుకున్నట్లుగా బ్లడ్ గ్రూప్‌ల గురించి పట్టించుకుంటారట" తండ్రి ఆసక్తిని చూసి ఉత్సాహంగా చెబుతూ పోయింది.
"మమ్మీది ఏ గ్రూపమ్మా? "
"బి" అంది నవ్వుతూ
"అందుకేనా ఎప్పుడూ నన్ను సాధిస్తుంటుంది!" అంటూ బిగ్గరగా నవ్వాడు.
"అది మమ్మీ నేరం కాదు నాన్నగారూ, మమ్మీ బ్లడ్ గ్రూప్ నేరం" గలగలా నవ్వింది.
"మరి మమ్మీది బి గ్రూప్ అయితే, నాది ఓ అయితే నీకు ఎబి ఎలా వచ్చిందమ్మా? మా ఇద్దరి రక్తంలో ఏదో ఒకటి రావాలి కదా" అడిగాడు యశస్వి. అడిగిన తరువాత ఇంత అసంబద్ధమయిన ప్రశ్న ఎందుకు వేశానా అని అనుకున్నాడు.
"అలా కాదు నాన్నగారూ. తల్లితండ్రుల బ్లడ్ గ్రూప్‌ల కలయికను బట్టి ఆ బ్లడ్ గ్రూప్‌లే పిల్లలకి రానక్కరలేదు, ఇంకా కొన్ని కూడా రావచ్చు నాకు ఒక కాంబినేషన్ గుర్తుకు వుంది. ఉదాహరణకు చెబుతాను. 'ఎ', 'బి' పేరెంట్స్‌కి అన్నిరకాల బ్లడ్ గ్రూప్ పిల్లలు పుట్టవచ్చు. అలాగే 'ఒ','ఒ' కలిస్తే 'ఒ' గ్రూప్ వాళ్ళే పుడతారు."
"అలాగా. ఈ విషయాలు వినడానికి బావున్నాయి. నేనూ ఆ నవల చదువుతాను తరువాత. అలా వాహ్యాళికి వెళ్ళి వస్తానమ్మా. నువ్వూ వస్తావా? "
"లేదు. మీరు వెళ్ళిరండి"
లక్ష్య నెట్‌లో బ్రౌజ్ చేస్తూ ఆలోచిస్తూండిపోయింది. ఆమె మనసులో చిన్న అస్పష్టత. మనసులో అలజడిగా ఉంది. ఎక్కడో ఏదో పొరపాటు. ఏమిటిది? ఏమిటిది? ? ఏ మూలనో ఏదో అయోమయం. ఎందుకని? ఎవరు నవలలో వివరించిన అంశాలు గుర్తుకు వస్తున్నాయి. తల్లి బ్లడ్ గ్రూప్ తెలిసిన తరువాత నాన్న

**లక్ష్య నెట్‌లో బ్రౌజ్ చేస్తూ ఆలోచిస్తూండి పోయింది. ఆమె మనసులో చిన్న అస్పష్టత. మనసులో అలజడిగా ఉంది. ఎక్కడో ఏదో పొరపాటు. ఏమిటిది? ఏమిటిది?? ఏ మూలనో ఏదో అయోమయం. ఎందుకని?**

గారి బ్లడ్ గ్రూప్ గెస్ చేయడం కోసం నిన్ననే ఆ నవల తిరగేసింది. ఆ వివరాలే గుర్తుకువస్తున్నాయి. తల్లిది బి, తండ్రిది ఓ. తనది ఎబి. ఇది సంభవమేనా? ఆ నవలలో వేరే విధంగా చెప్పినట్లున్నారు. బాప్ రే బాప్. తనకు గుర్తున్నది నిజమేనా?

తప్పుగా గుర్తున్నట్లుంది. మరోసారి ఆ నవల చదివి ధ్రువపరచుకుంటే పోలా? ఛ. అదేం పని! తల్లి మీదే అనుమానాలా? అలా వెరిఫై చేసుకోవడం తప్పుకాదూ. తల్లి దండ్రుల పట్ల చూపించే గౌరవం ఇదేనా? వద్దులే. తనే ఏదో పొరపాటు పడి వుంటుంది అనుకొని సరిపుచ్చుకుంది.

ఆ సరిపెట్టుకోవడం ఎంతోసేపు కుదరలేదు. పదే పదే అదే ఆలోచన. అన్యమనస్కంగానే తన గదిలోకి వెళ్ళింది. బుక్ షెల్ఫ్‌లో ఆ పుస్తకం కనపడుతూనే వుంది. తటపటాయిస్తూనే అందుకుంది. వణుకుతున్న చేతులతో తెరచింది. బి, ఓ కాంబినేషన్ కోసం నవల అంతా వెతికింది. ఒక చోట కనిపిస్తే చదివింది. ఆమె ముఖంలో నెత్తురు చుక్కలేకుండా పోయింది. ఎక్కడ జరిగింది లోపం? ఎక్కడ వుంది దోషం? అంటే అమ్మ ఏదో పొరపాటు చేసి తనను కన్నదా? నాన్నను వంచించిందా? నాన్నను అమాయకుడిని చేసి వంచించిందా? అంతే అయ్యుంటుంది. తను ఎంతో గౌరవించే నాన్న నాన్న కారా? మరి అసలు నాన్న ఎవరు? ఎక్కడుంటారు? ఈ సందేహాలతో లక్ష్యకు బాగా తలనొప్పి వచ్చింది. అలాగే పడుకుంది చాలా సేపు.

కూతురు ఎంతసేపటికీ గది నుండి రాక పోవడంతో వినిత వచ్చి లేపింది. "ఏమిటమ్మా ఇంతసేపు పడుకున్నావు? భోంచేద్దువు గానీ రా"

తల ఎత్తి ఒకసారి తల్లివేపు చిరాగ్గా చూసింది "ఆకలి లేదు. ఇలాగే పడుకుంటాను".

కూతురు తల మీద చెయ్యి వేసి చూసింది. "నలతగా వుందా"? అనడిగింది.

తల్లిచేయిని దాదాపు విసురుగా తోసివేస్తూ "ఏమీలేదులే. కాసేపు నన్నిలా పడుకోనివ్వు". విసుక్కుంటున్నట్లుగా అంది లక్ష్య

పెళ్ళి సంబంధం వారి నుండి ఇంకా కబురు రానందుకు విసుగ్గా వుందేమో అనుకుని ఆ గది నుండి బయటికి వచ్చింది వినిత.

* * *

"ఏం... ఏం చేస్తున్నావు? " కంగారుగా అడిగాడు రవీంద్ర.

రమణి అతడివైపు విచిత్రంగా చూసి "ఏం చేస్తున్నాను? నవల చదువుతున్నాను? " తాపీగా అంది.

"ఆ నవల నాకివ్వు. నేను ఇంకా పూర్తిగా చదవలేదు"

"ఇప్పుడే మొదలెట్టా. కొద్దిగా చదివాక ఇస్తానులెండి"

రవీంద్రకి ఆరాటంగా వుంది, ఆ నవల ఎప్పుడెప్పుడు తిరగేయాలా అని. కానీ రమణి ఇవ్వనంటోంది. దానితో విసుగ్గా అనిపించింది. "ఇవ్వమంటుంటే" అన్నాడు కోపంగా.

"మీకెందుకు ఈమధ్య ప్రతి చిన్న విషయానికి కోపం వస్తోంది? " అంటూ ఆ నవలను అతడి మీదికి విసిరేసి విసవిసా వంటింట్లోకి వెళ్ళింది.

ఆ నవల తీసుకొని గబగబా బెడ్‌రూం లోకి వెళ్ళాడు. త్వరత్వరగా నవల తిరగేశాడు. వివరాలు చూశాక ఆ నవలని చిరాగ్గా విసిరికొట్టాడు. ఆ శబ్దం విని బెడ్‌రూంలోకి వచ్చిన రమణి ముఖం మాడ్చుకొని వున్న భర్తవైపూ, మూలన పడి వున్న నవల వైపూ ఒకసారి విచిత్రంగా చూసి మళ్ళీ వంటింట్లోకి వెళ్ళింది.

రవీంద్రకి అయోమయంగా వుంది. ఏదో ధ్రువీకరించుకుందామనుకున్న రవీంద్రకి ఆశాభంగం కలిగింది. తనది బి, రమణిది ఏ కావడంతో పిల్లలు ఏ, ఏబి, బి, ఓ

గ్రూప్‌లో ఏదయినా కావచ్చు దానితో ధ్రువీకరించుకోవడానికి ఏమీ లేకపోయింది. అందుకే చికాకుగా వున్నాడు. మరీ అంత అనుమానం వుంటే డిఎన్ఎ టెస్ట్ చేయించ వచ్చు గానీ అది ఖర్చుతో కూడుకున్న వ్యవ హారం. పైగా ఆ టెస్టులు ఎక్కడ చేస్తారో తెలవదు. బ్లడ్ గ్రూప్ టెస్ట్ అయితే సింపుల్‌గా తెలిసిపోతుందని అనుకున్నాడు. కానీ వ్యవహారం మళ్ళీ మొదటికి వచ్చింది. ఇక ఆ విషయం గురించి ఆలోచించడం అనవసరమనిపించి తన సినీ కెరీర్ గురించి ఆలోచించడంలో నిమగ్నమయ్యాడు.

4



ఆకాశం నిర్మలంగా వుంది. నక్షత్రాలు మిణుకు మిణుకుమంటున్నాయి. మరోవైపు చల్లని చంద్రుడు జగత్తునిండా పండు వెన్నెల్ని పరుస్తున్నాడు. బదరీ నెమ్మదిగా నడుస్తూ ఆ భవంతి చేరుకున్నాడు. నగరంలోని పేరు మోసిన భవంతుల్లో అదొకటి. దూరంగా వాచ్‌మెన్ సిగరెట్ తాగి చివరి దమ్ము పీల్చి కిందవేసి బూటుతో నలిపివేశాడు. వాచ్‌మెన్ తప్ప దరిదాపుల్లో ఎవరూ లేరు. వాచ్‌మెన్ దూరంగా వెళ్ళడం చూసి గబుక్కున ప్రహరీగోడ దూకాడు అవలీలగా. అతడికిటువంటి పనులన్నీ వెన్నతో పెట్టిన విషయాలు.

ముఖ్యమంత్రి ఫ్యామిలీ డాక్టర్ పేరు రంగరాజు. అతడి ఆఫీసు కోసం వెతుకుతూ వెళ్ళాడు. అది కనిపించింది. చిటికలో తాళం తెరచి లోపలికి దూరాడు. ఓపికగా గదులన్నీ వెతికాడు. ఎన్నెన్నో రికార్డులు కనిపించాయి కానీ కుముదినీదేవి బ్లడ్ గ్రూప్ రిపోర్టులు కానీ, ఆమె బ్లడ్ గ్రూప్ గురించి కానీ తెలిపే రికార్డేదీ కనిపించ లేదు. బదరీకి ఏం చేయాలో అర్థం కాలేదు. మరోసారి అన్ని పేపర్లూ జాగ్రత్తగా వెతికాడు గానీ లాభం లేకపోయింది. అన్ని పేపర్లు ఎక్కడివక్కడ సర్దిపెట్టాడు ఎవరికీ అనుమానం రాకుండా.

ఫ్యామిలీ డాక్టర్ దగ్గర బ్లడ్‌గ్రూప్ వివరాలు లేకపోవడం ఆశ్చర్యమనిపించింది. కుముదినీదేవి బ్లడ్ గ్రూప్ తెలుసుకోవడం చాలా చిన్న విషయం అనుకున్నాడు గానీ కొంచెం శ్రమ పడక తప్పేట్లుగా లేదు.

* * *

లక్ష్యను పిలిచి కూర్చోబెట్టి చెప్పాడు యశస్వి "పెళ్ళి సంబంధం వాళ్ళు కబురు చేశారమ్మా. బ్లడ్‌గ్రూప్‌లు ఏవో కలవవని చెప్పారు" కూతురి రియాక్షన్ కోసం చూస్తూ.

అనుకున్నంతా అయ్యిందన్నమాట. "పర్లేందులెండి నాన్నగారూ. కలవనపుడు చేసుకోకపోవడమే మంచిది కదా"

కూతురు ఆ విషయాన్ని తేలికగా తీసుకున్నందుకు యశస్వి సంతోషించాడు. "అసలు ఈ బ్లడ్ గ్రూప్ మనస్తత్వాలు ఏ శాస్త్రవేత్త కనిపెట్టాడమ్మా?"

"సైంటిస్ట్ కాదు గానీ 1927లో ఫరకువా తకెజీ అనే సైకాలజిస్ట్ బ్లడ్ టైప్ వ్యక్తిత్వాల గురించీ స్టడీ చేశాడు. వాటిని మసాహికో నోమి అనే సైకాలజిస్ట్ 1971లో రాసిన ఒక పుస్తకంలో పేర్కొన్నాడట. అతని తరువాత అతని కొడుకు తోషికట. ఈ విషయాలపై 15 పుస్తకాలు రాసి వాటిని ఇంకా ప్రసిద్ధిలోకి తెచ్చాడట. అయితే ఈ విషయాలు శాస్త్రబద్ధంగా ఇంకా నిరూపితం కాలేదు. గానీ ఈ విషయాలు స్టాటిస్టిక్స్‌ను ఆధారం చేసుకొని తయారుచేసినవి కనుక కొన్ని దేశాల ప్రజలలో వీటిమీద మంచి నమ్మకం వుంది. ఈ విషయాలు చదివిన తరువాత నేను కూడా మనస్తత్వాల బట్టి చాలామంది

బ్లడ్‌గ్రూప్‌లను అంచనా వేయగలుగుతున్నాను"

"నీకు ఓ గ్రూప్‌వాళ్ళు, ఏ గ్రూప్ వాళ్ళు ఇష్టం అని చెప్పావు కదా. మరి వాళ్ళ మనస్తత్వాలలో లోపాలు లేవా? "

"ఎందుకు లేవు. అన్ని గ్రూప్‌లలోనూ కొన్ని లోపాలు వున్నాయి. నాకు ఓ అంటే బాగా ఇష్టం. ఎందుకో ఇంతకుముందే చెప్పాను కదా. అయితే వారితోనూ కొంచెం ప్రాబ్లం వుంది. ఆ గ్రూపు రక్తం ఉన్నవాళ్ళు నిర్లక్ష్యవంతులు. దురహంకారులూ, నిర్దాక్షిణ్యులూ కూడా అయి వుండవచ్చు అయితే ఆ గ్రూప్‌లో సహజమైన నాయకత్వ లక్షణాలు కలిగినవారూ, అర్థం చేసుకొనేవారూ, దయగల వారే ఎక్కువ మంది వుంటారు"

యశస్వి ఆసక్తిగా ముందుకు వంగాడు

**వాళ్ళ మనస్తత్వంలో తొందరగా ఒక నిర్ణయానికి రాలేకపోవడం, విమర్శనాతత్వం, క్షమించలేకపోవడం వుంటాయి. వాళ్ళు కొంతమేరకు నాయకత్వ లక్షణాల్ని ప్రదర్శించగలరు.**

"మరి ఏ సంగతేమిటి? "

తండ్రి ఆసక్తిని గమనించి ఉత్సాహంగా చెప్పింది లక్ష్య- "వారిలో అంతర్ముఖులూ, మొండివాళ్ళూ, తమ గురించి తాము ఎక్కువ పట్టించుకునే వాళ్ళూ, నిరాశావాదులూ, ఆబ్సెసివ్స్ ఉండవచ్చు అయితే చాలావరకు 'ఏ' వున్న వారిలో ఓపిక, నెమ్మదితనం, చెబితే వినే గుణం ఉంటుంది. సాంప్రదాయసిద్ధంగా ఉంటారు. ఏదయినా పనిని పరిపూర్ణంగా చేయాలనుకునేవారు వుంటారు కాబట్టి ఆ గ్రూప్ వారు కూడా నాకిష్టం"

"నీ గ్రూప్ ఎబి కదా. నీ గ్రూప్ నీకే నచ్చకపోవడం ఆశ్చర్యంగా వుంది"

"దక్షిణ కొరియాలో ఫర్వాలేదు కానీ జపాన్‌లో ఎక్కువమంది 'ఎబి' గ్రూప్‌ని కూడా ఇష్టపడరు. అయితే 'ఎబి' గ్రూప్ జనాభాలో 5 శాతమే వుంటుంది. అదే 'ఓ' వాళ్ళు 43 శాతం వుంటారట. 'బి' గ్రూప్ 12, 'ఏ' గ్రూప్ 40 శాతంగా వుంటారట. 'ఎబి'వాళ్ళ మనస్తత్వంలో తొందరగా ఒక నిర్ణయానికి రాలేకపోవడం, విమర్శనాతత్వం, క్షమించలేకపోవడం వుంటాయి. వాళ్ళు కొంతమేరకు నాయకత్వ లక్షణాల్ని ప్రదర్శించగలరు. కానీ ఎక్కువ పని ఉన్నా, ఎక్కువ మందిని లీడ్ చేయాలన్నా సరిగ్గా లీడ్ చేయలేరు"

"అలాగా, మరి వాళ్ళలో వుండే మంచి విషయాలేంటి? "

ఈలోగా వినిత కూడా వచ్చి ఈ ఇద్దరి సంభాషణను ఆసక్తిగా వింటోంది. లక్ష్య చెబుతూ పోయింది. "ప్రశాంతంగానూ, నియంత్రణలోనూ ఉంటారట. తార్కికంగా ఆలోచిస్తారు. సంఘంలో కలిసిమెలసి ఉంటూ పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటారు. వీళ్లని తేలిగ్గా అంచనా వేయలేం. ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తారో తెలీదు. ఒక రకంగా చెప్పాలంటే వీరిని స్ప్లిట్ పర్సనాలిటీ అనొచ్చేమో. ఎందుకంటే వీరు అప్పుడప్పుడూ ఏ గ్రూప్ వారిలాగా, అప్పుడప్పుడూ బి గ్రూప్ వారిలాగా ప్రవర్తిస్తారు కాబట్టి వీరిని నమ్మడం కష్టం"

వినితను చూస్తూ "మీ మమ్మీది కదా. ఆ గ్రూప్ గురించి కూడా వివరంగా చెప్పు మరి" అన్నాడు యశస్వి.

"చెప్పా కదా బి గ్రూప్ మగవాళ్ళని ఎక్కువ మంది ఇష్టపడరని. ఆడవారి మీద అంత దురభిప్రాయం లేదులెండి" అంది నవ్వుతూ.

తన ముఖంలోకే చూస్తున్న భర్తను చూసి వినిత మూతి తిప్పింది.

"బి గ్రూప్ వాళ్లలో ఎక్కువమంది స్వార్థపరులూ, ఉద్రేకంగా వుండే వాళ్ళే ఎక్కువ వుంటారట. వాళ్ళని నమ్మి ప్రేమించడం,

పెళ్ళి చేసుకోవడం పొరపాటని అంటారు. వాళ్ళు బాధ్యతారాహిత్యం తోనూ, పట్టించుకోని రకంగానూ వుంటారు"

"మరి వాళ్ళలో మంచి గుణాలు ఉండవా? " వినిత అడిగింది.

"ఉంటాయి. వీళ్ళు ఆశావాదులూ, సృజనాత్మకత వున్నవాళ్ళు, చురుగ్గా వుండే వారూ, దయకలిగిన వారూ, సరళమయిన వారూ అయి వుండవచ్చు"

"రక్తాలలో పాజిటివ్, నెగటివ్ వుంటాయట కదా. దాని సంగతేమిటి? "

"వ్యక్తిత్వాల విషయంలో దానికంత ప్రాధాన్యం లేదు మమ్మీ"

"ఏమిటో ఈ రక్తాల గొడవ. నాకు పెద్దగా అర్థం కావడం లేదు"

"మధ్యలో వచ్చి వింటే ఏం అర్థమవతుంది? " యశస్వి అన్నాడు.

"ఈ మనస్తత్వాలని క్లుప్తంగా కూడా చెప్పవచ్చు. ఏ గ్రూప్ వాళ్ళని కూల్ అని, ఏబి వాళ్ళని ఫ్రెంజీ అని, బి వాళ్ళని ఏక్టివ్ అని ఓ వాళ్ళని హాట్ అని చెప్పవచ్చు"

"హు. నాకు ఇది కూడా అర్థం కాలేదు' ' అంది విసుగ్గా వినిత.

లక్ష్య నవ్వి "సరే మమ్మీ. నీకు అర్థమయేట్లుగా క్లుప్తంగా చెబుతాను విను. ఏ అంటే రైతులా, ఏబి అంటే మానవత్వం వున్నవాడిలా, బి అంటే వేటగాడిలా, ఓ అంటే యుద్ధ వీరుడిలా అనుకోవచ్చు" అని చెప్పింది.

"ఇప్పుడు కాస్త అర్థమయినట్లుగా ఉంది"

"ఓకె. చూద్దాం. ఇప్పుడు చెప్పు మమ్మీ, నన్ను ఎలాంటి గ్రూప్ వారికిచ్చి పెళ్ళి చేస్తావు? "

"ఏ గ్రూప్ వారికే ఇచ్చి చేస్తాను. నీ సంసారం ప్రశాంతంగా సాగుతుంది. ఓపికగా ఉంటాడు, వింటాడు అంతేగానీ

## టంగుటూరి ప్రకాశం పంతులు

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు ప్రజానాయకుడేకాదు... ప్రత్యర్థుల మాటల్ని తిప్పికొట్టడంలో సిద్ధహస్తులు. బారిస్టర్ కావడంతో ఆయన చమత్కారాలు.. మాటల గారడీ న్యాయస్థానాల్లో బయటపడేవి. అవసరమైతే న్యాయమూర్తుల్నీ ఆయన వదిలిపెట్టేవారు కాదు... అలాంటి సంఘటనల్లో కొన్ని ఈనెల 'చతుర' పాఠకులకు ప్రత్యేకం...

### పూర్తయ్యేదాకా ఓపిక పట్టండి..

జస్టిస్ సర్ శంకరన్‌నాయర్ న్యాయపీఠంపై కూర్చుని ఉండగా మద్రాసు కోర్టులో ఓసారి ప్రకాశం కేసు వాదిస్తున్నాడు. అయితే ఆయన వాదనలు వినకుండా శంకరన్‌నాయర్ 'ఇలాంటి కేసులో హైకోర్టు ఇంతకుముందే తీర్పు ఇచ్చింది..' అంటూ అడ్డుపడసాగాడు.

కొంతసేపు సంయమనం పాటించిన ప్రకాశం ఇక ఉండబట్టలేక, 'అయ్యా.. ఇలాంటికేసులో ఇంతవరకూ తీర్పురాలేదు. అదీగాక మీరు అసలు ఇలాంటికేసులో తీర్పు ఇప్పటివరకూ ఇవ్వనే లేదు. మీ బుర్రలో సుళ్లతిరిగే కేసుకు నేను వాదించే కేసుకు సంబంధమే లేదు.. నా వాదన పూర్తయ్యేదాకా ఓపిక పట్టండి..' అన్నారు.

ఓ న్యాయమూర్తితో న్యాయవాది ఇలా మాట్లాడడం కోర్టు మొత్తాన్నీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. శంకరన్‌నాయర్ కూడా ప్రకాశం వాదనలు పూర్తయ్యేదాకా నోరు తెరిస్తే ఒట్టు.

'బి' గ్రూప్ వాడికిచ్చి చేయను. వాళ్ళని నమ్మలేమన్నావు కదా"

"మీరు చెప్పండి నాన్నగారూ"

"నిన్ను ఓ గ్రూప్ అబ్బాయికే ఇచ్చిచేస్తా నమ్మా. వాళ్ళయితేనే ధైర్యంగా జీవితాన్ని నడుపుతారు, విజయాల్ని సాధిస్తారు. మరి నువ్వెవరిని ఇష్టపడతావు? "

"ఏ, ఓ ఇద్దరినీ ఇష్టపడుతున్నాను. వాళ్ళలో ఎవరు నాకు బెటరో తేల్చుకోలేక పోతున్నాను. నాది ఏబి కదా, త్వరగా ఒక నిర్ణయానికి రాలేను కదా" నవ్వుతూ అంది. తల్లిదండ్రులు కూడా నవ్వారు. "ఈ థియరీ ప్రకారం అయితే నాకు ఏ వాళ్ళే మంచిదట. ఏబి వాళ్ళు ఓ వాళ్ళతో నెగ్గుకురావడం కొంచెం కష్టమంటారు. చూద్దాం ఎవరు దొరుకు తారో నాకు" అంది లక్ష్య.

"ఇంతకూ 'ఎవరు' నవల రచయిత బ్లడ్ గ్రూప్ ఏమిటట? " యశస్వి అడిగాడు.

లక్ష్య ఒక క్షణం తీసుకుంది గుర్తు తెచ్చు కోవడానికి.

## 5

'మహిళా జాగృతి' సంస్థ అధ్యక్షురాలు



వరలక్ష్మి నేత్రాలు అగ్నిగోళాలే అయ్యాయి 'ఎవరు' నవల చదివిన తరువాత. ఆ నవల మీద మెంబర్ కనక మహాలక్ష్మి ఫిర్యాదు చేసిన తరువాత ఆవేశంగా తెప్పించుకుని చదివింది. స్త్రీ జాతి మీద ఇన్ని అనుమా నాలా, ఇన్ని అపనిందలా అని ఆమె హృదయం ఆక్రోశించింది. త్రేతాయుగం నుండి కూడా స్త్రీలంటే మగవాడికి చులకనే కదా అని మరోసారి గుర్తుకు తెచ్చుకుంది. ఆవేశం ఇంకా సరిగ్గా రావడంలేదు అను కొని. ఇంకా చరిత్రలో ఆడదాన్ని మగవాడు కించపరిచిన ఏవేవో సంఘటనలు గుర్తుతె చ్చుకున్నాక వచ్చిన ఆవేశాన్ని ఒకసారి చూసుకొని ఇక చాలు అనుకుంది. మరీ ఎక్కువ ఆవేశం వస్తే హైబిపి వస్తుందేమోనని మరో బెంగ. లేకపోతే వరలక్ష్మి తెచ్చుకునే ఆవేశానికి కళ్ళలో నుండి అగ్నికీలలే బయల్దేరి ఉండేవి.

నిజానికి ఆ ప్రయత్నాలన్నీ తనలో కలి గిన బెదురుతనాన్ని కప్పిపుచ్చుకోవడానికి చేస్తున్నవే. నవల చదివిన తరువాత రెండో కూతురు గురించి బెదురు పడింది. ఈ నవల బాగా ప్రాచుర్యంలోకి వస్తే తనకు, తనలాంటి ఆడవారికి ఎంతో మందికి చాలా ఇబ్బందే అనుకుంది. రచయిత మీద విప రీతమయిన కోపం వచ్చి బుసలు కొట్టింది. ముక్కుపుటాలు ఎగరేసింది. వెంటనే ఆవే శంగా కనక మహాలక్ష్మికీ ఇతర క్లోజ్ మెంబర్స్‌కి ఫోన్ చేసి మాట్లాడింది.

ముఖ్యమంత్రి శేషాచలం పుణ్యమా అని రాష్ట్రం అంతా పచ్చగా ఉంటోంది. పెద్దగా సమస్యలు లేకుండానే ప్రజాజీవనం సజా వుగా జరిగిపోతుండటంతో వరలక్ష్మిలాంటి వారికి పెద్దగా పనేమీ లేకుండాపోయి టి. వి. లలో వచ్చే ఏడుపుగొట్టు సీరియళ్ళు చూసుకుంటూ వాటిల్లోని కోడళ్ళ కష్టాలకి జాలిపడుతూ కాలం గడపసాగారు. అలా చాలా కాలం నిజమయిన వ్యక్తుల మీద కాకుండా టి. వి. పాత్రల మీదనే జాలి కురి పించాల్సి రావడం తనపట్ల తనకే జాలిగానూ, బోరింగ్‌గానూ అన్పించి ఈ మధ్య అసహనం పెరిగింది వరలక్ష్మికి.



పత్రికలలో, టి.వి.లలో ఈమధ్య తన ముఖం ఏమాత్రం కనిపించకపోవడంతో చిరాగ్గా ఉన్న ఆమెకు 'ఎవరు' నవల తగిన సమయంలో మంచి ఆయుధంగా దొరికినట్లనిపించింది. దానికితోడు ఎవరు రచయిత మీద అసూయ కూడానూ... తనకంటే ఎక్కువ ప్రాముఖ్యంలోకి వస్తున్నాడని. ఇలాగే ఆ మధ్య ఒకటి రెండు నవలలు రాసిన ఒక గొప్ప డాక్టర్‌ని అల్లరి పెట్టేంతవరకూ ఆమెకు నిద్రపట్టలేదు.

కనక మహాలక్ష్మి, ఇతర ముఖ్యమయిన సభ్యులు కూడా వరలక్ష్మి చెప్పిన దానికి సై అన్నారు. దీనిమీద ఉద్యమం ఎలా ప్రారంభించాలి, ఎలా ప్రాచుర్యంలోకి రావాలి అన్న దానిమీద ఒక మీటింగ్ పెట్టి సమాలోచనలు జరిపారు. 'ఎవరు' నవల ద్వారా బతుకు ఛిద్రమయినవాళ్ళు ఎవరయినా ఉంటే వారిని ప్రెస్ ముందు చూపిస్తే బాగుండుననుకున్నారు గానీ అలా ఎవరు ముందుకు వస్తారు? భర్తను వంచించి అక్రమ సంతానం కన్నాను అంటే సంఘం అలా చెప్పిన వాళ్ళమీదే ఉమ్మేస్తుంది కదా. ఎలాగబ్బా అని ఆలోచనలో పడ్డారు. ఆ సభ్యులలో కనకమే కొద్దిగా ఫాస్ట్. ముక్కుసూటిగా మాట్లాడుతుంది. "బయటి వాళ్ళ కోసం ఎదురుచూసే బదులు మనలోనే ఎవరికయినా ఆ నవల్ ఎఫెక్ట్ అయితే వాళ్ళే ముందుకు రావడం బావుంటుంది కదా" అని అంది.

"నాకు అలాంటి పాడు సంబంధాలు లేవమ్మా" అని ఒక సభ్యురాలు క్షణం ఆలస్యం లేకుండా ప్రతిస్పందించింది. ఆలస్యం చేస్తే తన మీద ఎవరయినా అపోహ పడగలరనుకొని.

'ఛి, ఛీ, ఛండాలం. నాక్కూడ లేవు... నాక్కూడా లేవు. మేము అలాంటి వారం కాము. సతీ అనసూయలాంటి వారం' అని మిగతా వారందరూ అనేసరికి కనకానికి దిక్కుతోచక ప్రెసిడెంట్ వైపు తిరిగింది. తను వెంటనే ఏదో ఒకటి అనకపోతే సభ్యులందరూ తన శీలాన్నే శంకించే ప్రమాదం ఉందని గమనించి కంగారుగా "నేను కూడా అలాంటి పాపిని కాదమ్మా. కళ్ళు పోతాయి" అంది.

ఎవరి కళ్ళు పోతాయో అర్థం కాని సభ్యులు ఇక లాస్ట్ రిజార్ట్‌గా కనకంవైపు చూడడంతో కనకానికి తన వ్యాఖ్యలే తనకు బూమ్‌రాంగ్‌లా తగిలినట్లనిపించి ఉలిక్కిపడి కాస్త సంభాళించుకొని "నాకింకా పెళ్ళే కాందే" అంది. మిగతా వారందరూ నాలిక్కరచుకున్నారు అది మరచిపోయినందుకు.

ఎవరూ ముందుకు రారని అర్థమయింది అందరికీ. ఎలా ఉద్యమాన్ని ప్రారంభించాలా అని ఆలోచించసాగారు. జాహ్నవి అంది అప్పుడు, "అలా ఎవరూ ముందుకు రారు కానీ, ఎవరినీ ఫోకస్ చేయకుండానే నిరసన ప్రదర్శన నిర్వహిద్దాం మన ఆడ జాతి తరపున"

"అలా చేద్దాం" అంది కనకం సమర్థింపుగా.

"ఎక్కడ చేద్దాం?" ప్రెసిడెంట్ గారి ప్రశ్న.

"రచయిత ఇంటి ముందు" అన్నారొకరు.

"పబ్లిషింగ్ హౌస్ ముందు" అన్నారు మరొకరు.

"అసెంబ్లీ ముందు" అందుకున్నారు మరొకరు.

ఎక్కడ ప్రదర్శన జరిపితే తను ప్రెస్‌లో బాగా వస్తుందా అని ఆలోచించసాగింది వరలక్ష్మి. "అసెంబ్లీ ముందు అయితే బాగుంటుందేమో. మనకు మంచి కవరేజీ ఉంటుంది"

కవరేజీ అని వినగానే చాలామంది ఉత్సాహంగా "అలాగే, అలాగే" అన్నారు.

"మనం ఈ ప్రదర్శన చేస్తున్నది కవరేజీ కోసం కాదు కదా. రచయిత ఇంటి ముందు నిర్వహిస్తేనే బావుంటుందనుకుంటా" అంది పావని.

ఆమెను మిగతా వారందరూ ఒక చాదస్తురాలిలా చూస్తారు. ఇప్పుడూ అలాగే ఒక చూపు చూశారు. 'ఈమె వల్ల మంచి ప్రెస్ కవరేజి ఎక్కడ మిస్సయిపోతామో అని'

"లేదు. అసెంబ్లీ ముందే చేద్దాం. ఎలాగూ అసెంబ్లీ సమావేశాలు నడుస్తున్నాయి కనుక మన ఆడజాతి ముందున్న సమస్య అందరికీ సులభంగా అర్థమవుతుంది" అని వరలక్ష్మి ఆవేశంగా తీర్మానించింది. "రేపు పన్నెండు గంటలకు విలేఖరుల సమావేశం, నాలుగు రోజుల తరువాత అనగా శుక్రవారం పన్నెండు గంటలకు అసెంబ్లీ ముందు నిరసన ప్రదర్శన" అని చెప్పింది.

"ఎవరు నవలని అసెంబ్లీ ముందు దహనం చేస్తున్నామా?" అడిగింది ఒక సభ్యురాలు.

"ఇప్పుడే వద్దు. ఒకేసారి అన్నీ చేస్తే మన కార్యక్రమం ప్రజల్లోకి తీసుకుపోవడానికి ముందు ముందు మంచి మంచి అవకాశాలు ఉండవు. దాని సంగతి తరువాత ఆలోచిద్దాం"

* * *

"ఎబి అట" అంది లక్ష్య - 'ఎవరు' రచయిత బ్లడ్ గ్రూప్ గుర్తుకు తెచ్చుకుని.

"అందుకే రచయిత అయ్యాడన్నమాట. పేరు కూడా బాగానే తెచ్చుకుంటున్నాడు. మొదటి నవలతోనే ఇంత సంచలనం సృష్టించాడు. ముందు ముందు ఇంకా ఎంత సంచలనం రేపుతాడో" అన్నాడు యశస్వి.

"అవును నాన్నగారూ"

"సరేనమ్మా, ఇక అలా వ్యాహ్యాళికి వెళ్ళి వద్దాం పద"

"మీరు వెళ్లి రండి"

ఇదివరకెప్పుడూ ఉత్సాహంగా నడవడానికి వచ్చే కూతురు ఈ మధ్య అలా రాకపోవడం కొద్దిగా తేడాగా అనిపించింది యశస్వికి. వినిత మాత్రం ఆ విషయం అంతగా పట్టించుకోలేదు.

లక్ష్యకి ఇంకా దిగులుగా, మమ్మీ మీద కోపంగానే ఉంది. అయితే ఆ కోపం బయటికి కనపడకుండా వీలయినంత జాగ్రత్త పడుతోంది. మమ్మీ ఖచ్చితంగా పొరపాటు చేసింది. అయితే ఈ వాస్తవాన్ని జీర్ణించుకోలేకపోతున్నానే ఎలా. అమాయకమయిన నాన్నగారిని చూస్తుంటే జాలి వేస్తోంది. ఎందుకిలా జరిగింది. మమ్మీ ఎందుకిలా చేసింది. ఇంత మంచి నాన్నగారిని మోసం చేయాలని ఎలా అనిపించింది? అసలు నాన్న ఎవరు? అది తెలుసుకోవడం అంత అవసరమా లేక ఇలాగే మనసును వంచిస్తూ కాలం గడిపేయడమేనా? ఏమీ తోచడం లేదు లక్ష్యకి. పైకి తల్లితండ్రులతో మామూలుగా మాట్లాడాలని ప్రయత్నిస్తున్నా అందులోని



అమాయకమైన నాన్నగారిని చూస్తుంటే జాలి వేస్తోంది. ఎందుకిలా జరిగింది. మమ్మీ ఎందుకిలా చేసింది. ఇంత మంచి నాన్నగారిని మోసం చేయాలని ఎలా అనిపించింది? అసలు నాన్న ఎవరు?

నాటకీయత అర్థమవుతూ ఏదో వెలితిగా అనిపించసాగింది.

మదినిండా ఇవే ఆలోచనలు. ఎప్పుడూ ఇదే ఆలోచన. ఈ గందరగోళం నుండి తను బయట పడాలంటే అసలు నాన్న ఎవరో తెలుసుకోవడమే మార్గం అని నిర్ణయించుకుంది. మరి అసలు నాన్న ఎవరు? ఎలా తెలుసుకోవాలి? మమ్మీని అడిగితే ఏమనుకుంటుంది? ఏమనుకుంటే ఏం? ఆ పొరపాటు చేసినప్పుడు నాన్నగారు ఏమనుకుంటారు అనేది ఆలోచించకుండానే చేసినప్పుడు ఇప్పుడు నేను మమ్మీ ఏమనుకుంటుంది

అని ఆలోచించాల్సిన అవసరం ఏం వుంది? అయితే ఈ విషయాన్ని మమ్మీ నుండి ఎలా రాబట్టాలి? తల్లి దగ్గర ఈ విషయాలు ప్రస్తావించేంతటి దురవస్థ ఇంకే అమ్మాయికీ రాకూడదు! ఏమిటీ చిత్రమయిన పరిస్థితి? ఎవరికయినా తెలిస్తే ఏమనుకుంటారు? అసలు నాన్న ఎవరు? ఏం చేస్తుంటారు? ఈ నాన్నగారిలా మంచివారో కాదో? ఎలా తెలుసుకోవడం? నాన్న ఎవరు? ఎవరు?

* * *

ఇంట్లో ఫోన్ మోగితే ఎత్తింది రమణి.

అవతలి నుండి "బావున్నావా రమ్మీ" అని వినిపించింది. ఆనందంతో గుండె ఒక క్షణం లయ తప్పింది రమణికి. "బావున్నాను. నువ్వు బావున్నావా? ఎన్ని రోజులకి! అయినా ఇప్పుడు నేనెక్కడ గుర్తుంటానులే"

"ఎందుకు గుర్తుండవు. నిన్ను మరచిపోగలనా!" అన్నాడు గురు.



"నీకెన్ని పరిచయాలు? ఈ మధ్య సైడ్ హీరోయిన్ పరిమళతోనూ, ప్రొడక్షన్ అసిస్టెంట్ సువర్ణతోనూ తిరుగుతున్నావట కదా బాగా"

గురుమూర్తి అసోసియేట్ డైరెక్టర్. అందరూ అతడిని గురు అంటారు. "నా గురించి బాగానే తెలుసుకుంటున్నావే. ఎవరితో తిరిగినా నీవిచ్చే కిక్కు మరచిపోగలనా? " అన్నాడు సిగరెట్టు దమ్ము

లాగుతూ.

"నీ గురించి తెలవనిదెవరికి? అందరి దగ్గర అదే మాటంటావు"

"లేదు. మన బాబు మీదొట్టు"

"మన బాబు ఏమిటి? వాడు మా బాబు'

"నాకెందుకో మనబాబు అని నమ్మకం"

"ఎందుకొచ్చిందో ఆ నమ్మకం. 'ఎవరు' నవల చదివావా ఏమిటి?

"అందరూ దాని గురించే అనుకుంటున్నప్పుడు చదవకుండా వుండగలనా? "

"మా బాబు సంగతి సరేగానీ ముందు మీ ఇంట్లో పిల్లల సంగతి తెలుసుకో"

"అవసరం లేదు. నిరుపమ స్వాతి ముత్యం లాంటిది"

"ఆహ్హా. నీ విషయం తెలవక రవీంద్ర కూడా నీ గురించి అలాగే అనుకుంటాడు. అయినా మీ నిరుపమ సంగతి ఎవడిక్కావాలి గానీ ఇంతకూ ఎందుకు ఫోన్ చేశావో చెప్పు"

"నువ్వు గుర్తొచ్చావు"

"ఆహ్హా"

"మన బాబు గుర్తొచ్చాడు"

"అదుగో మళ్ళీ మన బాబు!" అని చిన్నగా గద్దించింది.

"అదే తెలుసుకుందామని ఈ మధ్య కుతూహలంగా వుంది. ఆమధ్య ఒకసారి చూశాను బాబుని. నా పోలికలు కనిపిస్తున్నాయి. ఖచ్చితంగా తెలుసుకుందామని"

"ఛ. నిజంగా! మరి రవీంద్రకి తన పోలికలే కనిపిస్తున్నాయే"

"వెటకారాలొద్దు గానీ నీ బ్లడ్ గ్రూప్ ఏమిటి"

"ఏమో నాకు తెలవదు. తెలిసినా నీకు చెప్పను"

"ఎందుకో? "

"ఎందుకంటే తమరికి ఇన్నాళ్ళకి గుర్తొచ్చాను కాబట్టి"

"అబ్బా అదేమీ లేదు. పనుల వత్తిడి. చాలా సినిమాలకి చేస్తున్నాను కదా. చెప్పు"

"నాది ఏ. మరి నీది? "

6



వరలక్ష్మిగారి విలేఖరుల సమావేశం జరుగుతోంది. వరలక్ష్మి ఒక అరగంటసేపు అనర్గళంగా అనాదిగా ఆడజాతిమీద జరుగుతున్న దోపిడీని, 'ఎవరు' లాంటి నవలలు చేస్తున్న ద్రోహాన్ని వివరిస్తూ వీరావేశంతో ఉపన్యసించింది. అది ఆమెతో ఎప్పుడూ వుండే సోదే కాబట్టి విలేఖరులు ఒక చేత్తో చెవి మూసుకొని మరోచేత్తో ఆమె చెప్పిన దాంట్లో ఆణిముత్యాలు ఏమయినా వుంటే రాసుకుంటున్నారు.

విలేఖరులలో ఎవరికీ ఎవరు నవల మీద చేస్తున్న విమర్శ ఏమిటో స్పష్టంగా అర్థం కాలేదు. ఉపన్యాసం ముగించిన తరువాత ఇక ప్రశ్నలు అడుక్కోండి అన్నట్లుగా సైగ చేసింది.

"మీరు ఎవరు నవలని పూర్తిగా చదివారా? " ఉత్సాహంగా ప్రశ్నలు వేయడం మొదలెట్టాడు రేవన్

"అవును పూర్తిగా చదివాను"

"ఆ నవల చదవాలని మీకు ఎందుకు అనిపించింది"

"అదో పనికిమాలిన నవల అని సహసభ్యురాలు చెబితేనూ తెప్పించుకుని చదివాను"

"అయితే మీరు ప్రతి పనికిమాలిన నవలా చదువుతారా? " సాధ్యమయినంత సీరియస్‌నెస్‌తోనే అడిగాడు రేవన్. కానీ, ఎవరో కిసుక్కున నవ్వారు.

వరలక్ష్మి వెంటనే సర్దుకొని "ఆ నవలలో

## జ్యూస్‌తో జుట్టుకు లంకె

"ఏంట్రా!... ఇరవై నిండక ముందే వెంట్రుకలూడి పోతున్నాయ్"...

"హెరిడిటీ బాబూ! మేనమామల పోలిక" ఇలాంటి డైలాగులు మనం పలుమార్లు వింటూనే ఉంటాం. నిజమే.

ఒక్క తల్లి నుంచి సంక్రమించిన జీన్స్ వల్లే జుట్టూడిపోదు. హెరిడిటీలో ఫస్ట్ డిగ్రీ బంధుత్వాలు అంటే... తండ్రి, అన్నయ్యలు తర్వాత మేనరికాలు. ఇలాంటి డామినెంట్ జీన్స్ కలయిక వల్ల కూడా బట్టతల వస్తుంది. ఇప్పుడు జుట్టూడిపోకుండా, విదేశాల్లోని డెర్మటాలజిస్టులు ప్రతి రోజూ "సాపాల్మెట్టో చెర్రీ జ్యూస్" 320 మి.గ్రా తీసుకోవాలని అంటున్నారు. ఈ సాపాల్మెట్టోలో జట్టు రాలడానికి తోడ్పడే ఎంజైముని నియంత్రించే శక్తి ఉంది. దీని వాడకం వల్ల మగవారిలో బట్టతల రావడాన్ని అరికట్టవచ్చు అంటున్నారు. మాంసాహారం ఎక్కువగా తినడం వల్ల కూడా జుట్టూడిపోయే అవకాశం వుందట. కారణం మాంసంలో ఉండే కొవ్వు రక్తప్రసరణలోకి "టెస్టోస్టిరాన్"ని విడుదల చేస్తుంది. ఇది "డై హైడ్రో టెస్టోస్టిరాన్"గా మారి జుట్టు మొదళ్ళు కుంచించుకు పోయేలా చేస్తుంది. సాపాల్మెట్టో చెర్రీ ఈ టెస్టోస్టిరాన్ డైహైడ్రో టెస్టోస్టిరాన్‌గా మారడాన్ని నిరోధిస్తుంది. హెరిడిటీ, వత్తిడి, మాంసాహారం, స్మోకింగ్, డ్రింకింగ్, షాంపూల వాడకం... మొదలైన వాటి వల్ల వచ్చే బట్టతలను 'సాపాల్మెట్టో చెర్రీ' జ్యూస్ తీసుకోవడం వలన కొంతమేరకు నివారించొచ్చని శాస్త్రవేత్తలు అంటున్నారు.



కొన్ని చెడ్డ విషయాలు వున్నాయని చెబుతేనూ" అంది

"అవేమిటో కొన్ని చెప్పగలరా? "

"ఆ నవల చదివిన ప్రతి మొగవాడూ భార్య మీద అనుమానపడటం ప్రారంభిస్తాడు"

"గుమ్మడికాయల దొంగంటే ప్రతి స్త్రీ ఎందుకు భుజం తడుముకోవాలి? మీవారూ మీమీద అనుమానపడ్డారా? "

"లేదు. ఆయనింకా ఆ నవల చదవలేదు"

"చదివితే అనుమానపడేవారా? "

"పడరు. నా మీద ఆయనకు మంచి నమ్మకం"

"మీరు అసెంబ్లీ ముందు చేయబోయే నిరసన ప్రదర్శనకి ఎంతమంది వస్తారని అనుకుంటున్నారు? "

"ఆ నవలవల్ల దగాపడ్డ స్త్రీలందరూ వస్తారు". చెప్పిన తరువాత అలా చెప్పాల్సింది కాదనుకుంది కానీ సమయం అప్పటికే మించిపోయింది.

"అంటే అక్రమ సంతానం కలిగివున్నవారంతా మీకు సపోర్టింగ్‌గా వస్తారనా!"

"అలా అని కాదు, ఆ నవల వల్ల అనుమానాల బారిన పడ్డవారు ఎవరయినా రావచ్చు"

"మీ నిరసన అందులో వివరించబడ్డ అంశాల మీదనా లేక వాటిని నవలలో రాయడం మీదనా? "

"అందులో వివరించబడిన విషయాలను గురించి"

"బ్లడ్ గ్రూప్ మనస్తత్వాల గురించి వది లేస్తే మిగతా విషయాలు సైన్సే కదా"

"అయినంత మాత్రాన ప్రజలందరికీ అంత విస్పష్టంగా చెప్పాల్సిన అవసరం ఏం వుంది? "

"ఒక సత్యాన్ని సత్యంగా పాఠకులకి చెప్పడం రచయిత చేసిన పొరపాటా లేక అది తప్పు చేసినవారి పొరపాటా? "

"పొరపాటు ఇద్దరిదీనూ. నిజం నిష్ఠూరంగా వున్నపుడు చెప్పకపోవడమే మంచిది. ఈ అనుమానాలు ఎన్ని కాపురాలలో చిచ్చుపెడుతున్నాయో ఏమో. ఆ నవలలో సామాజిక స్పృహ ఏం వుంది? "

"సామాజిక స్పృహ లేని నవలలన్నింటినీ, సినిమాలన్నింటినీ నిషేధిస్తే ఇక మిగిలేవి ఏ రెండో మూడో వుంటాయి కదా. మీరు చదివే ప్రతి నవలా, చూసే ప్రతి సినిమా అందులో స్పృహ వుందో లేదా కనుక్కొని చూస్తారా? సగటు పాఠకుడు, వీక్షకుడు కేవలం సరదా కోసం చూస్తారు కదా"

"సామాజిక స్పృహ లేదన్నదాన్ని కేవలం ప్రస్తావించానంతే కాని అందువల్లనే నిషేధించమని అనడంలేదు. ఎన్నో కాపురాల్లో అశాంతిని నెలకొలిపే ప్రమాదం వుంది కాబట్టి నిషేధించాలంటున్నాను. అందులో మరో పనికిమాలిన విషయం కూడా వుంది. బ్లడ్ గ్రూప్ మెంటాలిటీస్ అట. ఒక సూడో సైన్స్‌ను పట్టుకొని దాని గురించి ప్రముఖంగా రాశాడు రచయిత. అదో పెద్ద క్రేజ్ అయింది అందరిలో. ఇలాంటి పనికి మాలిన విషయాలకి ప్రాధాన్యం ఇవ్వడం తప్పు"

"అలాగా. మీ బ్లడ్ గ్రూప్ ఏమిటి? "

"నాది ఓ. నాలోని లీడర్షిప్ లక్షణాలు చూస్తుంటే ఎవరయినా గెస్ చేయవచ్చు"

"మీరు ఉపన్యసించేటప్పుడు ప్రదర్శించే హావభావాలని చూసి ఓ అయివుంటుందని అనుకున్నాను. మీ వారి బ్లడ్ గ్రూప్ ఏమిటి? "

"మంచివారు. నిజాయితీపరులు. సహృదయులు. వారిది ఏ కాక ఇంకేం అవుతుంది"

"మీ అమ్మాయిలది? "

"వాళ్లవి గుర్తుకు లేవు. చిన్నప్పుడు ఎప్పుడో ఏదో అవసరముండి చేయించామంతే. వారి మనస్థత్వాలను బట్టి ఒకరిది ఏ మరొకరిది ఓ అయివుండొచ్చుననుకుంటున్నాను"

"మీ చిన్న కూతురికి నాట్యరంగంలో ప్రవేశం ఉండి మంచి పేరు తెచ్చుకుంటున్నది కదా. తల్లిదండ్రుల ఒత్తిడి వల్ల ఈ అభిరుచి ఏర్పడలేదని, స్వంతంగానే అభిరుచి ఏర్పడిందనీ ఒక ఇంటర్వ్యూలో ఆమె చెప్పినట్లు గుర్తుంది నాకు. దానిని బట్టి ఎబి అయివుంటుందని అనుకుంటున్నాను"

వరలక్ష్మి గుండెల్లో రైళ్ళు పరుగెత్తి ఇబ్బందిగా కుర్చీలో కదిలింది. ఈ విలేఖరి ఎవరో గానీ అసాధ్యుడిగా వున్నాడు అనుకుంది.

వరలక్ష్మి విలేకరుల సమావేశం 'ఏ టివి' లో ప్రత్యక్ష ప్రసారం కావడంతో చూస్తున్న ఆమె కూతురు మదాలస ఉలిక్కిపడింది.

"బాబూ, నీ పేరేమిటో గానీ ఈ సమావేశం ఆ దిక్కుమాలిన నవల గురించి అనుకుంటా అంతేగానీ నా గురించి కాదు" వరలక్ష్మి అంది తీవ్రంగా.

మదాలస స్కూటీ వేసుకొని బయల్దేరింది రక్తపరీక్ష చేయించుకోవడానికి.

7



పరమానందస్వామి తన్మయత్వంతో గడ్డం నిమురుకుంటుండగా, మనసులోకి ఒక ఆలోచన వచ్చి ఆ మధురోహలకు భంగం కలిగింది. అలాగే గడ్డం పీక్కుంటూ ఆలోచించ



సాగాడు. ఈమధ్య తన సూక్తులను వినక భక్తకోటి పాపాల బారిన పడిపోతున్నారని అంతరాత్మ ఘోష అది. అంతేకానీ స్వాము లవారికి ప్రచార కాంక్ష బొత్తిగా లేదు. తిరుపతిలో పూజలు శాస్త్రప్రకారం జరగడంలేదనీ, భక్తులంతా ఆత్మరక్షణ కోసం కరాటే నేర్చుకోవాలనీ, ఇలా అవీ ఇవీ భక్తకోటి శ్రేయస్సు కోసం కెలుకుతుంటారు. అంతేకానీ, మరే స్వార్థంతోనూ కాదని ప్రియమయిన భక్తకోటి అర్థం చేసుకోవాలి మరి. అలా ఈమధ్య ధర్మ సందేహాలని కెలకడానికి ఏమీ తోచకపోవడంతో విచారవదనుడైన స్వాము లవారికి ఆ రోజు దినపత్రిక

మీదా, అందులో ఆడజాతి అంటూ ఏదో హెడ్డింగు కనపడగా ఆసక్తి అధికమై మనసు కాసేపు పరవళ్ళు తొక్కింది. ఆ శీర్షికతో వచ్చిన ఫొటో కూడా చాలా మంచి అందమయిన ముద్దుగుమ్మలతో ముద్దుముద్దుగా ఉందామె. మరి స్వాములవారి మనసుని మనం ఎలా తప్పుపట్టగలం? స్వామి ఆలోచించే ప్రతిదానికీ, చేసే ప్రతి పనికీ ఏదో పరమార్థం ఉంటుం ది. అల్పమయిన మన మనసులు అర్థం చేసుకోవాలి. లేకపోతే ఏదో ఒక బ్రహ్మాండమయిన అర్థాన్ని మనమే అన్వయించి పుణ్యంకట్టుకోవాలి మరి.

పరమానందస్వాముల వారికి కనిపించింది మరేమిటో కాదు. వరలక్ష్మి గారి విలేఖరుల సమావేశం. ఆ విలేఖరుల సమావేశం చూసేవారికి కన్నుల పండువగా ఉండాలని తన వెనకాలే అందమయిన సభ్యులను నిలుచోబెడుతుంది. ఒట్టి తన ముఖాన్నీ మొత్తం చూపిస్తే వీక్షకులూ, పాఠకులూ జడుసుకుంటారని బాగా తెలుసు కాబట్టి. స్వాములవారు వరలక్ష్మి ముఖాన్ని త్వరగా చీదరించుకొని ఎక్స్‌ట్రా ఆర్టిస్టుల్లా ముసిముసిగా నవ్వుతూ వెనకే ఉన్న ముద్దుగుమ్మల్ని ఆవురావురుమంటూ మురిపెంగా చూసుకొని పులకించిపోయాడు. కొద్దిసేపట్లోనే వారికి ఇహము, అహమూ గుర్తుకు వచ్చి ఆ విలేఖరుల సమావేశం వివరాలు చదివి గిలగిల గింజుకున్నాడు. ఒక మంచి వివాదాస్పద అంశాన్ని వరలక్ష్మి తన్నుకుపోతున్నందుకు. వరలక్ష్మి ముందు పడ్డా ఆమెకే మొత్తం క్రెడిట్ పోకూడదని తీర్మానించుకొని శిష్యపరమాణువు అల్పానందను పిలిచి 'ఎవరు' నవల కొనుక్కొని పత్రమ్మని ఆదేశించి మరో పరమాణువు అమితానందకి ఈ రోజు ముఖ్యమయిన దీక్ష ఉందని భక్తకోటికి చెప్పమని చెప్పి శయన మందిరంలోకి వెళ్ళాడు. అమితానందకి ఈ రోజుకి గురూగారు పడకెక్కేసి గుర్రుపెట్టి నిద్దరోతారని అర్థమయి ముసిముసిగా నవ్వుకుంటూ స్వామివారు శుద్ధి దీక్షలో ఉన్నారని, భక్తులకు ఈ రోజు దర్శనం ఇవ్వబోరని బయట బోర్డెట్టేశాడు భక్తుల సమాచారం కోసం.

నవల వచ్చాక ఆసాంతమూ చదివారు దానిలో రంధ్రాన్వేషణ చేస్తూ. వరలక్ష్మికి దొరకని విషయం ఏదన్నా పట్టాలని, మొదటిసారి చదివితే వరలక్ష్మికి దొరికినవి తప్ప వేరే ఏమీ అగుపించలేదు. అలా అయితే లాభం లేదనుకొని కాస్త సురాపానం చేసి గుర్రుకొట్టి నిద్రోయి మళ్ళీ నవల మీద పడ్డారు స్వాములోరు. అప్పుడు గానీ కొంచెం కొంచెంగా ఐడియా రాలేదు. రక్త మనస్తత్వాల పేరిట అసంబద్ధ శాస్త్రాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చి సనాతన హిందూ

ధర్మానికి ద్రోహం తలపెడుతున్నాడు రచయిత అని గొంతు చించుకుని అరచి భక్త కోటికి చెప్పాలని దృఢనిశ్చయానికి వచ్చాడు. ఆ ఆలోచన వచ్చిందే తడవుగా అల్పానందను, అమితానందను పిలిచి సనాతన సాంప్రదాయాలకు ఆ నవల వల్ల కలుగుతున్న విఘాతాన్ని సోదాహరణంగా వివరించారు. శిష్యులు స్వామీజీ వారి అభిప్రాయంతో యథాప్రకారం ఏకీభవించి వారి ధర్మ సంస్థాపనోద్దేశ్యాన్ని వేనోళ్ళ పొగిడారు. ఆశ్రమం తరపున ఒక ప్రకటన ఎలా ఇవ్వాలనే విషయాన్ని శిష్యులకు విపులీకరించి మళ్ళీ శయన మందిరానికి పయనించారు.

**ఇదివరకు గోత్రాలు, నక్షత్రాలు చూసుకుని పెళ్ళిళ్ళు చేసుకునేవారని ఇప్పుడవి మానేసి ఎక్కడో జపాన్‌లో పాటించే రక్తం గ్రూప్‌లను బట్టి పెళ్ళిళ్ళు జరుగుతున్నాయని ఇలాంటి విదేశీ అనుకరణను ఎంతమాత్రం సహించరాదని అనుకున్నారు**

ఒక రెండు రోజుల తరువాత పరమానందాశ్రమం నుండి 'ఎవరు' నవలని ఖండిస్తూ ఒక ప్రెస్ రిలీజ్ వచ్చింది అన్ని దినపత్రికలలో. సదాచారపరాయణులయిన స్వామి వారి భక్తులు, అభిమానులు ఆ ఆశ్రమం ప్రకటనతో ఏకీభవించారు. ఇదివరకు గోత్రాలు, నక్షత్రాలు చూసుకుని పెళ్ళిళ్ళు చేసుకునేవారని ఇప్పుడు అది దాదాపుగా మానివేసి ఎక్కడో జపాన్‌లో పాటించే రక్తం గ్రూప్‌లను బట్టి పెళ్ళిళ్ళు జరుగుతున్నాయని ఇలాంటి విదేశీ అనుకరణను ఎంతమాత్రమూ సహించరాదని అనుకున్నారు. భారతీయ స్త్రీలు అందరూ ఎంతో పవిత్రులనీ వారి శీలాన్ని శంకించడం అపరాధమనీ సెలవిచ్చిన ప్రకటనతో విజ్ఞులు చాలామంది ఏకీభవించారు.

భారతీయ సంస్కృతి మీద, స్త్రీల మీద అగౌరవాన్ని కలిగిస్తున్న 'ఎవరు' నవలని తక్షణం నిషేధించాలని ఆశ్రమం ఇచ్చిన పిలుపుతో చాలామంది తల్లిదండ్రులూ, వృద్ధులూ ఏకీభవించారు. అయితే పరమానందస్వామి ప్రచార కాంక్ష, ప్రతిదానిలోనూ జోక్యం చేసుకునే అతగాడి ఆశ్రమం నైజం తెలిసిన యువత అలాంటి చాదస్తపు పిలుపులను పట్టించుకోలేదు.

తమ ప్రకటనకు అనుకున్నంత ప్రతిస్పందన రాకపోవడంతో స్వాములవారు మళ్ళీ గడ్డం నిమురుకుంటూ ఆలోచనల్లో పడ్డారు.

* * *

"నాది ఓ. మరి బాబుది?" తన బ్లడ్ గ్రూప్ చెబుతూ అడిగాడు గురు.

"బాబుది కూడా ఓ నే" అంది రమణి.

"అయితే బాబు నా బాబేనన్న మాట" హర్షాతిరేకంతో అన్నాడు.

"మరీ అంత ఆనందపడకు"అంది తాపీగా

"ఎందుకు?"

"రవీంద్రది బి"

"అయితే!"

"నాది ఏ, రవీంద్రది బి కాబట్టి మా ఇద్దరికీ కూడా ఓ పిల్లలు పుట్టవచ్చు"

"హు! బాబు బ్లడ్ గ్రూప్ ఎలా తెలుసు నీకు. ఇది తెలుసుకోవడం కోసమే పరీక్ష చేయించావా?" అన్నాడు నీరసంగా.

"కాదు" అని నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు?"

"రవీంద్ర చేయించాడు"

"రవీంద్రనా? దీని కోసమేనా...?"

"ప్రత్యేకంగా తీసుకువెళ్లి చేయించాడు అంటే దీని కోసం కాక మరేం వుంటుంది."

"స్పెషల్‌గా తీసుకెళ్లి చేయించాడని ఎలా తెలిసింది నీకు"

"కోపంలో బ్లడ్ టెస్ట్ రిపోర్టు అజాగ్రత్తగా పెట్టాడు. నిన్ననే నా కంటపడిందది."

"కోపం ఎందుకు?"

"బాబుకు తనే తండ్రి అని ఖచ్చితంగా

నిర్ధారణకు రాలేకపోయాడు కాబట్టి"

"అలా అని నీకెలా తెలుసు? "

"కొద్ది రోజుల క్రితం బాబుని బయటకి తీసుకువెళ్లి వచ్చి, నేను 'ఎవరు' నవల చదువుతుండటం చూసి చిరాకు పడి తనకి త్వరగా ఇవ్వమని అసహనంగా అడిగాడు. తరువాత కొద్దిసేపటికి ఆ పుస్తకాన్ని విసిరి కొట్టాడు. అప్పుడు ఎందుకు అలా చేశాడో అర్థం కాలేదు. నిన్న బాబు బ్లడ్ రిపోర్ట్ కనపడ్డాక అర్థమయింది."

"అలాగా, నవల మీద ఎందుకంత కోపం రవీంద్రకు? "

"ఎందుకంటే నా గ్రూప్ ఏ, రవీంద్రది బి కాబట్టి నాకు అన్ని రకాల బ్లడ్ గ్రూప్ పిల్లలు పుట్టవచ్చు అందువల్ల బాబు నీ వల్ల పుట్టినా రవీంద్రకి ఆ విషయం ధ్రువపడే అవకాశం లేదు. డియన్ఏ టెస్ట్ చేయిస్తే తప్ప"

"అయితే ఇంకేం మనం మళ్లీ పిల్లల్ని కందాం"

"చాల్లే"

"ఇంతకూ బాబుకి ఆ టెస్ట్ ఎందుకు చేయించాడంటావు? నీ మీద అనుమానం ఎలా వచ్చింది? "

"ఎక్కడో ఎప్పుడో నా ప్రవర్తన అనుమానాస్పదంగా అనిపించి వుంటుంది. ఈ మధ్య సినిమాల్లో అవకాశాలు తగ్గి పనిలేక ఆలోచనలు ఎక్కువయి రకరకాలుగా నన్ను బాధ పెట్టి తన కోపాన్ని తీర్చుకుంటున్నాడు".

"అలాగా. మరి నీ మీద అనుమానపడి రక్తపరీక్ష చేస్తే నీకేం కోపం రాలేదా? ఎందుకు చేయించావని అడగలేదా? ".

"కోపం రాలేదు. నవ్వొచ్చింది. మన విషయం బయటపడలేదు కదా అందుకని".

"ఇంతకూ బాబుకి తండ్రి ఎవరంటావు? నేనా, రవీంద్రనా? ".

"ఒక్క నిముషం ఆగు".

"సరే"

"రవీంద్ర"

"ఎలా చెప్పగలవు? "

"బొమ్మాబొరుసు వేశాను"

"అంటే? "

"టాస్"

"ఆ!"




ఎవరు రచయిత సత్యశ్రీని రేవన్ ఇంటర్వ్యూ చేసి మరో సంచలనం సృష్టించాడు.

ఆ ఇంటర్వ్యూ:

"మీ రచన మీద మహిళా జాగృతి అసెంబ్లీ ముందు నిరసన ప్రదర్శన నిర్వహిస్తోంది కదా. దాని మీద మీ అభిప్రాయం? "

"చాలా సంతోషం. ప్రజాస్వామ్యంలో ఎవరి భావాలు వారు ప్రకటించుకోవచ్చు అలాగే నిరసనలు కూడా శాంతియుతంగా తెలుపుకోవచ్చును".

"ఆ విమర్శలతో మీరు ఏకీభవిస్తారా? "

"లేదు. ఏకీభవించను. ఇలా ప్రతి ఒక్కరి విమర్శలకి ఏకీభవిస్తూ పోతే నేను రచనలు చేయలేను. కలం కింద పెట్టాల్సి వస్తుంది. ఎంత మంచి రచనలు చేసినా ఎవరో ఒకరు ఏదో ఒక విధంగా విమర్శించడం మానరు. అందుకే నేను విమర్శలని పెద్దగా పట్టించుకోను. నా ధోరణిలో నేను రాస్తుంటాను. నచ్చిన వాళ్లు చదువుతారు. నచ్చని వాళ్లు వదిలేస్తారు. నేను మాత్రం ముఖ్యంగా నా ఆత్మ సంతృప్తి కోసం రాస్తుంటాను".

"అసెంబ్లీ ముందు జరగబోయే నిరసనకి మీ ప్రతిస్పందన ఏమిటి? "

"చాలా సంతోషం. అలాంటి నిరసన ప్రదర్శనలు రాష్ట్రం నలుమూలలా జరగాలి.

అలాంటి ప్రదర్శనల వల్ల నా నవలకు మంచి పబ్లిసిటీ వస్తుంది. ఆ నిరసన ప్రదర్శన వార్త తెలిసిన తరువాత మూడు రోజుల్లోనే నవల కొనుగోళ్లు అయిదు శాతం పెరిగాయని పబ్లిషర్ చెప్పాడు".

"మీ నవలపై పరమానందస్వామి కూడా ధ్వజమెత్తారు కదా".

"ఆయన ధ్వజం ఎత్తనిది ఎవరి మీద? ఆయన ధ్వజం ఎప్పుడూ ఎత్తే వుంటుంది కదా" వ్యంగ్యంగా నవ్వుతూ అన్నాడు సత్యశ్రీ.

రచయిత మాటల్లోని శ్లేష అర్థమయి రేవన్ కూడా నవ్వాడు. "సనాతన ధర్మాల్ని మీరు భ్రష్టు పట్టిస్తున్నారనే విమర్శకు మీ సమాధానం? "

"సనాతన ధర్మాలు అని ఆయనే ఒప్పుకున్నారు కదా. నా నవల వల్ల అవి కొద్దిగా ఆధునీకరించబడితే మంచిదే కదా. పాత కాలంలో స్వాములు పాదయాత్రలు చేసేవారు. మరి ఇప్పుడు కార్లలో ఎందుకు తిరుగుతున్నారు? కాలాన్నిబట్టి మనమూ మారాలి".

"బ్లడ్ గ్రూప్ పర్సనాలిటీస్ అనేది సైన్స్ ధ్రువపరచలేదు కదా. దానిని మీరు ప్రాచుర్యంలోకి తేవడం ఎంతవరకు సబబు? "

"దానిని ఇంకా సైన్స్ సపోర్ట్ చేయని విషయాన్ని, ఆ థియరీ మీద ఎన్నో విమర్శలు వున్న విషయాన్ని నవలలో స్పష్టంగా చెప్పాను. అయితే ఆ విషయాలు స్టాట్స్ ద్వారా ధ్రువపడ్డాయని చెప్పవచ్చు".

**నాకెందుకూ గిల్టీనెస్? అయినా నేనేమన్న కొత్త విషయం కనిపెట్టానా? అది ఎప్పటినుండో సైన్స్ ప్రకారం తెలిసిన విషయమే కదా. కాకపోతే నేను అందరికీ తెలిసేటట్టు విపులీకరించాను అంతే !**

"మీ నవలలో వివరించిన పేరెంట్స్, పిల్లల బ్లడ్‌గ్రూప్ కాంబినేషన్‌ల వల్ల కొన్ని కాపురాలు కూలిపోయే ప్రమాదం ఉంది కదా. అది మీకు గిల్టీగా అనిపించడం లేదా? "

"నాకెందుకూ గిల్టీనెస్? అది తప్పుచేసిన వారికి వుండాలి లేదా తప్పు చేశామని అనుకునేవారికయినా వుండాలి కానీ. కొన్ని అనుబంధాలు చెడిపోవచ్చు కానీ వాస్తవమయిన కొత్త అనుబంధాలు ఏర్పడే అవకాశాలు వున్నాయి కదా. అయినా నేనేమన్న కొత్త విషయం కనిపెట్టానా? అది ఎప్పటినుండో సైన్స్ ప్రకారం తెలిసిన విషయమే కదా. కాకపోతే నేను అందరికీ తెలిసేటట్టు విపులీకరించాను అంతే"

"మీకు బ్లడ్ గ్రూప్స్ మీద నవల రాయాలని ఎలా తట్టింది? "

"నా చిన్నప్పటినుండే పత్రికలు బాగా చదువుతుండే వాడిని. అప్పట్లోనే బ్లడ్‌గ్రూప్ వ్యక్తిత్వాల మీద చిన్న ఆర్టికల్ వచ్చింది. దానిని ఎవరూ పెద్దగా పట్టించుకోలేదనుకుంటా. అప్పటినుండీ బ్లడ్‌గ్రూప్ వ్యక్తిత్వాలని పరిశీలించడం మొదలుపెట్టాను. నా పరిశీలనలు చాలావరకు నిజమే అనిపించాయి. ఎక్కడో ఒకసారి హిట్లర్ ఏ బ్లడ్ గ్రూప్‌లా తప్ప. హిట్లర్‌ది మ్యుటేటెడ్ ఏ బ్లడ్ గ్రూప్ అని సరదాగా అంటారు!"

"మీ తదుపరి రచన ఏ సబ్జెక్ట్ మీద వుంటుంది? అది కూడా ఇంత సంచలనం సృష్టిస్తుందా? "

"రకరకాల థాట్స్ వున్నాయి. ఇంకా తదుపరి రచన దేనిమీద రాయాలో నిర్ణయించుకోలేదు. నేను సంచలనం సృష్టించడం కోసమనే రాయను కానీ అది సంచలనం సృష్టిస్తే వేరే విషయం"

ఈ ఇంటర్వ్యూను ప్రచురించిన 'ఈతరం' దినపత్రిక కాపీలన్నీ క్షణాల్లో హాట్‌కేకుల్లా అమ్ముడుపోయాయి. ఆ పత్రిక దొరకనివాళ్లు ఆ ఇంటర్వ్యూను- తమకు తెలిసిన వాళ్ల

దగ్గర ఆ పత్రిక తీసుకొని జీరాక్స్ చేయించు కుని చదువుకున్నారు.



పరమపిత ఒక స్వచ్ఛంద సేవకుడు. ప్రతి విషయంలోనూ మంచే చూడాలని ఆశించే దయార్ద్ర హృదయం కలవాడు. 'ఎవరు' నవల మీద చెలరేగుతున్న దుమారం చూసి ఆయన గారి సుకుమారమయిన హృదయం వికలం చెందింది. ఆ నోట ఈ నోట ఎవరు గురించి వినడమే గానీ ప్రజాసేవా కార్యక్ర మాల్లో మునిగి తేలుతున్నవాడయినందువల్ల నవలలు చదివేటంత, సినిమాలు చూసేంత తీరిక ఎప్పుడూ లభించదు. ఎలాగో తీరిక చేసుకొని ఆ నవల చదివాడు. చదివాక తన పిల్లలు అనుకుంటున్నవారు తన పిల్లలేనా అని ఏ కోశానో లేశమాత్రం అనుమానం ప్రవేశించినా ఎలాగో నిగ్రహించుకొని నిలదొ క్కుకున్నాడు. తన భార్య పట్ల అలా పొరపా టుగా కూడా ఆలోచించకూడదని మనసులోనే తీవ్రంగా తీర్మానించుకొని భార్యామణి పట్ల అవ్యాజానురాగం పెంపొందగా కూరగాయలు తరుగుతున్న గాయత్రి దరిచేరి మురిపెంగా తలమీద చేయివేసి ఆపేక్షగా నిమిరాడు. ఈయనగారు అప్పుడప్పుడు చేసే వికారపు చేష్టలు తెలిసినదయిన గాయత్రి చిరాగ్గా ఆ చేతిని తోసివేసి శ్రీవారి భావ స్పందనలను ఏ మాత్రమూ గమనించకుండా టీవీలో ఏడు పుగొట్టు సీరియల్ చూస్తూ తను చేస్తున్న కూరగాయలు కోసే మహత్తరమయిన కార్యక్ర మంలో ఏకాగ్రతతో నిమగ్నమయ్యింది.

పరమపిత మనస్సు ఉసూరుమనడంతో పరమ నిదానంగా అక్కడనుండి తోక ముడు చుకొని నిష్క్రమించాడు. ఇక చేసేదేమీ లేక మళ్ళీ ఆ నవలను పట్టుకొని అందులో మంచి విషయాలు ఏమయినా వున్నాయా అని వెతక సాగాడు. ఆ నవలను రెండోసారి చదు వుతుంటే రచయిత సంఘానికీ, ధర్మానికీ చేస్తున్న సేవ అర్థమయి మిగతా జనులం దరూ ఎందుకు ఈ నవలని అపార్థం చేసు కుంటున్నారా అని అతగాడి హృదయం ఆవే దన చెందింది. ఈ నవల వల్ల జనుల్లో ముఖ్యంగా మహిళల్లో ధర్మం ఎంత చక్కగా నిలబడుతుందో మనసులో ఆవిష్కరణ అవు తుంటే పులకరించిపోయాడు పరమపిత.

ఆ నవలలో చెప్పిన రక్తపు జాతుల మన స్తత్వాల ద్వారా ప్రజలందరూ తమ మనస్త త్వానికీ, అభిరుచులకూ సరిపోయేట్టుగా భర్తా భార్యలను ఎన్నుకోగలుగుతారని అందువల్ల కాపురాలలో శాంతి, తద్వారా సౌభాగ్యాలు వెల్లివిరుస్తాయని అవగతమయింది. ఆ నవల లోనే వివరించిన తల్లిదండ్రులూ- పిల్లల రక్తపు జాతుల వల్ల అందరిలో ఆ విజ్ఞానం పెంపొంది తమ అక్రమ సంబంధాలు బయ టపడే అవకాశం వుండటం వల్ల అలాంటి పనులు చేయకుండా నిగ్రహంతో వుంటారనీ అందువల్ల సమాజంలో ఋజువర్తన పెంపొంది స్త్రీ పురుషులు సచ్ఛీలురుగా వుండ గలరని అవగతమయింది. ఆ రకంగా లోకంలో పాపభారం కొంతయినా తగ్గుతుం దని ఉపశమనం చెందాడు. ఇంత చక్కని విషయాలు ఎందుకు మిగతావాళ్ళు పెద్దగా పట్టించుకోవడం లేదా అని ఆవేదన కలిగింది. వెంటనే కలం తీసుకొని తన స్వచ్ఛంద సేవా సంస్థ 'స్వచ్ఛంద' తరపున ఒక పత్రికా ప్రక టన లిఖించి దగ్గరలో వున్న పోస్ట్ డబ్బా దగ్గ రకి పాదయాత్ర చేసి అందులో పడవేశాడు.

ఈతరం పత్రికలో ఎడిటోరియల్ బోర్డులో పనిచేస్తున్న కళారావుకి ఈ పత్రికా ప్రకటన చూసి ఒకసారి తలగోక్కున్నాడు ఏం చేయాలో అర్థం కాక. ఒక ఊరు, పేరు లేని స్వచ్ఛంద సంస్థ తరపున చాలా వరకు

గ్రాంథిక భాషలో వచ్చిన ప్రకటనను ప్రచురణకు తీసుకోవాలా వద్దా అనేది అర్థం కాక సీనియర్ ఎడిటర్ తాతారావు నిర్ణయం కోసం పంపించాడు. ఆ ప్రకటనను చూసి తాతారావు ఎగిరి గంతేసినంత పని చేశాడు. 'ఎవరు' నవల మీద ప్రచురించడానికి మరికొంత మసాలా దొరికిందని అర్థమై దానిని బాక్స్ ఐటెంగా ప్రచురించమన్నాడు. మరునాడు పత్రికలలో దాన్ని చదివిన పెద్దలందరూ ఔరా నిజమే కదా అనుకున్నారు. అది చదివిన యువత మాత్రం తమ స్వేచ్ఛ తగ్గిపోతున్నందుకు లోలోపలే ఉడుక్కున్నారు. ముఖ్యంగా యువకులు ఇలా అయితే తమకు ఇక ఆంటీలు ఎలా పడతారని ఎవరికి వారు మౌనంగా ఆక్రోశించారు. మరికొంత మంది ఈ విధంగా తమకు 'ప్రైవసీ' ఉండకుండా పోతోందని తమ మిత్రుల వద్ద వాపోయారు. ఆల్రెడీ ఆంటీలను పడవేసిన మరికొంతమంది అబ్బాయిలు ఈ నవల వల్ల అంకుల్స్‌కి విషయం తెలిసిపోయి జంఝాటం అంతా తమ తలకు చుట్టుకోదు కదా అని జడుసుకుంటున్నారు.

అటువంటి సంఘటనలు మచ్చుకి రెండు...

ధర్మారెడ్డికి ఒక భయంకరమయిన పీడకల వచ్చి మధ్యలోనే దిగ్గునలేచి కూర్చున్నాడు. ఆ కలలో ఒకప్పుడు సంబంధం లాగించిన పరిమళ ఆంటీ తన ఇద్దరు పిల్లలతో ఇంటి ముందు దీనంగా నిలబడి తలుపుకొట్టింది. తలుపు తెరవగానే 'భర్త అందరి బ్లడ్‌టైప్‌లు చూసి తనను తన్ని పంపించాడనీ ఇక తనకు, తన పిల్లలకీ నువ్వే దిక్కనీ ఇంకో దిక్కు లేదని' మొరపెట్టుకుంది. ఈ హడావిడి అంతా చూస్తున్న చుట్టుపక్కల వాళ్ళు చెవులు కొరుక్కుంటున్నారు. ధర్మారెడ్డికి ఏం చేయాలో పాలుపోవడంలేదు. ఏదన్నా నచ్చ చెప్పబోతే పరిమళ వినడంలేదు. పరిమళ ముందే బాగా నూరిపోసిందేమో ఇద్దరు పిల్లలూ 'డాడీ' అని కాళ్ళకి చుట్టేసుకొని వదలడం లేదు. బయట జరుగుతున్న హడావిడి చూసి వచ్చిన తల్లిదండ్రులు ముందు ఆశ్చర్యపోయి తరువాత 'ఈ గొడవేమిట్రా' అని అడుగుతున్నారు.

ఈలోగా ధర్మారెడ్డికి మెలకువ వచ్చి చుట్టూ చూసుకొని 'హమ్మయ్యా. ఇది ఒట్టి కలేనా. నిజమేనేమోనని జడుసుకున్నాను. ఇక జన్మలో పెళ్ళయిన వాళ్ళతో సంబంధాలు పెట్టుకోను' అని ఒట్టేసుకొని మళ్ళీ పడుకున్నాడు.

సత్తిబాబు కొద్దిగా కంగారు మనిషి. భార్య మొదటిసారి గర్భం దాల్చినప్పటినుండీ తాను తండ్రి అయినందుకు సంతోషపడాలో లేక భాగ్యలక్ష్మి తల్లి అయినందుకు అనుమానపడాలో అర్థం కావడం లేదు. తనేమో కేంపులకీ గట్రా ఎక్కువ వెళుతుంటాడు. తాము కిరాయికి వుండే ఏరియాలోనేమో కాలేజీ కుర్రాళ్ళు బోలెడంత మంది వుంటారు. అసలే భాగ్యం బొద్దుగా ముద్దుగా వుంటుంది. క్యాంప్‌కి వెళ్ళబోయేముందు భార్య ముక్కు కోసి పోతే ఎలా వుంటుందని కొన్నిసార్లు దీర్ఘంగా ఆలోచించాడు కానీ, అది మరీ మానవత్వం కాదేమోనని అలా చేయకుండా సరిపెట్టుకున్నాడు. క్యాంప్‌లో వున్నప్పుడు రాత్రి ఒంటరిగా దోమలు తోలుకుంటూ ఎందుకు అందమైన పెళ్ళాన్ని చేసుకున్నానా అని కుమిలి కుమిలి పోతుంటాడు. ఇంకో జన్మ అంటూ వుంటే ఖచ్చితంగా అనాకారినే పెళ్ళి చేసుకోవాలని కంకణం కట్టుకున్నాడు.

భాగ్యం ప్రసవించేరోజు దగ్గర పడుతున్న కొద్దీ సత్తిబాబులో సస్పెన్స్ సినిమా చూస్తున్న వాడిలా రోజురోజుకీ, నిముష నిముషానికీ ఆత్రుత పెరుగుతోంది. ఆఖరికి ఆరోజు దగ్గర పడింది. భాగ్యం లేబర్ రూంలోకి వెళ్ళింది. సత్తిబాబు పడుతున్న కంగారు చూసి అల్లుడు గారిని 'కంగారు మాలోకం' అనుకోకుండా భాగ్యం పట్ల చూపిస్తున్న శ్రద్ధగా భావించి భాగ్యలక్ష్మి తల్లిదండ్రులు సంతోషించారు.

లేబర్ రూంలో నుండి నర్స్ వచ్చి ఆ డోర్ ముందే కాలుగాలిన పిల్లిలా తచ్చాడుతున్న సత్తిని పిలిచి "కంగ్రాట్స్, మీకు మగ బిడ్డ" అంది.

"థాంక్స్ గానీ ఇంతకూ బ్లడ్ గ్రూప్ ఏమిటి? " అని అడిగాడు గుసగుసగా.

నర్స్ ఆ ప్రశ్నకి బోల్డెంత ఆశ్చర్యపోయి "ఆ టెస్ట్ మేము చేయం" అంది. సత్తిబాబు తెల్లబోయి "ష్, ష్, నెమ్మదిగా పిల్లాడు పుట్టగానే ఆ టెస్ట్ చేస్తారనుకున్నానే! చేయరా. ఇప్పుడన్నా చేసి చెప్పు" అన్నాడు హడావిడిగా

"కుదరదు" నర్స్ తాపీగా

"అమ్మ ఎంత మాట. తరువాత నీకు తృణమో, పణమో ముట్టచెప్పుకుంటాను గానీ ఎవరికీ తెలవకుండా ఆ పనిచేసి పెట్టు" అని గుసగుసగా బతిమిలాడాడు.

"సరే సరే. ఒక రెండు గంటలాగు" అని చెప్పి లోపలికి వెళ్లింది.

దూరంగా ఈ ఇద్దరి గుసగుసలు చూస్తున్న సత్తిబాబు అత్తామామలకి విషయం అర్థంకాక నర్సమ్మతో అంత ఇదిగా ముచ్చట్లేమిటా అని ముక్కున వేలు వేసుకోబోయేంతలో సత్తి వెనక్కు వచ్చి "మగ పిల్లాడంట" అన్నాడు - ముఖంలోని ఆదుర్దాని దాచేసి నవ్వు పులుముకుంటూ. అందరూ సంతోషంగా భాగ్యాన్ని చూడటానికి లోపలికి వెళ్ళారు. లోపలికి వెళ్ళాక నవ్వుని అలాగే వుంచుకొని భాగ్యం వైపు చూసి ఆపేక్షని అతికించుకొని బాబువైపు పరిశీలనగా చూశాడు తన పోలికలు అప్పుడే ఏమయినా కనబడతాయేమోనని. తేలునో, పామునో తాకినట్లు బాబుని తాక లేదనకుండా తాకాడు.

రెండు గంటల తరువాత వచ్చి నర్స్ రహస్యంగా చెప్పింది బాబు బ్లడ్ గ్రూప్ ఏమిటో. వెంటనే హాస్పిటల్ బయటికి వెళ్ళి జేబు లోంచి ఒక చీటీ తీసి చూసుకొని ముందు సంతృప్తిపడి తరువాత సంతోషించాడు. లోపలికి వచ్చి బాబు తలమీద చేయివేసి ఆప్యాయంగా తల నిమిరాడు. అప్పుడు తొంగి చూసింది అతడిలో తండ్రినన్న విజయగర్వం.

## ఎక్కడున్నాం మనం?




జడ్జిగా వాలెస్‌కు ఎంతో పేరుంది. ఇలా చూస్తే అలా అందుకుపోయే సమర్థుడు. అయితే వాదనలను పూర్తిగా వినే ఓపిక మాత్రం ఉండేదికాదు. అదొక్కటే కాదు.. కోర్టులో కునికిపాట్లు పడుతుండేవాడు. ప్రకాశం ఓసారి ఏదో కేసు వాదిస్తుండగా అలవాటు ప్రకారం చెంపకు చెయ్యి ఆనించుకుని అలాగే నిద్రపోయాడు. ప్రకాశం అది గ్రహించి పేపర్లను టేబుల్‌పై పెట్టేసి మౌనంగా తన కుర్చీలో కూర్చున్నాడు. కొన్ని నిముషాల తర్వాత వాలెస్ నిద్రలేచి, 'మిస్టర్ ప్రకాశం.. మనం ఎక్కడున్నాం? ' అన్నాడు.

'అదే నాకర్థంకావడంలేదు మిలార్డ్! మనం ఎక్కడున్నాం? ' అంటూ తిప్పికొట్టారు ప్రకాశం.

ఆ చురక వాలెస్‌మీద బాగానే పనిచేసింది. ఆ తర్వాత ప్రకాశం కేసువాదించేటప్పుడు ఎప్పుడూ ఆయన కునికిపాట్లు పడలేదు.

మానవ రక్తం ద్రవ కణ సముదాయం. రక్తం ఎర్రగా కొద్దిగా అంటుకునే లక్షణం కలిగి ఉంటుంది. రక్తంలో ఎర్ర రక్తకణాలు, తెల్ల రక్తకణాలు, ప్లేట్ లెట్స్ ఉంటాయి. మానవ రక్తంలో ప్లాస్మా ద్రవం 55%, రక్త కణాలు 45% ఉంటాయి. ఎర్ర రక్త కణాలను "ఎరిత్రోసైట్స్" లేక "రెడ్ బ్లడ్ సెల్స్" అంటారు. ఇవి శరీరంలోని అన్ని భాగాలకు హిమోగ్లోబిన్, ఆక్సిజన్‌ని తీసుకెళ్తాయి. హిమోగ్లోబిన్ వల్లనే రక్తం ఎరుపు రంగులో ఉంటుంది. వీటి జీవిత కాలం 120 రోజులు. ఈ ఎర్రరక్త కణాలు "ఎముకలో ఉండే మూలుగ (Bone Marrow)లో ఉన్న హిమో ఎరిత్రో బ్లాస్టులనే కణాల నుండి ఉత్పత్తి అవుతాయి. ఒక క్యూబిక్ మిల్లీమీటర్ రక్తంలో 4.5 నుండి 6.5 మిలియన్ల ఎర్ర రక్తకణాలుంటాయి.

తెల్ల రక్తకణాలకు రంగు లేకపోవటం వల్ల ఆ పేరు వచ్చింది. తెల్ల రక్తకణాలు వ్యాధి నిరోధక శక్తి కలిగి ఉంటాయి. ఒక క్యూబిక్ మిల్లీమీటర్ రక్తంలో 7000 వరకు తెల్ల రక్తకణాలుంటాయి.

ప్లేట్ లెట్స్ బోన్‌మేరోలో ఉత్పత్తి అయ్యే మెగా కారియోసైట్స్ ముక్కలుగా విడిపోవటం వల్లన ఏర్పడ్డ సూక్ష్మకణాల్ని ప్లేట్స్‌లెట్స్ లేదా త్రాంబోసైట్స్ అంటారు. ఒక క్యూబిక్ మిల్లీమీటర్ రక్తంలో సుమారు 3,00,000 ప్లేట్ లెట్స్ ఉంటాయి. రక్త ప్రసరణలో ప్రయాణించే ప్లేట్ లెట్స్ శరీర భాగాలకి గాయాలు, దెబ్బలు తగిలినపుడు వెంటనే త్రాంబోప్లాస్టిక్ అనే ఎంజైముని విడుదల చేసి గాయమైన చోటుకి చేరి రక్తస్రావం జరగకుండా, గాయమైన చోట రక్తం గడ్డకట్టేలా చేస్తాయి.




ప్లాస్మా ద్రవరూపంలో ఉండి రక్తంలో మిళితమై ఉంటుంది. రక్తంలో నీటి పరిమాణపు సమతుల్యత కాపాడటం, యాంటిజెన్లుగా పనిచేయటంలో, శరీరంలో ఆమ్ల-క్షార సాంద్రత సమతుల్యాన్ని కాపాడటంలో, రక్తపు PH తగ్గకుండా, పెరగకుండా బ్యాలన్సు చేయటంలో ప్లాస్మా ప్రొటీన్ల పాత్ర విశిష్టమైంది.

ఆరోగ్యవంతుడైన వ్యక్తి రక్తంలో 5,000 మిల్లీ లీటర్ల నుండి 6000 మి.లీ. రక్తం ఉంటుంది. ఒక రోజులో (24 గం॥లలో) గుండె 36,000 లీటర్ల రక్తాన్ని రవాణా చేస్తుంది. అంటే 1,75,000 కి.మీ. లకి సమానమైన దూరం ప్రయాణిస్తుంది. శరీరపు బరువును బట్టి పురుషుల్లో ప్రతి కిలోకు 76 మి.లీ. అంటే 5 నుండి 6 లీటర్ల రక్తం ఉంటుంది. స్త్రీలలో ప్రతి కిలో బరువుకి 66 మి.లీ. అంటే 4.5 నుండి 5 లీటర్ల రక్తం ఉంటుంది.

**బ్లడ్ గ్రూపులు:**

బ్లడ్ గ్రూపులని 4 రకాలుగా గుర్తించి విభజించారు.

1902లో కార్ల్‌లాండ్ స్టీనర్ మానవ రక్తంలో A, B, AB బ్లడ్ గ్రూపులను కనుక్కున్నాడు. ఎర్ర రక్తకణాల ఉపరితలం మీదుండే యాంటిజెన్స్ ఆధారంగా A, B, AB అనే ఈ గ్రూపుల వర్గీకరణ చేశారు. తరువాత 'O' గ్రూపుని కనుగొని, ఎర్ర రక్త కణాల ఉపరితలం మీద O గ్రూపుకి సంబంధించిన ఏ విధమైన యాంటిజెన్స్ ఉండవని నిర్ధారించారు. ఇవన్నీ క్రోమోజోమ్ 9లో ఉండే జన్యువు పర్యవేక్షణలో ఉంటాయి. యాంటీజెన్, యాంటీబాడీ చర్యవల్ల ఏర్పడే అగ్లూటినేషన్ ద్వారా రక్తంలో గ్రూపులని నిర్ణయిస్తారు.

ఒక వ్యక్తి బ్లడ్ గ్రూపును ఆ వ్యక్తి

రక్తంలో ఉండే A,B యాంటిజెన్‌లను బట్టి కనుగొంటారు.

A గ్రూపు వ్యక్తుల రక్తంలో యాంటి జెన్ – A ఎర్ర రక్తకణాల ఉపరితలం మీద; యాంటి జెన్-B యాంటీ బాడీ ప్లాస్మాలోనూ ఉంటాయి.

B గ్రూపు వ్యక్తుల రక్తంలో యాంటి జెన్ - B ఎర్ర రక్తకణాల ఉపరితలం మీద; యాంటిజెన్- A యాంటిబాడీ ప్లాస్మా లోనూ ఉంటాయి.

AB గ్రూపు వ్యక్తుల రక్తంలో యాంటి జెన్ A, యాంటిజెన్ B ఎర్ర రక్త కణాల ఉపరితలం మీద ఉంటాయి. ప్లాస్మాలో ఏవిధమైన యాంటిబాడీలో ఉండవు.

O గ్రూపు వ్యక్తుల్లో యాంటిజెన్ - A, యాంటిజెన్ - B ఎర్ర రక్త కణాల ఉపరితలం మీద ఉండవు. ప్లాస్మాలో మాత్రమే యాంటీబాడీ A, B, ఉంటాయి.

గ్రూపు నిర్ధారించ వలసిన వ్యక్తి రక్తాన్ని యాంటీ సీరమ్‌తో మిశ్ర మం చేస్తారు. ఈ యాంటీ సీరంలో యాంటీ -ఎ లేదా యాంటీ - బి యాంటీ బాడీలుంటాయి. ఏదైనా యాంటీజెన్ ఎర్రరక్త కణాల ఉపరితలం మీదుంటే.. అది యాంటీ సీరంలో ఉండే సంబంధిత యాంటీబాడీతో చర్య జరుగు తుంది. దీనివల్ల ఎర్రరక్తకణాలు గడ్డ కడ తాయి. దీనిని 'అగ్లూటినేషన్ లేదా క్లంపింగ్' అంటారు.

**ఆర్.హెచ్. యాంటీజెన్స్:**

1940లో డాక్టర్ వీనర్ రీజస్ కోతి ఎర్రరక్త కణాల్లో మరో కొత్త యాంటీజె న్‌ను కనుగొన్నారు. తరువాత మానవ రక్తంలోనూ ఈ రీజస్ ఫ్యాక్టర్ని కనుగొ న్నారు. దీన్ని ఆర్. హెచ్. యాంటిజెన్ అంటారు.

వ్యక్తి రక్తం యాంటీ ఆర్. హెచ్. యాంటీజెన్‌తో చర్య చెంది అగ్లూటినే షన్ ఏర్పడితే, ఆ వ్యక్తుల్ని 'ఆర్. హెచ్. పాజిటివ్' అని, అగ్లూటినేషన్ ఏర్పడక పోతే 'ఆర్. హెచ్. నెగటివ్' అనీ విభజిం చారు. ఆర్. హెచ్. పాజిటివ్ గ్రూపు కంటే, ఆర్. హెచ్. నెగిటివ్ గ్రూపు అరు దుగా ఉంటుంది. సహజ పరిస్థితుల్లో యాంటి - డి యాంటీ బాడీలు ప్లాస్మాలో ఉండవు.

వేర్వేరు తల్లిదండ్రుల బ్లడ్ గ్రూపుల ద్వారా పిల్లలకు సంక్రమించదగిన బ్లడ్ గ్రూపుల క్రింది పట్టికలో... చూడవచ్చు

| BLOOD GROUP FATHER MOTHER | A | B | AB | O |
|---|---|---|---|---|
| A x A | ✔ | x | x | ✔ |
| B x B | x | ✔ | x | ✔ |
| O x O | x | x | x | ✔ |
| A x B | ✔ | ✔ | ✔ | ✔ |
| AB x AB | ✔ | ✔ | ✔ | x |
| A x AB | ✔ | ✔ | ✔ | x |
| A x O | ✔ | x | x | ✔ |
| B x AB | ✔ | ✔ | x | x |
| AB x O | ✔ | ✔ | x | x |
| B x O | x | ✔ | x | ✔ |

✔ = Possible, x = Not Possible

వ్యక్తుల్లో Rh-Negative గ్రూపు అరు దుగా ఉంటుంది. A, B, AB, O గ్రూపుల్లో ఆర్. హెచ్. పాజిటివ్ లేదా ఆర్. హెచ్ నెగిటివ్‌గా ఉంటుంది.

సాధారణంగా ఏ బ్లడ్ గ్రూపుకు చెందిన వారైనప్పటికీ ఆర్. హెచ్. నెగి టివ్ కలిగిన వ్యక్తులు ఆర్. హెచ్. పాజి టివ్ వ్యక్తుల కంటే ప్రవర్తనలో భిన్నంగా, కొంత ఎక్సెంట్రిక్‌గా కనిపిస్తారు. వారు అనుమానం, సంశయం, భిన్నమైన ఆలో చనలు, వ్యతిరేక ఆలోచనలు కల్గి ఉన్నట్లు ఓ సర్వేలో తేలింది. కాని దీనికి సిద్ధాంతపరమైన సాక్ష్యాధారాలు ఏమీ లేవు.




బదరీ రహస్యంగా లాబ్స్‌కి వెళ్ళి వెతి కాడు కుముదిని బ్లడ్ గ్రూప్ ఏమయినా తెలుస్తుందేమోనని. కానీ లాబ్ వాళ్ళు రికార్డ్స్ ఏమీ భద్రపరుస్తున్నట్లు అనిపించక పోవడంతో బదరీకి ఏమీ తోచడం లేదు. బ్లడ్ టెస్ట్ రిజల్ట్స్ కుముదినీదేవి దగ్గరే వుండాలి. సీఎం శేషాచలం ఇంట్లో తప్ప కుండా వెతికే దొరకక తనకు ఈ పని అప్ప గించి వుంటాడు. ఇంత చిన్న పని ఇలా సమస్యగా అవుతుందని అనుకోలేదు. ఏం చేయాలా అని ఆలోచిస్తూండిపోయాడు. ఒక ఐడియా తట్టింది. నవ్వుకుంటూ లేచి వీరభద్రానికి ఫోన్ చేసి ఏం చేయాలో సూచనలిచ్చాడు. మరెవరికో ఫోన్ చేసి ముఖ్యమంత్రి నెల రోజులలో చేయబోయే పర్యటన వివరాలు కనుక్కున్నాడు. ఒక రెండు వారాల తరవాత ముఖ్యమంత్రి జపాన్ పర్యటన కోసం వెళ్ళి వారం రోజులు అక్కడే వుంటారు. అదే తగిన సమయం.

ఒక రెండు రోజుల తరువాత వీరభ ద్రాన్ని పిలిపించి ఎందుకు అనేది చెప్ప కుండా పదహారు రోజుల తరువాత ఏం చేయాలో వివరంగా సూచనలిచ్చి అయిదు వేల రూపాయలు చేతిలో పెట్టాడు.

* * *

లక్ష్యకి ఏం చేయాలో, తల్లి నుండి ఈ విషయం ఎలా రాబట్టాలో తెలీడం లేదు. తల్లి పట్ల అనుమానంతోనూ, తండ్రి పట్ల గిల్టీనెస్‌తోనూ ఎవరితోనూ సరిగ్గా మాట్లాడ కుండా తయారయింది. ఏవో పొడిముక్కలు తప్ప కూతురు ఈ మధ్య వివరంగా మాట్లా డటం లేదని యశస్వి గమనిస్తూనే వున్నా డు. లక్ష్య ఎవరితోనన్నా ప్రేమలో పడిందా అని అనుమానపడి కంటికి భూతద్దాలు అతి కించుకుని పరిశీలించాడు. కానీ అటువంటి దాఖలాలేమీ కనిపించలేదు. మరి కూతురు ఎందుకు ఇంట్రావర్ట్‌గా తయారవుతోందో యశస్వికి అర్థం కాలేదు. ఇంకా కొద్ది రోజు లు గమనించి ఒకసారి ఆమెతోనే విపులంగా మాట్లాడాలనుకున్నాడు. రోజు రోజుకీ తండ్రీ కూతుర్ల మధ్య దూరం పెరుగుతోంది. తండ్రి ఎదుటకి రావాలంటేనే అపరాధ భావనతో కుంచించుకు పోతోంది. ఎంతో అవసరమ యితే గానీ తండ్రితో మాట్లాడటం లేదు. ఇక లాభం లేదనుకొని ఒకనాడు వినిత పేరంటా నికి వెళ్ళాక కూతురు గదిలోకి వెళ్ళాడు. ఏదో పుస్తకం చదువుకుంటున్న లక్ష్య తండ్రిని చూసి నవ్వు పులుముకుంది. అది గమనిం చిన యశస్వికి మనస్సు చివుక్కుమంది.

"ఏమిటమ్మా ఏం చదువుతున్నావు?"

"హౌ టు విన్ ఫ్రెండ్స్"

"డేల్ కార్నెగీ రాసింది కదూ. చక్కని పుస్తకం. కానీ దాంట్లోని పద్ధతులు ఏమీ నువ్వు పాటిస్తున్నట్లు లేదే?"

"?"

"ఎవరు ఎదురుపడినా స్వచ్ఛంగా నవ్వ మని కార్నెగీ చెబుతాడు. నవ్వు పులుముకో వద్దంటాడు. మరి నువ్వు నీ తండ్రి దగ్గరే పేలవంగా నవ్వుతున్నావు. ఇంకా స్నేహితు లని ఏం ప్రభావితం చేస్తావమ్మా?"

"సారీ నాన్నగారు" అంది తలవంచుకొని

"సారీ కాదమ్మా నీ నుండి నాక్కావ ల్సింది. స్వచ్ఛమయిన నీ నవ్వు. ఏమయింది నీకు? ఆరోగ్యం బావుండటం లేదా?"

"బాగానే వుంది నాన్నగారూ"

"మరింకా ఏదన్నా సమస్యనా? నీలో నువ్వే గిరిగీసుకుని ఉంటున్నావెందుకు?"

"మీరుండగా నాకు సమస్యలు ఏముం టాయి నాన్నగారూ"



"ఎవరినయినా ప్రేమిస్తున్నావా. నాకు అలాంటివి అభ్యంతరం ఉండవని నీకు తెలుసు కదా"

"అలాంటిదేమీ లేదు"

కూతురు తలమీద చేయివేసి ఆప్యాయంగా దగ్గరకి తీసుకుంటూ "మరి ఇంకేమిటమ్మా నీ బాధ. పెళ్ళి త్వరగా కావాలనా?" అని అడిగాడు.

"ఛ.ఛ. అదేమీ కాదు"

"మరి ఇంకేమిటి తల్లీ నీ బాధ" కూతురి తల నిమురుతున్న అతడి స్వరంలో అనురాగం ధ్వనించింది.

నాన్నకాని నాన్న అనుకుంటున్న ఆయన అంత ప్రేమగా అడిగేసరికి కన్నీళ్ళు ఉబికి వచ్చాయి. కానీ ఎలాగో నిగ్రహించుకోగలిగింది. సమాధానం మాత్రం ఇవ్వలేకపోయింది.

సమాధానం రాకపోవడంతో కూతురు ముఖంవైపు చూసిన యశస్వికి కూతురు కన్నీళ్ళు బయటకి రావడానికి పడ్తున్న శ్రమ అర్థమయి ఆందోళనగా "చెప్పమ్మా" అని మార్దవంగా అడగడంతో లక్ష్య

కళ్లలోనుండి కన్నీళ్ళు వరదలా ప్రవహించాయి. వెక్కుతూ తన తలను తండ్రి భుజం మీద దాచుకుంది.

యశస్వికి ఏమీ అర్థం కాలేదు. కూతురు చుబుకం పట్టుకొని కాస్త పైకి లేపి అడిగాడు, "ఏమిటమ్మా నీవల్ల ఏమయినా పొరపాటు జరిగిందా లేక నీ పట్ల ఎవరయినా పొరపాటుగా ప్రవర్తించారా?"

"అలాంటిదేమీ లేదు నాన్నగారూ" అంది అలాగే బేలగా వెక్కి వెక్కి ఏడుస్తూ

"మరేమిటి చెప్పమ్మా"

వెక్కుతూ చెప్పలేనట్లు తల అడ్డంగా ఊపింది.

"చెప్పమ్మా" మరింత మార్దవంగా అడిగాడు.

తల అడ్డంగా ఊపుతూ "ఇప్పుడు చెప్ప లేను నాన్నగారూ. నాకిప్పుడు మీకు చెప్పేంత ధైర్యం లేదు" అంది.

కూతురు పరిస్థితి అర్థం చేసుకున్నాడు.

ఇంకా సమయం కావాలి.

"అలాగేనమ్మా. నీకు చెప్పాలనిపించిన ప్పుడే చెబుదువుగానీ. తొందరేంవుంది. విశ్రాంతి తీసుకో"

లక్ష్య తల ఊపింది. యశస్వి లేచి గదిలో నుండి బయటకు వెళ్ళబోతుండగా "నాన్నగారూ" అంది.

యశస్వి వెనక్కి తిరిగి ఏమిటన్నట్లుగా చూశాడు.

"మమ్మీ దగ్గర ఈ విషయమేమీ ప్రస్తా వించకండి"

ఎందుకు అని అడగబోయి మళ్ళీ వద్దను కొని "సరేనమ్మా" అని ఆ గది నుండి నిష్క్రమించాడు యశస్వి.

మంచం మీద కూలబడి ఆలోచించసా గింది లక్ష్య. నాన్నగారితో ఆ విషయం మాట్లాడే మంచి అవకాశాన్ని వదులుకు న్నానా? అనవసరంగా ఆ టాపిక్‌ని వాయిదా వేశానా? ఇంకా క్షోభ పడకుండా ఆ విషయాలేవో చెప్పి బరువు దించుకుంటే బావుండేదేమో. ఎందుకూ చెప్పడం. ప్రశాం తంగా సాగుతున్న జీవితాల్లో అనవసరంగా కలతలు మొదలవుతాయేమో. ఆ విషయం ప్రస్తావించకుండా వుండటమే మంచిదా? చెప్పి మనసులోని భారం దించుకుంటే మంచిదా? చెప్పాలనుకున్నా ఏమని చెప్పడం? మమ్మీ తప్పుచేసి నన్ను కన్నదని డాడీకి ఎలా చెప్పడం? ఓ డాడీ నువ్వు నా డాడీవి కాదని ఎలా చెప్పడం? ప్రశాంతంగా వుండాల్సిన ఈ వయసులో నాన్నగారి మన సులో అల్లకల్లోలాన్ని రేపుతానేమో? ఇలా ఆలోచిస్తూ అలసిసొలసిన మనసుతో అలాగే నిద్రలోకి జారుకుంది.

* * *

మదాలస మరుసటిరోజు వెళ్ళి బ్లడ్ రిపోర్ట్ తెచ్చుకొని చూసుకుంది. ఎబి. ఆమె కళ్ళు గిర్రున తిరిగాయి. అంటే అంటే అమ్మ నన్ను తప్పుచేసి కన్నదన్నమాట అని గ్రహింపులోకి వచ్చింది. కాసేపు మనసులో లబలబలాడింది. కానీ కొద్దిసేపట్లోనే ఈ విషయాన్ని ఎలా ఉపయోగించుకోవచ్చో అర్థమై ఆమె మనసు తేలిక పడింది. ఒక విధంగా ముఖ్యమైన విషయాల్లో అమ్మను బ్లాక్‌మెయిల్ చేయవచ్చుననుకుని హుషారుగా ఈల వేసింది. అసలు నాన్న ఎవరు. కనుక్కోవడం అంత ప్రాధాన్యమ యిన విషయంగా అనిపించలేదు ఆమెకి.

వెంటనే హుషారుగా సెల్‌ఫోన్‌లో రేవ న్‌కి కాల్ చేసి ఈ విషయం చెప్పింది. "హే. నా బ్లడ్‌గ్రూప్ కనుక్కున్నాను. ఏమిటో చెప్పుకో చూద్దాం."

"ఇంతకుముందే చెప్పా కదా. ఎబి అయి వుండాలి"

"నీవు గెస్ చేసింది నిజమే. నాది ఎబి నే"

"అయితే మీ అమ్మగారు...!?"

"అంతే అయ్యుండాలి!"

"పాపం. ఎప్పుడో చేసిన పొరపాటు ఎవ రికీ తెలవదనుకుందేమో గానీ మనకు తెలి సింది"

"మనకో మంచి ఆయుధం దొరికింది మా అమ్మమీద ప్రయోగించడానికి. మనకు అవ సరమయినప్పుడు బాగా పనికివస్తుంది"

"అంటే? మీ అమ్మనే బ్లాక్ మెయిల్ చేయదలుచుకున్నావా. ఎందుకు?"

"మొద్దూ. మన ప్రేమకి మా అమ్మ ఒప్పుకోదని తెలుసు కదా. ఎంత చెప్పినా ఒప్పుకోకపోతే ఈ విషయం బయటపెట్ట వచ్చు"

"భలే ఐడియా"

"మరేమనుకున్నావు నేనంటే"

"నీతో కష్టమే"

"చాల్లే పో"

"ఇంతకూ నా అసలు మామగారు ఎవ

## గ్రీన్ చాయ్‌తో జాలీజాలీగా

ఇవ్వాళ ప్రపంచంలో ఎక్కువమంది నీళ్ల తర్వాత 'టీ' తాగుతున్నారు. ప్రపంచ వ్యాప్తంగా సంవత్సరానికి 3 బిలియన్ కిలోల టీ వాడుతుంటే, ఒక్క మన దేశంలోనే 30% వాడకం ఉంది. బ్లాక్ టీ, గ్రీన్ టీ, ఉలాంగ్ టీ, లెమన్ టీ లాంటి రకాలెన్నున్నా టీ ఆకులు మాత్రం "కెమెల్లియా సైనెన్సిస్" అనే మొక్క నుండే వస్తాయి.

"గ్రీన్ టీ" సేవించడం వలన ఉల్లాసంతో పాటు ఆరోగ్యమూ చేకూరుతుందంటున్నారు. జపాన్, చైనా దేశాల్లో గ్రీన్ టీ ఆరోగ్యం కోసమే సేవిస్తారనే నమ్మకమూ ఉంది. రంగు, రుచి కల్గించే మూలకాలు టీ ఆకుల్లో నిల్వ ఉండేందుకు గ్రీన్ టీ తయారీలో టీ ఆకుల్ని ఆవిరి మీద ఉడికిస్తారు. లేదా వేయించుతారు. గ్రీన్ టీలో కాట్‌కిక్స్, పాలీఫినాల్స్ వంటివి నీటిలో తేలిగ్గా కరిగి త్వరగా గ్రహించబడతాయి. ఒక కప్పు గ్రీన్ టీ తాగిన గంటలో రక్తంలో యాంటీ ఆక్సిడెంట్ చర్య ప్రారంభమవుతుంది. శరీరంలో ఉత్పత్తి అయ్యే ఫ్రీ రాడికల్స్ వల్ల కలిగే 'లైఫ్ స్టైల్ వ్యాధులు' డయాబెటీస్, కాటరాక్ట్, అథిరోస్లేరోసిస్ వంటి రోగాల్ని ఈ యాంటీ ఆక్సిడెంట్ చర్య ద్వారా ఎదుర్కొనే శక్తి అధికమవుతుంది. గ్రీన్ టీలో ఉండే కెఫీన్ పదార్థం వలన నిద్రాభంగం కలగొచ్చు అందువలన నిద్రించడానికి మూడు గంటల ముందు గ్రీన్ టీ తాగాలి. ఇది గుండె జబ్బులు, అధిక బరువు, కంటి, చర్మ వ్యాధులేకాక దంతవ్యాధులు, కేన్సర్ వంటి వ్యాధుల నివారణకూ తోడ్పడుతుంది.




రంటావు? "

"ఎవరయితే మనకెందుకు. మనకది అంత అవసరమా? "

"మనకు చాలా అనవసరం. అందాల రాశివి నువ్వుండగా నాకు ఇంకా వేరే విషయాలెందుకు"

"ఈ శుభవార్త గురించి ఈ రోజు సెలబ్రేట్ చేసుకుందాం. నీ రూంకి వస్తున్నాను"

"నా దగ్గరికి వచ్చావని తెలిస్తే మీ అమ్మ అరవదా"

"ఏదీ ఈసారి అరవనీ చూస్తాను!"

రేవన్ గట్టిగా నవ్వి "రా. త్వరగా రా" అన్నాడు

"ఒక కండీషన్"

"ఏమిటో? "

"ఇవాళంతా నాదే రాజ్యం"

"అంటే"? అర్థం కాక అడిగాడు.

"అంటే మొద్దూ. ఇవాళంతా నాదే పైచేయి"

ఆమె మాటల్లోని అంతరార్థం రేవన్‌కి అర్థమై చిన్నగా నవ్వుకున్నాడు. అప్రయత్నంగా చిన్నగా ఈలవేశాడు.

"తప్పుతుందా తల్లీ. నన్ను ఎప్పుడు శాంతంగా వుండనిస్తావు కనుక. అయినా నీ గెలుపే నా గెలుపు కదా. నువ్వు గెలవని నా గెలుపు ఒక గెలుపా. అది నిజానికి ఓటమి" అతడూ అంతే నర్మగర్భంగా అన్నాడు.

"ఒకె"

"ఒ. కె" ఫోన్ పెట్టేశాడు.

II



అసెంబ్లీ ముందు జరుగుతున్న వరలక్ష్మి నిరసన ప్రదర్శనకి చాలా మంది పత్రికా విలేఖరులూ, టివి విలేకరులూ టివి కెమేరాలతో సహా విచ్చేశారు. మహిళా జాగృతి సంస్థ సభ్యులు వయ్యారాలు ఒలకబోసుకుంటూ టివి విలేఖరులను శ్రద్ధగా ఆహ్వానించారు. పలకరించారు. దారిన బోయే దానయ్యలు ఈ కెమేరాలను చూసి టివిలో పడే భాగ్యం కలుగుతుందేమోనని కెమేరాల చుట్టూ పోగయ్యారు. మహిళా మణులు పెద్దగా కనిపించకపోవడంతో నిరసన కొద్దిసేపు వాయిదా వేశారు. టివి విలేఖరులు మాటి మాటికీ టైం చూసుకుంటుండటంతో ఎక్కడ వాళ్ళు వెళ్ళిపోతారోనని హడవిడిగా వరలక్ష్మి నిరసన ప్రదర్శన మొదలుపెట్టింది.

"'ఎవరు' నవలను నిషేధించాలి" అని వరలక్ష్మి ఎత్తుకుంది.

"మహిళామణుల శీలాలను కించపరుస్తున్న 'ఎవరు' నవల డౌన్ డౌన్" అని ఉత్సాహంగా అరిచింది కనక మహాలక్ష్మి.

కొన్ని టివిలు ఆ నిరసన ప్రదర్శనను ప్రత్యక్ష ప్రసారం చేస్తున్నాయి కాబట్టి చుట్టూ పోగయినా దానయ్యలు అంతా "డౌన్, డౌన్" అని అరిచారు.

దాంతో ఉత్సాహం పుంజుకున్న వరలక్ష్మి "'ఎవరు' లాంటి పుస్తకాలు సమాజానికి పట్టిన చీడ పురుగులు" అని మొత్తుకుంది. చుట్టూ వున్న వాళ్ళలో చాలా మందికి ఎవరు అంటే ఏమిటో తెలీకపోయినా ఉత్సాహంగా నలుగురితో నారాయణా అన్నట్లుగా "చీడ పురుగులు" అని కోరస్ అందుకున్నారు. వరలక్ష్మికి ఇతర సంఘ సభ్యులకు సంతోషంగా వుంది. తమ ప్రదర్శన బాగా కవర్ అవుతున్నందులకు. ఉత్సాహంగా కంఠశోష వచ్చేట్లుగా అరుస్తూనే వున్నారు.

ఆఖరికి టివి కెమేరామెన్‌లు చెవులు మూసుకుంటుండటం చూసి ఎందుకయినా మంచిదని ఇక నిరసన చాలని ఆపుజేయించింది. 'హమ్మయ్య' అనుకొని విలేఖరులు అన్నీ సర్దుకొని వెళ్ళారు. సంఘ సభ్యులంతా తమ జాగృతి ఆఫీసుకి వెళ్ళి ప్రత్యక్ష ప్రసార రికార్డింగ్ చూడసాగారు.

"అబ్బా, వరలక్ష్మిగారూ మీ పట్టుచీర ఎంత బాగా వచ్చిందో టివిలో"అంది కనకం

"కనకం నీ ఒంటిపేట గొలుసు ఎంత చక్కగా మెరిసిపోతున్నది చూడు" వరలక్ష్మి అంది.

"అవునక్కా నీ గొలుసు బాగా వచ్చింది ఇందులో" అంది మరో సభ్యురాలు.

"జాహ్నవి నువ్వు కళ్ళద్దాలలో ఎంత చక్కగా అగుపిస్తున్నావు చూడూ" అన్నారొకరు.

"స్వరూపా, నీ గాజులు చూడు. అవి కనిపించడం కోసమే పిడికిలి బిగించి చేయి పైకెత్తి స్లోగన్లు ఇచ్చినట్టున్నావు. చక్కగా పడ్డాయి" అన్నారు మరొకరు. అలా అలా సంతోషకరమయిన సంభాషణ కొనసాగుతూనే వుంది చాలా సేపటివరకు.

దానయ్య ఇంటికీవెళ్ళి పెళ్ళాన్ని అడిగాడు "సెల్‌ఫోన్ చేసి చెప్పాను కదా. టివిలో నన్ను చూశావా? ఎలా పడ్డాను"?

"కనిపించావులే మహాగొప్ప. ఇంతకూ దేని గురించి ఆ నిరసన? నాకేమీ అర్థం కాలేదు మీ అందరి లొడలొడ తప్ప"

"ఏమో నాకేం తెలుసు. టివిలో పడొచ్చు కదా అనుకొని ఆ ఆడాళ్ళు ఏవో స్లోగన్లు ఇస్తుంటే నేనూ అరిచాను. టివిలో మంచిగా పడ్డాను కదా. మీ తమ్ముడికి కూడా ఫోన్ చేసి చెప్పాను. చూశాడా"?

"ఆ ఆ. చూశాడటలే కానీ, అన్నం తిందువు

రా" టివిలో పడ్డానన్న ఆనందంతో తృప్తిగా, సంతోషంగా భోంచేశాడు దానయ్య.

మరునాటి కల్లా దానయ్య టివిలో కనపడ్డ విషయం ఆ పేటలో అందరికీ తెలిసిపోయింది. ఆ పేటలో దానయ్య సెల్‌ఫోన్ కొన్నప్పుడు ఎంత సంచలనం సృష్టించాడో టివిలో కనపడి కూడా అంత సంచలనం సృష్టించాడు. ఆ పేటలో అందరూ అతడిని పొగడేసరికి దానయ్య ఛాతీ గర్వంగా విశాలమయింది. 'నేనంటే ఏమనుకుంటున్నావు' అన్నట్లుగా పెళ్ళాం వైపు ఓ చూపు చూశాడు.

'చాల్లే సంబడం' అన్నట్లుగా మూతి తిప్పిందామె మనసులో మొగుడి గొప్పదనానికి మురిసిపోతూ.

* * *

రాజేష్ కాలుని తన కాలు పెట్టి గీరింది హోయసల. ఏమిటన్నట్లుగా చూశాడు రాజేష్.

"ఎవరు' నవల చదివినట్లున్నావు కదా మహా ఆనందంగా. ఇక పరిశోధన మొదలెడతావా మన పిల్లల మీద? " అని అడిగింది సన్నగా నవ్వుతూ.

అవునన్నట్లుగా తలూపాడు. ఊహించని వేగంతో తల మీద పడింది మొట్టికాయ.

"అబ్బా ఏమిటిది" అన్నాడు తల నిమురుకుంటూ.

"లేకపోతే మరేంటి? " అంది చిరుకోపంతో

"అబ్బా, జోకుగా అన్నానులే"

"అంటే నా మీద ఎటువంటి అనుమానం లేదా నీకు? " ఆసక్తిగా అడిగింది.

"లేదు" అన్నాడు ప్లేట్‌లో నుండి ద్రాక్ష పండు తీసుకొని నోట్లో వేసుకుంటూ.

"ఎందుకు? " అంది మరింత ఆసక్తిగా తనూ ఓ పండు తీసుకుంటూ

"నీ మీది నమ్మకం" అన్నాడు గింజల్ని ఊస్తూ

"దాదాపుగా ఏ భర్త అయినా అలాంటి వెర్రి నమ్మకంతోనే వుంటాడు. అందులో విశేషం లేదు" అంది గింజల్ని కూడా నములుతూ పొట్టు అవతల పడేస్తూ.

"? "

"ఒకవేళ నేను తప్పుచేసి పిల్లల్ని కన్నానే అనుకో ఏం చేస్తావు? నన్ను వదిలేస్తావా? " అంది ద్రాక్ష తినడం ఆపి దగ్గరికి వచ్చి కళ్ళలోకి సూటిగా చూస్తూ. ఆమె జడ ముంగురులు అతడి తలను కొంతవరకు కప్పివేస్తున్నాయి.

"ఏమీ చేయను. మనం ఇప్పటిలాగే వుంటాము ఆనందంగా. అలాంటి విషయాల్ని నేను పెద్దగా పట్టించుకోను. నువ్వు నాతో ఇలాగే మంచిగా వున్నంత వరకు" అన్నాడు ఆమె లేడి కన్నులను ఆరాధనతో చూస్తూ.

"నచ్చావురా రాజా" అంటూ అతడి పెదవులను తన పెదవులతో కలిపింది.

అప్పుడు ఏం చేయడం భార్యకు ఇష్టమో తెలిసిన రాజేష్ తన నాలుకతో ఆమె నాలుకను పెనవేసి అధరమృతాన్ని గ్రోలాడు

కాసేపయిన తరువాత ఆ దీర్ఘ చుంబనాన్ని ఆపి తల వెనక్కి జరిపి అడిగింది "నీలో నాకు సెక్సీగా అనిపించేది ఏమిటో తెలుసా" అంది కళ్ళెగరెస్తూ

రాజేష్ కూడా కళ్ళెగరేశాడు ఏమిటన్నట్లుగా.

"నీ విశాల భావాలు. నా గురించి అంతా

**మనం ఇప్పటిలాగే ఉంటాము ఆనందంగా. అలాంటి విషయాల్ని నేను పెద్దగా పట్టించుకోను. నువ్వు నాతో ఇలాగే మంచిగా ఉన్నంత వరకు అన్నాడు ఆమె లేడి కన్నులను ఆరాధనతో చూస్తూ**

తెలిసే పెళ్ళి చేసుకున్నావు చూడూ. మగాడివంటే నువ్వు. నాలాంటి ఆడదాన్ని స్వీకరించే దమ్ము ఎంతమంది మొగవాళ్ళకి వుంటుంది

చెప్పు? " అంది ఒక ద్రాక్ష పండుని నోట్లోకి వేసుకుని. రాజేష్ పెదవులని మళ్ళీ అందుకొని ద్రాక్షరసాన్ని పంచుకుంది.

తృప్తిగా ఆ ద్రాక్ష రసాన్ని మింగేస్తూ "అది నా గొప్పతనం కాదు. నీదే. పెళ్ళికి ముందు జరిగిన దానిని పెళ్ళిచూపుల్లో అంత ధైర్యంగా ఎవరు చెప్పగలరు చెప్పు. నీ ధైర్యం, కపటం లేనితనం నాకు నచ్చాయి" అన్నాడు.

మరో పండు అందుకుంటూ "నీవు మంచాడివి కాబట్టి నా తప్పుల్ని క్షమించి నన్ను ఏక్సెప్ట్ చేశావు. అదే వేరొకరయితే నేను చెప్పిన విషయాలకి పారిపోయే వారు" అంది.

"నీ తప్పుల్ని క్షమించి పెళ్ళి చేసుకోలేదు నేను"

మళ్ళీ భర్త పెదవులని అందుకోబోయి తనే గుటక వేసి "మరి? " అంది కళ్ళు విశాలం చేసి.

"ఎందుకు క్షమించడం? నువ్వు తప్పు చేశావని నీలో అపరాధ భావన వుందా? "

ఒక నిముషం మౌనం వహించి "లేదు. సరదాగా ఎంజాయ్ చేశానప్పుడు"

"మరి నువ్వు తప్పు చేయనప్పుడు అదీ నాకు సంబంధం లేని నీ పెళ్ళికి ముందు విషయాలను నేను క్షమించడం ఏమిటి? "

"సరే మహాప్రభూ. నన్ను అర్థం చేసుకున్నారు. సంతోషం"

"అది నిన్ను ప్రత్యేకంగా అర్థం చేసుకోవడం అని నేను అనుకోను గానీ లోకం పోకడను అర్థం చేసుకోగలిగాను అనుకోవచ్చు" అని దిండు మీదికి విశ్రాంతిగా చేరగిలపడ్డాడు.

"అది ఎలాగో చెప్పండి మహారాజా" అతడి పక్కనే చేరుతూ ఆసక్తిగా అడిగింది.

రాజేష్ నవ్వుతూ "రెండు చేతులు కలిస్తే గానీ చప్పట్లు మోగవు కదా" చప్పట్లు అనే పదాన్ని వత్తి పలుకుతూ అన్నాడు.

"మీ మగవాళ్ళు తమ భార్యలు కన్యలుగానే రావాలనే భావ దారిద్ర్యం నుండి ఎప్పుడు బయటికి వస్తారో? " అంది అతని ముక్కు పిండుతూ.

"ఎప్పుడంటే మీ ఆడవాళ్ళు తమ భర్తలు తమతోనే సుఖించాలి అనే మొండితనం నుండి బయట పడ్డప్పుడు"



అన్నాడు వెక్కిరిస్తూ.

"అహ్హా. అయ్యగారికి ఏదో పురుగు తిరుగుతున్నట్లుంది. అలాంటి వెధవ ఆలోచనలు ఏం పెట్టుకోకుండా వాటిని కట్టిపెట్టు".

"నువ్వు ఇంకా ఎదగాలిరా" ఆమె జుత్తులో చేతులు పెట్టి ఆడుకుంటూ గోముగా అన్నాడు.

ఆమె చిరు కోపంతో చూసింది. "తమరు ఇక తగ్గాలిరా" అంది.

ఇంక మాటలు పొడిగిస్తే ఎక్కడికెక్కడికో వెళతాడని ఆమె చేతలలోకి దిగింది. హాయసుల దూకుడికి చేష్టలుడిగి మాటలు కరువై మౌనంగా, విశ్రాంతిగా ఆనందాన్ని ఆస్వాదించ సాగాడు. నిజమయిన విశ్రాంతి ఏ పనీ చేయకుండా బజ్జోవడంలోనే ఉంటుంది కదూ. అందులో చల్లటి శీతాకాలం, ఆదివారం, దుప్పటి ముసుగులో, వెచ్చటి సాంగత్యం...

## 12

పరమానంద స్వాములవారికి ఈ మధ్య ఆనందం తక్కువయింది. వరలక్ష్మి నిరసన ప్రదర్శనకి ప్రెస్‌లో, టీవీలో మంచి కవరేజి రావడం, తన పత్రికా ప్రకటనను ఎవరూ పెద్దగా పట్టించుకోక పోవడంతో ఏం చేయాలా అని గడ్డం నిమురుకుంటూ ఆలోచనల్లో పడ్డాడు. వరలక్ష్మి మీద ఆయనకు మండింది. ఎలా అయినా తనూ మళ్లీ వెలుగులోకి రావాలని నిర్ణయించుకున్నాడు. స్వామి వారికి అమోఘమయిన ఆలోచన తట్టింది. దీనిపై హోమం చేస్తే ఎలా ఉంటుందని. 'ఎవరు' నవల కలిగిస్తున్న దుష్ఫలితాల్ని అడ్డుకోవడం కోసం, ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం కోసం 'వికాస హోమం' చేయాలని అనుకున్నాడు. అల్వానందను, అమితానందను పిలిచి తన అమోఘమయిన ఆలోచనను వెల్లడించాడు.

అప్పుడే పీకలదాకా తిని ఉన్నారాయే భుక్తాయాసంతో అపసోపాలు పడుతూ చెప్పారు.

"నాయనలారా ఎవరు లాంటి నవలల ద్వారా సమాజంలో ధర్మం కలుషితమవుతున్నది.



దానిని తొలగించి వేసేందుకైె కనీసం మన మన్నా పూనుకోవాలి. అందుకే ఒక పది రోజుల తరువాత వికాస హోమం చేద్దాం. ఏమంటారు".

"గురూజీ. మీ ఆలోచన దివ్యంగా ఉంది" అన్నాడు అల్పానంద యథాప్రకారం సంతోషంగా

"స్వామీజీ అలాగే కానిద్దాం. లోకంలో ధర్మాన్ని మీరు తప్ప ఎవరు నిలగెట్టగలరు' ' అమితానంద అన్నాడు అల్పానంద చెప్పినదానికి తాళం వేస్తూ. అమితానంద ఆనందాలు అమితానందవి. హోమంతో లోక కళ్యాణం ఏమో గానీ తనకు కల్యాణ ఘడియలు వచ్చేలా ఓ చక్కని భక్తురాలన్నా హోమానికి విచ్చేయక పోతుందా అని దింపుడు కళ్లెం ఆశ అతగాడిది.

"దీని మీద ఓ పత్రికా ప్రకటన తయారు చేయండి నాయనలారా".

"స్వామీజీ, ఎప్పుడూ పత్రికా ప్రకటనలు ఇవ్వడమే కాకుండా ఈసారి విలేఖరుల సమావేశం ఏర్పాటు చేస్తే మీరు పూనుకున్న బృహత్తరమయిన కార్యక్రమం మరింత భక్త కోటికి అందుతుంది కదా" అన్నాడు అమితానంద.

మరి టివిలో కనపడి చాలా రోజులాయె. టివిలలో, పత్రికలలో తను పడి చాలా రోజులయిందని స్వామివారికి కూడా స్ఫురణకు వచ్చింది. ఆయాసంగా "అలాగే నాయనలారా. మీ కోరికను ఎందుకు కాదనాలి. అలాగే కానిద్దాం. అది ఎల్లుండి నిర్వహిద్దాం. అందుకు తగ్గ ఏర్పాట్లు చేయండి" అన్నాడు.

"అలాగే గురూజీ" అల్పానంద మహానందంగా బదులిచ్చాడు.

* * *

తన ప్రేమ వ్యవహారాన్ని తల్లితో చెప్పాలని నిర్ణయించుకుంది మదాలస. ఆ రోజు ఇంట్లో ఇద్దరే ఉన్నారు. అదే తగిన సందర్భమని అనుకుంది. "మమ్మీ నీకో విషయం చెప్పాలి" అంది పెరుగుచారు అన్నంలో కలుపుకుంటూ.

పప్పుచారుతో కలిపిన ముద్ద నోట్లో పెట్టుకోబోతున్నదల్లా ఆగి "ఏమిటి" ఏదో అనుమానపడుతూ తీవ్రంగా అంది వరలక్ష్మి. యుక్త వయసు వచ్చిన ఆడ పిల్లలు ఒక విషయం చెప్పాలి అన్నారంటే సందేహించాల్సిందే అని ఆవిడ గారి దృఢాభిప్రాయం.

అలా తల్లి గట్టిగా అడిగే సరికి కొద్దిగా సంకోచించింది. కానీ ఒక దీర్ఘ శ్వాస తీసి ధైర్యం తెచ్చుకుని "నేను ఒకరిని ప్రేమిస్తున్నాన"ని చెప్పింది.

తన కిష్టమయిన పప్పుచారు ముద్దను ప్లేట్‌లోనే వదిలేస్తూ "ఎవడు వాడు" అని తీవ్రంగా ప్రశ్నించింది వరలక్ష్మి.

"ఒక జర్నలిస్ట్".

"కులం? "

"మన కులం కాదు. అయినా తనకి కుల మతాల పట్టింపులు లేవు"

"తనకి లేక పోవచ్చు కానీ మనకున్నాయి కదా. కుదరదు. అయినా నిన్ను ఏ డాక్టర్‌కో, ఇంజినీర్‌కో ఇచ్చి పెళ్ళి చేస్తాను గానీ ప్రేమా లేదు దోమా లేదు. అది పక్కన పెట్టేసి శుబ్బరంగా చదువు మీద శ్రద్ధ పెట్టు".

"నా ప్రేమని అలా వదలి పెట్టడం కుదరదు గాక కుదరదు".

"ఇలాంటి పాడు వేషాలు మన ఇంటా వంటా లేవు. నోర్మూసుకుని ఈ వ్యవహారాన్ని ఇంతటితో చాలించు" అంది వరలక్ష్మి ప్లేట్ తీసి సింక్‌లో వేస్తూ.

"నిజంగానే? " అంది తన ప్లేట్ కూడా తీసి సింక్‌లో వేస్తూ మదాలస.

కూతురు మాటల్లోని వెటకారాన్ని గమనించి ఆశ్చర్యపోయి "నిజంగానా ఏమిటే. ఇటువంటి విషయాలు మన వంశంలో ఎప్పుడన్నా విన్నావా? " అని మంచి నీళ్ళు తాగింది.

"వినలేదనుకో" అంది ఫ్రిజ్‌లో నుండి నీళ్ళ బాటిల్ అందుకుంటూ.

"ఈ ప్రేమలతో మన వంశానికి మచ్చ తేకు. అందరూ ఏమనుకుంటారు. ఇక ఆ విషయాన్ని అంతటితో వదిలేయి".

"లేదు మమ్మీ. నేను వదిలేయ దలుచుకోలేదు. నా ప్రేమకి నువ్వు ఒప్పుకొని తీరాల్సిందే".

"కుదరదంటే కుదరదు" అంది వరలక్ష్మి గట్టిగా.

"ఎలా కుదరదో నేనూ చూస్తాను".

"అంటే ఏం చేస్తావేమిటి? "

"నిన్ను వప్పిస్తాను" అంది గట్టిగా

"నన్నెలా ఒప్పిస్తావు. ఒక వైపు నుండి నేను వద్దే వద్దని అంటుంటే. నీకేమయినా పిచ్చా"? కూతురు తీరుకు వరలక్ష్మి విస్తు పోతోంది.

"అవును పిచ్చే నీలాంటి అమ్మకు పుట్టితే పిచ్చి గాక మరేం వస్తుంది".

"ఏమిటే నువ్వేం వాగుతున్నావో అర్థమవుతోందా నీకు".

"నేను ఏం మాట్లాడుతున్నానో తెలిసే మాట్లాడుతున్నాను".

"మంచిది ఇక నోరు మూసుకొని నీ గదికి వెళ్ళు"

"నా విషయం తేల్చుకుని గానీ వెళ్ళను".

"చెప్పాను కదా. ఏం చేయాలో. ఇక వెళ్ళు నోర్మూసుకుని" గర్జించినట్లే అంది వరలక్ష్మి.

"ఊరికే అరవకు మమ్మీ. నీ అరుపులకు నేను భయపడతాననుకోకు. నేనింకా చిన్న పిల్లని కాను. అనవసరంగా ఆవేశపడకుండా నిదానంగా ఆలోచించు. ఒక మహిళా సంస్థకి అధ్యక్షురాలివయిన నువ్వు నీ కూతురు ప్రేమ పట్ల వ్యవహరించే తీరు ఇదే అనుకోకు".

తన ముందు ఇంతగా మాట్లాడే ధైర్యం కూతురికి ఎలా వచ్చిందో అర్థం కాలేదు. ప్రేమ మహాత్యమేమో అనుకుంది. "చూడమ్మా నేను చెప్పే విషయాలన్నీ అవతలి వారికి. మన ఇంట్లో వారికి కాదు"

## న్యాయం చేయవద్దా?




జస్టిస్ సర్ అబ్దుల్ రహీమ్‌కు నిక్కచ్చి మనిషని మొదట్లో మంచిపేరే ఉండేది. అందరూ మెచ్చుకుంటుంటే క్రమంగా గర్విష్టిగా మారాడు. పైగా ముక్కుమీదే కోపం.. చెప్పేది వినకుండా లాయర్లపై తాడెత్తున ఎగిరిపడేవాడు. అలాంటివాడి ముందు ఓరోజున ప్రకాశం కేసు వాదిస్తున్నారు. తన ఆర్గ్యుమెంట్ పూర్తికాకుండానే రహీమ్ 'ఆc ఏముందయ్యా ఇందులో.. ఇదీ ఓ కేసా? 'అంటూ అడ్డం తగిలాడు తన సహజధోరణిలో.

'అయ్యా.. ఈకేసు వాదిస్తానని నా క్లయింట్ వద్ద నేను కొంత డబ్బు తీసుకున్నాను. అతని తరపున మీ ఎదుట వాదనలు విన్పించాలని కేసంతా అధ్యయనం చేశాను. ఈ పరిస్థితిలో నా పూర్తివాదనను మీరు వినడానికి ఇష్టపడకపోతే నేనేం చేయాలి? అతని వద్ద తీసుకున్న డబ్బుకు ఎలా న్యాయం చేయాలి? మీరే చెప్పండి' అన్నారు ప్రకాశం వ్యంగ్యంగా.

అంతే. ప్రకాశం వాదన పూర్తయ్యేవరకూ రహీమ్ మళ్లీ మాట్లాడలేదు.

సాధ్యమయినంత శాంతంతో అంది.

"నువ్వు ఎలాంటి దానివో ఇదివరకే అర్థమయింది. ఇప్పుడు ఇంకా అర్థమవుతోంది".

"ఏమిటే నువ్వు మాట్లాడేది. ఏదో అతి తెలివిగా మాట్లాడుతున్నావు. చక్కగా మాట్లాడటం నేర్చుకో".

"చక్కని వాళ్లతో చక్కగానే మాట్లాడతాను. మరి నువ్వు అలాంటిదానివి కాదు కదా".

"అవునులే నీ ప్రేమను వద్దంటున్నాను కదా, వంకర దాన్ని కాక మరేమవుతాను".

"అందుకు కాదు నిన్ను అలా అనేది".

వరలక్ష్మిలో ఏదో అనుమానం లీలగా ప్రవేశించింది "మరి దేనికి" కనుబొమ్మలు ముడివేస్తూ అడిగింది

"నీకు చెప్పాల్సిన అవసరం నాకు లేదు.

"తిక్కతిక్కగా మాట్లాడకు. నీకు ఈ మధ్య వళ్ళు బలిసినట్లుంది. ఏమిటేమిటో మాట్లాడుతున్నావు"

"నేను ఏమిటేమిటో మాట్లాడటం లేదు. ఒకప్పుడు జరిగిన విషయాలే మాట్లాడుతున్నాను"

కూతురు అంత ధైర్యంగా మాట్లాడుతుండటం చూసి వరలక్ష్మిలో కంగారు మొదలయింది. "ఏమిటా విషయాలు. చెప్పు నాకు"

మదాలస మౌనం వహించింది

వరలక్ష్మి గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. ఒక్కుదుటున ముందుకువచ్చి కూతురు భుజాలు పట్టుకొని ఊపుతూ "ఏమిటి నువ్వనేది. చెప్పు చెప్పు" అని ఆవేశంగా, కోపం కలిగలిసిన స్వరంతో అంది.

మదాలస తల్లి చూపులని తప్పించుకొని దూరంగా చూడసాగింది.

ఇంకా విసురుగా భుజాలు ఊపుతూ "చెప్పు. నువ్వంటున్నదే మిటో చెప్పేదాకా వదలను. చెప్పు" అంది గట్టిగా అరుస్తూ

తల్లి ఊపులకి మదాలస జుత్తు చెదిరింది. నిదానంగా తల తిప్పి తల్లి కళ్ళలోకే సూటిగా చూస్తూ "మమ్మీ" అంది

వరలక్ష్మి కూతురు భుజాలు ఊపడం ఆపి ఏమిటన్నట్లుగా చూసింది

"నా తండ్రి ఎవరు? "



కష్టపడి 'స్వచ్ఛంద' చిరునామా తీసుకొని పరమపితను 'ఎవరు' నవల గురించి ఇంటర్వ్యూ చేశాడు రేవన్.

"ఎవరు నవల మీద మీకు అంత సదభిప్రాయం కలగడానికి కారణంమేంటి?

"ఒక్కదాని గురించే కాదు. ప్రతి ఒక్కదాని గురించి కూడా నేను ధనాత్మకంగానే ఆలోచిస్తాను. నేను అశావాదిని. ప్రతి దానిలో, ప్రతి వ్యక్తిలో మంచితనం వుంటుందని మనం అది తెలుసుకోవాలని అనుకుంటాను"

"మీకు 'ఎవరు' నవల చదవాలని ఎందుకు అనిపించింది? "

"పేపర్లల్లో టీవీలలో ఆ నవల గురించి బాగా వినపడుతుండటంతో ఆ నవలలో మంచి విషయాలు ఏమున్నాయా అనే ఆసక్తి కొద్దీ చదివాను"

"అది చదివిన తరువాత మీలో కలిగిన భావాలు ఎటువంటివి? "

"అందులో చాలా మంచి విషయాలు వున్నాయనిపించింది. అక్రమ సంతానం బయట పడవచ్చునన్న భయంతో అక్రమ సంబంధాలు తగ్గడానికి అవకాశం వుంది. ఇక మనస్తత్వాల సంగతికి వస్తే ఎవరి మనస్తత్వానికి తగ్గ జోడీని వారు చూసుకోవడానికి వీలవుతుంది. అది మంచిదే కదా"

"అలాగని అక్రమ సంబంధాలు తక్కువవుతాయని ఎందుకు అనుకుంటు

న్నారు? కన్డోమ్స్ వాడి పిల్లలు పుట్టకుండా చూసుకుంటారు కదా"

పరమపిత పెద్దగా భోళాగా నవ్వాడు "నేను అది కూడా ఆలోచించాను. మీరన్నది నిజమే రేవన్ గారూ. కనీసం అక్రమ సంతానాలయినా తగ్గుముఖం పడుతాయి కదా"

"మీరు చెప్పింది నిజం. అయితే అలా అనుకోవడంలో కూడా కొన్ని లోపాలు వున్నాయనేది మీకు తెలుసనుకుంటా"

"తెలుసు. ఇకపై ఎదుటి వారి బ్లడ్ గ్రూప్‌లు, భర్త బ్లడ్ గ్రూప్‌లు తెలుసుకొని జాగ్రత్త పడే అవకాశమూ ఉంది"

"మీకు సమర్థింపుగా వివిధ మతాల ప్రచారకులు, పెద్దలూ తమ అభిప్రాయాలు ప్రకటించారు కదా. వాటిపట్ల మీ ప్రతిస్పందన ఏమిటి"

"మంచి విషయమే కదా. వారికి నా కృతజ్ఞతలు"

"'ఎవరు' నవల మీద మా పత్రిక సర్వే చేసినప్పుడు ఏ విధంగానూ స్పష్టంగా తేలలేదు. ఎల్లుండి ఆ రిజల్ట్స్‌తో పాటే మీ ఇంటర్వ్యూ ప్రచురిస్తాము. మనస్తత్వాల విషయంలో యువత సమర్థింపు ఎక్కువగా వున్నప్పటికీ బ్లడ్ గ్రూప్స్ విషయంలో రచయిత అంతగా ప్రజలకి తేటతెల్లం జేయడం అవసరం లేదని ఎక్కువ మంది యువత అభిప్రాయపడుతున్నారు. చాలామంది పెద్దవారు మనస్తత్వాల విషయం అప్రధానమని భావిస్తూ బ్లడ్ గ్రూప్స్ గురించి మీలాగే సమర్థిస్తున్నారు"

"కనీసం సగం శాతం మంది ప్రజలు ఏదో రకంగా నవలను సమర్థిస్తున్నపుడు దానిని నిషేధించమని అడగడంలో అర్థం లేదనుకుంటాను. నవల నిషేధం గురించి సర్వేలో అడిగారా"

"అడిగాం. దాదాపుగా ఒకింట మూడువంతుల మంది నిషేధించాలని, మరో మూడోవంతు నిషేధించవద్దనీ, మరో మూడోవంతు మంది చెప్పలేమని చెప్పారు"

అలాంటప్పుడు కనీసం ప్రజాభిప్రాయాన్ని గౌరవించి అయినా నిషేధం కోసం పట్టుబట్టడం సబబు అనిపించుకోదు కదా"

పరమపిత దగ్గర సెలవు తీసుకొని ఇతర మేధావులను, మత పెద్దలను, రచయితలను, ప్రఖ్యాత వ్యక్తులను, రాజకీయ నాయకులను ఇంటర్వ్యూ చేశాడు. అందరూ వివిధ రకాల అభిప్రాయాలు వ్యక్త పరిచారు. కొందరు ఆ నవలని వెంటనే నిషేధించమనగా మరి కొందరు ఆ నవలను అంతగా పట్టించుకోనవసరం లేనేలేదన్నారు. చాలా మంది రచయితలు, మేధావులు మాత్రం నవలలను నిషేధించి సృజనాత్మకతకి అడ్డుపడకూడదని అలాంటి రచనలు వస్తూండాలని సమర్థించారు

14



వెచ్చని సూర్యకిరణాలు మీద పడుతుండగా శీతాకాలపు చలిలో వరండాలో కూర్చొని కాఫీ తాగుతూ దినపత్రికను చదువుతున్నాడు రాజేష్. ఆదివారం కావడంతో పిల్లలు ఇంకా నిద్రలేవలేదు.

తీరిగ్గా పేపర్ చదువుతున్న భర్తను వెనక నుంచి వచ్చి కౌగిలించుకొని ముద్దుపెట్టి ముక్కుపైన ముక్కుపెట్టి అతడి శ్వాసను ఆఘ్రాణించింది కాసేపు. అలా చేయడం భార్యకి ఇష్టం కాబట్టి ఆ కాసేపు మెదలకుండా అలాగే ఉన్నాడు. ఆ పని కానిచ్చి "పేపర్ చదివినంత వరకు చాలు గానీ మహాశయా, నాకో చిన్న అనుమానం తీర్చండి" అంది భర్త కళ్ళలోకే చూస్తూ.

యథాప్రకారం భార్యకళ్ళలోకి ఆరాధనగా



చూస్తూ "ఏమిటో అది" అన్నాడు. చూపు మరల్చకుండా.

"మన ఇద్దరు పిల్లలే కాకుండా తమరి పిల్లలు ఇంకా ఉన్నారా అని డౌట్. పెళ్ళికి ముందు ఎన్నో వేషాలు వెలగబెట్టారు కదా"

"ఏమో. వుండొచ్చు వుండక పోవచ్చు ఒకసారి మాత్రం ఒక అమ్మాయి గర్భం దాల్చానని చెప్పింది. నాకు అనుమానం వచ్చి ఆరాతీస్తే అది అబద్ధమని నా దగ్గర డబ్బులు గుంజడం కోసమని తేలింది".

హొయసల భర్త ఒడిలో కూర్చుంటూ అడిగింది "అది కాకుండా ఇంకా వేరే ఏమయినా, ఎక్కడన్నా అనుమానం వచ్చిందా మీకు తండ్రి అయినట్లు".

ఆమె కళ్ళలోకి తొంగి చూస్తూ "ఎందుకో ఆ వివరాలన్నీ ఇప్పుడు" అన్నాడు

భర్త చూపులను పట్టించుకోకుండా "జస్ట్ సరదాకి. మీకే గనుక ఇతర సంతానం వుంటే ఎలా వుంటారో తెలుసుకుందామని" అంటూ అతడి మెడ చుట్టూ చేతులు వేసింది గోముగా.

వివాహానికి ముందే తప్పొప్పులన్నిటినీ మనసు విప్పి చెప్పుకుని ఒకరినొకరు పరిపూర్ణంగా అర్థం చేసుకున్నారు గనుక, ఒకరి ఊహకు, ఆలోచనకు, భావనకు అనుగుణంగా మసలుకుంటారు గనుక వారిద్దరూ భార్యాభర్తల కంటే మిన్నగా మంచి స్నేహితుల్లా ఉంటారు.

"నాకు అంతగా అన్నీగుర్తుకులేవు గానీ ఒక విషయం మాత్రం కొద్దిగా గుర్తుకు వస్తోంది. మా వీధిలో వుండే పరిమళ మాత్రం సంతానం లేక నానుండి సంతానం కావాలనేది. కొన్నిసార్లు మేము కలుసుకున్న తరువాత భర్తకు ట్రాన్స్ఫర్ అయి వేరే ఊరికి వెళ్లారు. ఆమె మళ్ళీ కనపడలేదు. ఆమెకు నావల్ల ఎవరయినా పుట్టారో పుట్ట లేదో తెలవదు"

"మనకు ఇద్దరూ అబ్బాయిలే వున్నారు కాబట్టి నాకు ఇక పిల్లలు పుట్టే అవకాశం లేదు కాబట్టి పరిమళకు పాప పుట్టి వుంటే బాగుణ్ణు'
'

"ఏం చేసుకుంటావు. తెచ్చి పెంచుకుంటావా?" జోక్‌గా అని ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

హొయసల భర్తని వారించలేదు. తను ప్రస్తావించిన విషయానికి అప్పటికి అక్కడితో ఫుల్‌స్టాప్ పెట్టింది.

* * *

'కుముదినీదేవి అభిమాన సంఘం' పేరిట వీరభద్రం ఓ పది హేను మంది చిన్నాచితకా వాళ్ళను వెంటేసుకుని వచ్చి కుముదినీదే విని కలిశాడు.

**వివాహానికి ముందే తప్పొప్పులన్నిటినీ మనసు విప్పి చెప్పుకుని ఒకరినొకరు పరిపూర్ణంగా అర్థం చేసుకున్నారు గనుక వాళ్లు ఒకరి ఊహకు, ఆలోచనకు, భావనకు అనుగుణంగా మసలుకుంటారు.**

"అమ్మగారూ! మీ అభిమానులమయిన మేము మీ పేరిట అభిమాన సంఘం నెలకొలుపుకున్నాము"

తన పేరు మీద ఒక అభిమాన సంఘం మొదలవడం కుముదినీ దేవికి సంతోషాన్ని, గర్వాన్ని కలిగించింది. భర్త ఎప్పుడన్నా బాల్చీ తన్నేస్తే ఎన్నడన్నా ముఖ్యమంత్రి పీఠాన్ని తను అధిరోహించవలసిందే కదా అనేది ఆమె ఆలోచన. అటువంటి పరిస్థితే గనుక వస్తే ఇటువంటి అభిమాన సంఘాలు బలం ఇస్తాయి. ఇన్నాళ్ళ నుంచి అభిమాన సంఘాల మీద దృష్టి పెట్టనందుకు కాస్త చింతించి ఇకనైనా వాటిని బాగా ప్రోత్సహించాలని అనుకున్నది. చిరునవ్వుతో "సంతోషం. నా మీద కురిపిస్తున్న మీ అభిమానానికి కృతజ్ఞతలు" ముకుళిత హస్తాలతో అంది.

"అమ్మగారూ. మీ పేరిట రక్తదాన శిబిరం నిర్వహించాలనుకుంటున్నాము. దానికి వచ్చి ముందుగా మీరే రక్తం ఇవ్వాలి"

కుముదిని సంశయంలో పడింది. 'ఎవరు' నవల విడుదల అయిన దగ్గరి నుంచి తన బ్లడ్ గ్రూప్ ఎవరికీ తెలవకుండా రహస్యంగా కాపాడుతోంది. ఇలా రక్తం ఇవ్వడం వల్ల ఎవరికయినా రక్తం గ్రూప్ తెలిసే అవకాశం వుంటుందేమో అని సందేహించింది. ముఖ్యంగా భర్తకు తెలిస్తే ప్రమాదం.

"నేను ఈ మధ్య బిజీగా వుంటున్నాను. మరోసారి చూద్దాం"

"అమ్మమ్మా. మీరు రాకుండా ఆ కార్యక్రమం మేం మొదలే పెట్టం. మీరు ఎలాగన్నా తప్పకుండా రావాలి. మీ మంచితనం, గొప్పదనం ఇంకా అందరికీ తెలవాలి. ప్రెస్ కవరేజ్ బాగా ఏర్పాటు చేస్తున్నాం."

ప్రెస్ అనగానే ఆమెకూ ప్రెస్ చాపల్యం పుట్టింది. ముఖ్యమంత్రి భార్యగా కొద్ది కవరేజి లభిస్తున్నా, అది ఏ మాత్రమూ సంతృప్తి కలిగించడం లేదు. భర్త కూడా దేశంలో లేడు. తన బ్లడ్ గ్రూప్ గురించి అభిమాన సంఘం వాళ్ళు ఎందుకు పట్టించుకుంటారులే అనుకొని "అలాగే. తప్పకుండా. ఎలాగన్నా వీలు కల్పించుకొని వస్తాను. ప్రెస్ కవరేజి మాత్రం ముఖ్యం. బాగా వచ్చేట్లుగా చూడండి. ఈ కార్యక్రమం ఎప్పుడు, ఎక్కడ? "

"తప్పకుండా అమ్మగారూ" అని వీరభద్రం స్థలం, తేదీ వివరాలు చెప్పాడు.

**ముఖ్యమంత్రి భార్యగా కొద్ది కవరేజి లభిస్తున్నా, అది ఏ మాత్రమూ సంతృప్తి కలిగించడం లేదు. భర్త కూడా దేశంలో లేడు. తన బ్లడ్ గ్రూప్ గురించి అభిమాన సంఘం వాళ్ళు ఎందుకు పట్టించుకుంటారులే అనుకుంది**

* * *

పరమానందస్వామి హోమం ప్రకటనకు భక్తుల నుండి మంచి ప్రతిస్పందనే వచ్చింది. స్వామివారి సదాశయాన్ని వేనోళ్ళ భక్తులందరూ పొగిడారు. చాలామంది భక్తులు, నాయకులు, ఇతరులు హోమానికి వస్తున్నామంటూ సమాచారం పంపారు. ఈ హోమం గురించి పత్రికలలో కూడా మంచి కవరేజి వచ్చింది. అమితానంద ఒకసారి ప్రత్యేకంగా అన్ని టీవీల వారిని పిలిపించి హోమానికి



హిమాలయ పర్వతశ్రేణుల్లో కనువిందు చేసే రాజసౌధమిది. దలైలామాల అధికార నివాసం పొటాలా పేలస్‌గా జగద్విఖ్యాతం. 1645లో అప్పటి టిబెట్ పాలకుడు ఐదో దలైలామా దీని నిర్మాణానికి నడుం బిగించాడు. 1682లో ఆయన చనిపోయే నాటికి దీని నిర్మాణం ఇంకా పూర్తి కాలేదు. 1694లో ఇది పూర్తయ్యే వరకు ఆయన మరణాన్ని రహస్యంగానే ఉంచారు.



ప్రస్తుత దలైలామా మన దేశంలో ప్రవాసానికి వచ్చే వరకు ఇది టిబెట్ ప్రభుత్వ పీఠంగా కొనసాగింది. ఈ రాజసౌధంలో 13 అంతస్తులున్నాయి. వెయ్యి గదులు, పదివేల మందిరాలు, దాదాపు ఇరవై వేలకు పైగా విగ్రహాలు ఉన్నాయి. బౌద్ధ సన్యాసులకు శిక్షణ ఇచ్చే విద్యాలయం కూడా ఉంది. ప్రస్తుతం ఒక మ్యూజియంగా పరిగణిస్తూ దీన్ని పరిరక్షిస్తున్నారు.



గాను పెద్ద ఎత్తున జరుగుతున్న సన్నాహా లను చూపించాడు. పరమానందస్వామితో ప్రత్యేకమయిన ఇంటర్వ్యూ కూడా వచ్చేలా చూసుకున్నాడు. ఇంటర్వ్యూ సమయంలో స్వామి వారికి అల్పానంద, అమితానంద చెరో పక్కన నిలబడ్డారు. ఈ హడావిడి చూసి ప్రజలలో 'ఎవరు' నవల అంటే ఇంత వ్యతి రేకత వుందా అని లోకులు ముక్కుల మీద వేలేసుకున్నారు.

ఈ హోమం పట్ల ప్రజల్లో వున్న ఆసక్తిని గమనించి జరుగుతున్న సన్నాహాలను ఏ రోజుకారోజు పత్రికలు బాక్స్ కట్టి ప్రచురిం చగా, టివిలలో ప్రత్యేకంగా పది, పదిహేను నిమిషాల సేపు ఆ వివరాలు చూపించబడు తున్నాయి. ఈ హడావిడి అంతా గమనించి సమాచార శాఖమంత్రి రాజరత్నానికి తను ఆ హోమానికి వెళ్ళకపోతే బావుండదేమో

**ఏదో**
**ఒక పనికి మాలిన నవల**
**చదివి మిడిమిడి జ్ఞానం తెచ్చుకున్న**
**నీలాంటి వారికి అర్థం కాదులే.**
**మరోసారి విపులంగా చదువు ఆ నవలను.**
**అప్పుడన్నా నీకు అసలు సంగతి**
**అర్థమవుతుందేమో**

అన్న ఆలోచన కలిగి తనూ ఆ హోమానికి వెళుతున్నట్లు ఒక విలేఖరుల సమావేశంలో సెలవిచ్చారు. దానితో అధికార పార్టీ 'ఎవరు' నవలకి వ్యతిరేకంగా వుందా అని పత్రికల్లో విశ్లేషణాత్మక వ్యాసాలు, చర్చలూ వచ్చాయి. అది గమనించి పార్టీ ఆ నవలకి వ్యతిరేకం కాదని అలా అని అనుకూలమూ కాదని మంత్రి రాజరత్నం గారు వెలిబుచ్చిన అభిప్రాయాలు వారి వ్యక్తిగతమని పార్టీ రాష్ట్ర అధ్యక్షులవారు ప్రకటించారు.

* * *

కూతురు అడిగిన ప్రశ్నకు వరలక్ష్మి నిశ్చే ష్టురాలయి ఆసరాగా గోడను పట్టుకుంది. ముఖం వెలవెలబోతుండగా "ఏం మాట్లాడు తున్నావు నువ్వు? అదేం ప్రశ్న" అనడి గింది.

"నాకు తెలుసు మమ్మీ, ఈ నాన్న నా నాన్న కాదని"

"అలా ఎందుకనుకుంటున్నావు? " ఆందోళ నగా అడిగింది.

"బ్లడ్ గ్రూప్స్"

వరలక్ష్మి ముఖంలో కత్తివాటుకి నెత్తురు చుక్కలేకుండా అయింది. మనసులోనే ఎవరు రచయిత సత్యశ్రీని శాపనార్థాలు పెట్టనారం భించింది. కళ్ళలో కన్నీళ్ళు ఉబికాయి.

"నీది ఓ, నాన్నది ఏ అయితే నాకు ఏబి ఎలా వస్తుంది? " మదాలస తాపీగా అంది

"ఈ నాన్నే నీ నాన్న" గట్టిగా అరిచింది వరలక్ష్మి.

ఇంత స్పష్టంగా బ్లడ్ గ్రూప్స్ గురించి చెప్పినా తల్లి అలా మాట్లాడుతుండే సరికి ఆశ్చర్యపోయింది మదాలస.

"మమ్మీ! నేను చెప్పింది అర్థం చేసుకొనే మాట్లాడుతున్నావా? మొండిగా మాట్లాడితే వినడానికి ఇక్కడ ఎవరూ చిన్నపిల్లలు లేరు"

"ఆహా. అంతా అర్థమయ్యే మాట్లాడుతు న్నాను. ఇప్పటికీ కూడా అంటున్నాను. ఈ నాన్నే మీ నాన్న అందులో కొంచెం కూడా సందేహపడాల్సిన అవసరం లేదు"

మదాలస మళ్ళీ ఆశ్చర్యపోయి తగ్గి మెల్లగా అంది "అలాంటప్పుడు నాకు ఏబి ఎలా వస్తుంది?

వరలక్ష్మి తాపీగా "వస్తుంది. ఏదో ఒక పనికి మాలిన నవల చదివి మిడిమిడి జ్ఞానం తెచ్చుకున్న నీలాంటి వారికి అర్థం కాదులే. మరోసారి విపులంగా చదువు ఆ నవలను. అప్పుడన్నా నీకు అసలు సంగతి అర్థమవు తుందేమో" అంది.

ఆందోళన పడడం ఇప్పుడు మదాలస వంతయింది "మమ్మీ వివరంగా అర్థమయేట్లు చెప్పు. నాకంతా కన్ఫ్యూజింగ్‌గా వుంది.

"వుండనీ. తొందరేం వుంది విషయాలు తేల్చుకోవడానికి. అసలు ఓ వాళ్ళకి ఏబి వాళ్ళు పుడతారా ఎక్కడయినా. అది తెలుసుకో ముందు" అని చెప్పి విసవిసా నడిచి బెడ్రూంలోకి వెళ్ళి తలుపు గడియ పెట్టుకొని రోదించసాగింది.

15



ఆకాశంలో మబ్బులు లేవు. వెన్నెల ప్రకాశవంతంగా పరచుకుంది. నక్షత్రాలు మిల మిలా మెరుస్తున్నాయి. వెన్నెల అందాన్ని ఆస్వాదిస్తూ చలివేయకుండా షాల్ కప్పుకొని విశ్రాంతిగా వాలు కుర్చీలో కూర్చున్నాడు రాజేష్. పక్కనున్న మల్లెపొద నుండి వస్తున్న సువాసనలు మత్తెక్కిస్తున్నాయి. పిల్లల్ని పడుకోబెట్టి వచ్చి భర్త పక్కగా కూర్చుంది హాయసల.

"ఏమండీ"!

"ఊ" అన్నాడు మత్తుగా.

"నాకు పరిమళను చూడాలని వుంది"

దిగ్గున కళ్ళు తెరచి చూసి "అదేం కోరిక" అన్నాడు.

"ఒకవేళ మీకు ముఖ్యంగా ఎవరయినా పాప పుడితే చూడాలని వుంది. అందుకని"

"చూసి ఏం చేస్తావు? "

"ఏమో. నాకు ఇప్పుడేమీ తెలవదు. ముందు చూద్దాము. మీరు చెప్పినదాన్ని బట్టి చూస్తే పరిమళ మంచిదిలాగే అనిపిస్తోంది. ఒకసారి కలిసి వద్దాం. తప్పేం వుంది"

"పరిమళను చూస్తే" అని అర్థోక్తిగా అగిపోయాడు.

అతడి భావాల్ని గ్రహించిన హాయసల "మహాశయా. పరిమళను చూసేది నేను. మీరు కాదు" అంది

"అదేంటి. అదెలా? "

"అది అంతే. అదంతే. హమ్మా. అదేం కుదర్దు. పరిమళ ఎక్కడ వుంటుందో, ఎలా వుంటుందో నాకు చెప్పండి చాలు"

"ప్లీజ్"

"ముందు నన్ను చూసి రానీండి. ఆ తర్వాత మీరు నాకు చేసే ప్రామిస్‌ని బట్టి తర్వాతి విషయం ఆలోచిస్తాను"

"ప్రామిస్. నా ప్రామిస్ మీద నమ్మకం వుందా"

"వుంది. వాళ్ళాయన పేరు ఏమిటి? ఏం చేస్తుంటాడు"

"సుందరం. గవర్నమెంట్ టీచర్"

"ఇంటిపేరు ఏమయినా గుర్తుందా? "

"మామూలుగా నాకు గుర్తుండదు గానీ వాళ్ల ఇంటిపేరు చాల విచిత్రంగా ఉంటుంది. అందుకే గుర్తుంది అది పెంట"

"పెంట? " నవ్వుతూ అడిగింది.

"అవును. ప్రస్తుతం ఎక్కడ జాబ్ చేస్తున్నాడో తెలీదు. మరి నువ్వెలా తెలుసుకుంటావు? "

"ఇంటర్ నెట్లో"

"అవును కదూ. మరిచే పోయాను"

సెల్‌ఫోన్‌లో ఎపిటీచర్స్.గవ్ సైట్‌కి వెళ్ళి ఆ పేరుతో వెతికింది.

రిజల్ట్స్ జీరో. "లేదు. ఏమయ్యాడంటావు? "

"సుందరం పూర్తిపేరు కాకపోవచ్చు ఒక్క ఇంటిపేరుతో వెతికి చూడు"

రెండు రిజల్ట్స్ వచ్చాయి. ఒకరు పెంట వరప్రసాద్. రెండవది పెంట... పరిమళ!"

"అదేంటి. ఆమె పేరు వుందేమిటి? సుందరం పేరు లేకుండా...?

"ఏ కారణం వల్లనన్నా సుందరం పోతే పరిమళకు ఇచ్చారేమో జాబ్"

"అదే అయ్యుంటుంది. అయ్యో. పరిమళ ఒంటరి జీవితం గడుపుతోందేమో"

"అంత జాలి అక్కరలేదు" అంది చిరుకోపంతో చూస్తూ

"అబ్బా నేను మామూలుగానే అన్నాను లెద్దూ"

"తెలుసు. ఆమె రామన్నపేటలో జాబ్ చేస్తోంది. నంబర్ త్రీ స్కూల్"

"ఎప్పుడు వెళ్ళి కలుద్దాం"

"కలుద్దాం కాదు. నేనే వెళ్ళి కలిసొస్తా"

"ప్లీజ్"

"సరే. ఎల్లుండి వెళదాము. మీకే గనుక కూతురు వుండి వుంటే ఎంత వయస్సు వుంటుందంటారు? "

"పన్నెండు, పదమూడు వుండవచ్చు"

"ముందు ముందు మీరే తండ్రి అని తెలిసి మనతో వచ్చేస్తానంటే? "

"ఏం చేద్దాం. నీ ఇష్టం. చెప్పు"

"అమ్మాయే అయితే నాకు అభ్యంతరం వుండదు. అబ్బాయి అయితే నాకంత ఇష్టం వుండదు. మనకు ఆల్రెడీ ఇద్దరున్నారు కదా"

రాజేంద్ర ఆలోచిస్తూపోయాడు. 'పన్నేండేళ్ళ తరువాత పరిమళను మళ్ళీ చూడబోవడం కన్నా తనకు మరో కూతురో కొడుకో వుండవచ్చునన్న ఆలోచన పులకింపజేస్తోంది. కొడుకయినా కూతురయినా ఎలా వుంటారు. ఏం మాట్లాడుతారు? ఇన్ని సంవత్సరాలుగా పట్టించుకోని నేను ఇప్పుడు హఠాత్తుగా ఊడి పడి నేనే నీ నాన్నని అంటే ఆమోదిస్తారా? '

* * *

'ఈతరం' దినపత్రికలో ఒక పేజ్ అంతా 'ఎవరు' నవల మీద రేవన్ సేకరించిన విషయాలకే కేటాయించి ప్రచురించారు. వివిధ రంగాలలో నిష్ణాతులయిన వారి అభిప్రాయాల సమాచారం అవడంతో, సర్వే ఫలితాలు అవడంతో పాఠకులు బాగా ఆసక్తి కనపరిచారు. దాంతో ఆ నవల ఇంకా పాపులర్ అయి అమ్మకాలు బాగా పెరిగాయి. నచ్చినా నచ్చకపోయినా ప్రతివారి ఇంట్లో ఆ నవల కాపీ ఒకటి వుండటం, బ్లడ్ గ్రూప్స్ గురించి చర్చించుకోవడం, మనస్తత్వాలు గెస్ చేసుకొని విశ్లేషించుకోవడం సర్వసాధారణమైపోయింది. దానితో కొన్ని కాపురాలు తేలిపోయాయి, మరి కొన్ని కాపురాలలో మనస్పర్థలు తీవ్రమయ్యాయి. మరి కొంత మంది 'ఎవరు' నవల గురించి పట్టించుకోకపోవడం కూడా స్టయిల్‌గా భావించసాగారు. ఏ మూలో అనుమానాలు వున్నాత మది విశ్వసనీయమయిన సంసారమని బ్లడ్‌గ్రూప్స్ గురించి పట్టించుకోమని పటాటోపం ప్రదర్శిస్తూ ఆ నవల గురించి బాగా పట్టించుకుంటున్న వారిని హేళనగా చూడటం జరుగుతోంది.

చెదురు మదురుగా అక్కడక్కడ తాము అక్రమ సంతానం అని తెలిసి తల్లుల పట్ల దురుసుగా ప్రవర్తించడం, అసలు తండ్రి వివరాలు చెప్పమని ఇబ్బంది పెట్టడం, అసలు తండ్రిని వెతికి ఎదుటపడి నిశ్చేష్టులను చేయడం జరుగుతున్నట్లుగా వార్తలు వినపడుతున్నాయి. పత్రికలలో ఆ వార్తలు కనపడుతున్నాయి. ఆ విధంగా తెలుగు సమాజానికి 'ఎవరు' నవల మింగలేని, కక్కలేని విషయంగా తయారవడం 'పిల్' రాజుకి ఆనందాన్ని తెప్పించింది. తన పేరు అందరికీ ఇంకా బాగా తెలవడం కోసమని ఈ నవల మీద ఒక పిల్ వేయాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

పిల్ రాజు ఆంధ్రప్రదేశ్‌లో కొంచెం ప్రసిద్ధుడే. ప్రతి అడ్డమయిన దానికి ప్రజాప్రయోజన వాజ్యం వేస్తుండటంతో పిల్ రాజుగా ప్రసిద్ధిలోకి వచ్చాడు. కొన్ని సార్లు హైకోర్ట్ న్యాయమూర్తులు 'ఇతగాడికి ఇది తప్ప వేరే పనేమీ లేదా' అని ప్రశ్నిస్తే అతని తరపు లాయర్లు సరయిన సమాధానం చెప్పడానికి నానా అవస్థపడ్డారు. అతగాడు వేసే పిల్స్ దాదాపుగా ప్రజలకి సంబంధించినవే కావడంతో న్యాయమూర్తులు కూడా మింగలేక, కక్కలేక అతని బాధని భరిస్తూ

# చతుర భాషితాలు

మానవతా విలువలతో
కూడిన లక్ష్యాన్ని
ప్రపంచం ప్రశంసిస్తుంది

- చైనా సామెత

అసంపూర్ణ ఆధారాల నుంచి
సంపూర్ణ నిర్ణయాలు
గాలించే కళే జీవితం

- శామ్యూల్ బట్లర్

అనుభూతుల్లో యవ్వనం,
ఆలోచనల్లో పరిపక్వత
మనిషిని పరిపూర్ణుణ్ణి
చేస్తాయి

- జాబర్ట్

తాము గొప్పవారమని
భావించేవారే ప్రపంచంలో
సగం హానికి కారకులు

- ఇలియట్

మన జీవితాల్ని ప్రకాశవంతం
చేసుకోవచ్చని మహాత్ముల
జీవితాలు గుర్తు చేస్తాయి

- లాంగ్ ఫెలో

గొప్ప సత్యానికి విరుద్ధమైనది కూడ
సత్యమే అవుతుంది

- థామస్‌మాన్

వయసు ప్రేమ
వంటిది. వద్దన్నా
బయట పడుతుంది

- డెక్కర్

చిన్న విషయాన్ని కూడ
గొప్పగా చేస్తే జీవితం
ఆనందమయం అవుతుంది

- యుగెనియా ప్రైస్

ప్రశ్నించడం ఆపేయడం
అంటే మూర్ఖుని ముద్ర
దాల్చడమే

- స్టీన్‌మెట్జ్

మన మనుగడకు కారణమైన
దాని గురించి చెడు
పలకరాదు

- చాణుక్యుడు

సత్యం బూట్లలో పాదాలు
పెడుతుండగానే అబద్ధ
మనేది సగం ప్రపంచాన్ని
చుట్టివస్తుంది.

- మార్క్‌ట్వైన్

వస్తున్నారు. రాజకీయ నాయకులు అప్పుడప్పుడూ తమ తమ ప్రయోజనాల కోసం ఇతనికి డబ్బులిచ్చి 'పిల్స్' వేయిస్తుం టారాని అనుకుంటూ వుంటారు.

ప్రజలలో అశాంతినీ, అలజడినీ, మనస్పర్థ లను రేపుతున్న ఈ నవలను నిషేధించవ లసిందిగా కోరుతూ హైకోర్టులో 'పిల్' వేశాడు. తరువాత పత్రికా విలేఖరులను పిలిచి ఆ విషయం ప్రకటించాడు. మరు నాడు పత్రికలలో బాక్స్ కట్టి మరీ వేశారు. ఆ పక్కనే ఆ 'పిల్' మీద రచయిత అభి ప్రాయాన్నీ వేశారు.

ఈ 'పిల్' న్యాయమూర్తి రాధాకృష్ణ విచా రణ పరిధిలోకి వచ్చింది. ఎవరు నవల గురించి వింటున్నా ఇంత వరకు చదవలేక పోయాడు. అది చదివితే ఈ లిటిగేషన్‌కి పబ్లిక్ ఇంటరెస్ట్ వుందో లేదో తెలుస్తుంద నుకొని తెప్పించుకొని చదవడం మొదలె ట్టాడు. అది చదువుతుంటే ఎంత వద్దను కున్నా మదిలో ఏవో పాడు అనుమానాలు, అలజడులూనూ. తనకే ఇలా అనిపిస్తే సామాన్య ప్రజల సంగతి ఏమికాను అను కొని ఆ పిల్‌ను విచారణకు తీసుకోవాలని నిర్ణయించాడు.

* * *

తల్లి మాటలతో మదాలస గందరగో ళంలో పడింది. పరుగున వెళ్లి 'ఎవరు' నవ లని అందుకుని పేజీలు తిప్పింది ఓ బ్లడ్ వివరాల కోసం. దానిలోవున్న వివరాల ప్రకారం ఓ వాళ్ళకి ఎబి గ్రూప్ పిల్లలు పుట్టరు. మరి నాది ఎబి. ఇది ఎలా సంభవం? ఎక్కడ వుంది తేడా? అంటే? అమ్మ అమ్మ కాదా...? అదే అయ్యుండాలి. నిజమేనా ఇది! అదే నిజమయితే తనకు తెలవకుండా ఎలా వుంటుంది? కనీసం నాన్న అన్నా నిజమయిన నాన్ననేనా లేక తనను దత్తత కానీ తీసుకున్నారా? అదే గనుక నిజమయితే ఇప్పటి వరకు ఎందుకు తెలవకుండా వుంటుంది, నా సంగతి అది అయితే అక్కయ్య సంగతి ఏమిటి? ఏమిటి దంతా?

ఈ సందేహాలతో పరుగున అమ్మతో మాట్లాడటానికి వెళితే గది డోర్ లాక్ చేసి వుంది. లోపటి నుండి సన్నగా ఏడుపు విన పడుతోంది. ఒక క్షణం సందేహించి తలుపు కొట్టింది. తలుపు తీసి వెళ్ళి మళ్ళీ పడుకొని రోదించసాగింది.

మదాలస వెళ్ళి తల్లి భుజం మీద చేయి వేసి "చెప్పమ్మా. ఏమిటిది. నాకు గందరగో ళంగా వుంది" అంది.

వరలక్ష్మి మాట్లాడలేదు. మళ్ళీ అడిగింది "చెప్పమ్మా. నాకు తెలవని విషయాలు ఏవో వున్నాయి. ఏమిటవి? "

"నీకు నువ్వుగా కనిపెట్టావుగా. ఆ వివ రాలు చాల్లేదా" అంది వరలక్ష్మి ఈసడిం పుగా.

మదాలస మౌనం వహించింది.

"ఆ వివరాలు నన్ను అడక్కు. మీ నాన్ననే అడుగు. ఘనకార్యాలన్నీ చేసింది మీ నాన్ననే కదా" అంది చిరాకుగా వర లక్ష్మి.

"అంటే నువ్వు నా అమ్మవు కాదా"

"అవునో కాదో మీ నాన్ననే అడిగి తెలు సుకో"

"అంటే నువ్వు నా జన్మనిచ్చిన అమ్మవి కాదన్నమాట. నువ్వు నా అమ్మవే అయితే అలా అనవు. చెప్పమ్మా నా అసలు తల్లి ఎవరు"

"ఆ వివరాలు నన్ను అడక్కు. మీ నాన్ననే అడుగు. నేనేం చెప్పలేను. నన్ను ఇక విసిగించకు. నీ ఒక సందేహానికి జవాబు దొరికిందిగా, ఇక వెళ్ళు. నా మానాన నన్ను వదిలేయి" అని విసవిసా నడిచి పెరట్లోకి వెళ్ళిపోయింది

మదాలస నీరసంగా అక్కడే కూలబడింది

* * *

వీరభద్రం అట్టహాసంగా రక్తదాన శిబిరం ఏర్పాటు చేసి కుముదినీ దేవి రక్తాన్ని సేక

రించి బదరీకి ఇచ్చాడు. బదరీ దాన్ని తీసుకువెళ్ళి బ్లడ్ టెస్ట్ చేయించాడు. తరువాత ఆ వివరం శేషాచలాన్ని కలిసి చెప్పాడు.

"మంచిది. ఇక నా పిల్లల బ్లడ్ గ్రూప్స్ తెలుసుకో. ఎవరికయినా బీ, ఓ కాకుండా వేరే వుంటే వెంటనే తెలియజేయి" అని చెప్పి పంపించాడు బదరీని. తెలుసుకుని బ్లడ్ గ్రూప్స్ ఏమైనా తేడాగా వస్తే ఏం చేస్తారా అని అనుకున్నాడు బదరి.

ముఖ్యమంత్రిగారికి అయిదుగురు సంతానం. మొదటి సంతానం రాజశ్రీకి పెళ్లయి బెంగుళూర్‌లో వుంటోంది. రెండవ సంతానం రాంకుమార్ నేవీ కెప్టెన్. బొంబాయిలో ఉంటాడు. మూడవ సంతానం, అయిదవ సంతానం అబ్బాయి అని, నాలుగవ సంతానం అమ్మాయని తెలుసు గానీ బదరికి వాళ్ల వివరాలు తెలవవు. పెద్ద కూతురు బ్లడ్ గ్రూప్ వివరాలు తెలుసుకోవడం కోసం బెంగుళూర్ పయనం కట్టాలనుకున్నాడు బదరి.

* * *

పరమానంద స్వామి హోమం చాలా విజయవంతంగా జరిగింది. ఎక్కడెక్కడి నుండో భక్తులు తండోపతండాలుగా వచ్చారు. సమాచార శాఖా మంత్రి కూడా పాల్గొనడంతో గవర్నమెంట్ టివి, రేడియోలలో కూడా మంచి కవరేజీ వచ్చింది. అయితే చాలా మంది భక్తులు ఏదో హోమం జరుగుతుందని వచ్చారు కానీ ఆ హోమం ప్రధానమయిన ఉద్దేశం ఏమిటో తెలవకుండానే వచ్చారు. ఏ ప్రముఖ రాజకీయ నాయకుడు ఎన్నికల సభ పెట్టినా తండోపతండాలుగా జనాలు వచ్చి ఎన్నికల్లో ఓట్లు చాటేసినట్లుగా వచ్చిన జనాన్ని చూసి స్వాములవారూ ఆయన శిష్యగణం చాలా సంబరపడ్డారు. సత్యశ్రీ మాత్రం పెదవి విరిచాడు. మాస్ మెంటాలిటీ ఎలా ఉంటుందో తెలుసు కాబట్టి.

పత్రికలల్లో, టివిలల్లో ఆ హోమం విజయవంతం కావడం గురించి పలు రకాల విశ్లేషణలు వచ్చాయి. కానీ 'ఎవరు' నవల మీద అనుకున్న వ్యతిరేకత పాలపొంగులా త్వరలోనే చల్లారి పోయింది. ఒక వారం తరువాత ఆ హోమం గురించి గుర్తున్న వారిని వేళ్లమీద లెక్కించవచ్చు ముఖ్యంగా యువత ఆ హోమం గురించి పెద్దగా పట్టించుకోనే లేదు. అలాగే పరమానంద స్వామిని కూడా ప్రజలు మళ్లీ మరచిపోయే సరికి వాస్తవ పరిస్థితి అర్థమయిన స్వాములవారు మళ్లీ గడ్డం నిమురుకుంటూ ఆలోచనల్లో పడ్డారు.

16



హొయసల, రాజేష్ రామన్నపేటలో గవర్నమెంట్ హైస్కూల్‌కి వెళ్లేసరికి లంచ్ అవర్ కావస్తోంది. లంచ్ అవర్ అయ్యే వరకు కొద్దిసేపు వేచి ఉండి ప్యూన్‌ని పరిమళ కోసం అడిగారు. స్టాఫ్ రూం నుండి పరిమళ వచ్చి వీళ్లని చూసింది. రాజేష్‌ని వెంటనే గుర్తు పట్టి "రాజూ నువ్వా ఎన్నాళ్లకి!" అంది ఎంతో సంభ్రమాశ్చర్యాలతో.

రాజేష్ మందహాసం చేస్తూ అవునని తలూపాడు. పక్కనే ఉన్న హొయసలను చూసి ఎవరన్నట్లుగా చూసింది.

"నా భార్య, హొయసల."

పరిమళ ఆమెను ఒకసారి నఖశిఖ పర్యంతం చూసి "హొయసల. చక్కటి పేరు, చక్కటి రూపం నీ భార్యది" అంది నవ్వుతూ.

"నిన్ను ప్రత్యేకంగా కలవడం కోసమే రామన్నపేటకు వచ్చాం. నీకు వీలయితే మధ్యాహ్నం ఆఫ్ తీసుకో".



"నా కోసం వచ్చారా ప్రత్యేకంగా! ఏమిటబ్బా విశేషం? " ఆమె స్వరంలో మళ్లీ ఆశ్చర్యం.

"అవి తీరికగా మాట్లాడుకుందాం".

"సరే, సరే. నేను ఇప్పుడే సెలవు పెట్టి వస్తాను" అని లోపలికి వెళ్లింది

"మంచి అందం ఆమెది. మనిషి కూడా మంచిదిలా అనిపిస్తోంది" అంది హాయ సల సంతోషంగా.

"నేను చెప్పా కదా".

పరిమళ బయటికి వచ్చి "పదండి" అంటూ ముందుకు దారి తీసింది. ముగ్గురూ కలిసి నడవనారంభించారు. "నేను ఇక్కడ పని చేస్తున్నట్లు మీకెలా తెలుసు? "

"వెబ్‌లో వెతికాం సుందరం కోసం, కానీ నీ పేరు మాత్రమే ఉంది!"

"ఆయన ఏక్సిడెంట్లో పోయాడు మూడేళ్ల క్రితం" అని ఆ వివ రాలు చెప్పింది.

అప్పట్లో సుందరంతో గడిపిన రోజులు రాజేంద్ర స్మృతి పథంలో మెదిలి సుందరం చనిపోయినందుకు బాధ పడ్డాడు. కొద్ది దూరంలోనే ఇల్లు ఉండటంతో ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ నడవసాగారు.

"ఎంత మంది పిల్లలు మీకు" అడిగింది పరిమళ.

"ఇద్దరబ్బాయిలు. మీకు" అని అడిగి ఊపిరి బిగపట్టి ఆమె సమాధానం కోసం ఎదురుచూసింది హాయసల.



"ఒక పాప".

హొయసల, రాజేష్ ఇద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకొని ముసిముసిగా నవ్వుకున్నారు.

"వయస్సు? "

"పన్నెండు"

మరోసారి సంతోషంగా ముసిముసిగా నవ్వుకున్నారు. రాజేష్‌కి ఆ అమ్మాయి తప్పక తన బిడ్డే అయి ఉంటుందని నమ్మకం కలిగింది. ఎప్పుడు చూడాలా అని ఆతృతగా ఉంది.

"ఏం పేరు? "

"శబ్ద"

"చక్కటి పేరు" అంది హొయసల.

"పేరుకు తగ్గట్టే పాపకి సంగీతం మీద మంచి ఆసక్తి"

"చక్కటి విషయం. మీరు అదృష్టవంతులు. మీకు పాప ఉంది. మాకు పాప కావాలని ఎంతగానో అనుకున్నాం కానీ పుట్టలేదు. ఆడపిల్ల అయితే ఎన్నో ముద్దు ముచ్చట్లు తీర్చుకోవచ్చు".

"నిజమే. ఒక కుటుంబానికి కనీసం ఒక పాప, ఒక బాబు ఉంటే బావుంటుంది".

"మీ పాపని చూడాలని కుతూహలంగా ఉంది".

"పాప కూడా సంతోషిస్తుంది మిమ్మల్ని చూసి. తనకి చుట్టాలు, గెస్ట్‌లు అంటే బాగా ఇష్టం. బాగా కలిసి పోతుంది."

ఈ మాటలు విన్నాక పాపని త్వరగా చూడాలని ఇంకా అనిపించింది రాజేష్

దంపతులకి.

"ఏదో మాట్లాడాలన్నారు? " పరిమళ అడిగింది.

"మాట్లాడదాంలే. తగిన సమయం వచ్చినప్పుడు".

"ఏమిటో బాగా సస్పెన్స్ పెట్టేస్తున్నారు!" అని నవ్వింది.

హొయసల, రాజేష్ కూడా నవ్వారు. ఈ లోగా ఇంటికి చేరారు. ఇంటిలోకి వెళ్లగానే హొయసల ఆత్రుతగా గోడలన్నీ పరికించి చూసింది ఫొటోల కోసం. సుందరం ఫొటోలు కొన్ని ఉన్నాయి. పాప ఫొటో కూడా కనిపించింది. ఓ రెండేళ్ల క్రితందికావచ్చు పోలికలు పరికించి చూసింది. తల్లి పోలికలే చాలా ఉన్నాయి. దాదాపుగా పరిమళ ఉన్నట్లే చాలా అందంగా ఉంది.

కొద్దిగా ఆశాభంగం చెందుతూ అంది "పాపకి అన్నీ మీ పోలికలే వచ్చినట్లున్నాయి".

రాజేష్‌కి కూడా పాపకి తన పోలికలు రాకుండా పరిమళ పోలికలే రావడంతో కొద్దిగా అసంతృప్తిగా అన్పించినా పాప చాలా అందంగా ఉన్నందుకు సంతోషంగా అనిపించింది.

"అవును. నాలాగే ఉంటుంది".

"పాప మీలాగే చాలా చక్కగా ఉంది. ఎప్పుడు చూడాలా అనిపిస్తోంది. స్కూల్ నుండి ఎప్పుడొస్తుంది? "

"అయిదు గంటలకి".

హొయసల టైం చూసుకుంది. రెండు గంటలయింది. అంటే పాపని చూడాలంటే ఇంకా మూడు గంటలు గడవాలి. రాజేష్‌కి కూడా ఎప్పుడు పాపని చూడాలా అని ఆతృతగా ఉంది.

పరిమళ త్వరత్వరగా భోజనం వండింది. బెండకాయ వేపుడు, రసం చేసింది. కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశారు. పరిమళ కొసరి కొసరి వడ్డిస్తోంది. వంటతో పాటు ఆప్యాయతను పంచి వడ్డించింది.

"సుందరం త్వరగా పోయాడు ఇంత మంచి పెళ్లాన్ని వదిలి వేసి" అనుకుంది హొయసల.

పరిమళ, హొయసల ముచ్చట్లు చెప్పుకుంటూ త్వరలోనే బాగా కలిసిపోయారు. ఇద్దరూ మంచి అందగత్తెలే అయినప్పటికీ గర్వం లేకపోవడం, సహృదయత కారణంగా బాగా కలగలిసి పోగలిగారని అనుకున్నాడు రాజేష్ ఆ ఇద్దరినీ గమనిస్తూ.

భోజనాలయ్యాక పరిమళ అల్బంలు తీసుకువచ్చి చూపించింది. పాప ఫొటోలన్నీ ఆసక్తిగా చూశారు ఇద్దరూ. ఆ తరువాత బెడ్ రూంలోకి వెళ్ళి చీరలు, నగల గురించి ముచ్చట్లు పెట్టుకున్నారు ఆడాళ్ళిద్దరు. కొద్ది సేపయాక "నేను కొద్దిసేపు పడుకుంటాను" అంది హొయసల.

"అలాగే" అని ఆమెను బెడ్ రూంలో వదిలి తలుపు దగ్గరికి వేసి లివింగ్ రూంలోకి వచ్చి రాజేష్‌కి ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుని అతణ్ణి తీరికగా నఖశిఖ పర్యంతం పరిశీలించింది పరిమళ. పన్నెండు సంవత్సరాలలో కొన్ని మార్పులు వచ్చాయి. కొద్దిగా బట్టతల, అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు, కాస్త సడలిన దృఢత్వం, చిన్ని బొజ్జ.

అదే సమయంలో రాజేష్ కూడా పరిమళను పరిశీలనగా చూశాడు. కాలం తీసుకువచ్చిన మార్పులు ఆమెలో కూడా గోచరిస్తున్నాయి. కానీ ఆమెలో అందం ప్రౌఢత్వాన్ని పుంజుకొని ఇంకా దిగ్విజీకృత మయినట్లు అనిపిస్తోంది. అలా ఒకరినొకరు పరిశీలించుకుంటూ ఉండగా ఇద్దరి కళ్ళు కలుసుకున్నాయి. ఇద్దరూ చిన్నగా నవ్వుకున్నారు.

"ఏమిటి విశేషాలు" అంది పరిమళ.

"ఏమున్నాయి. పెళ్లయిన తరువాత ఏముంటాయి పెద్దగా"

"చక్కటి భార్య లభించింది నీకు"

"అవును. కానీ ఆమెకు ఒక చిన్న అసంతృప్తి వుంది"

## కాఫీ కప్పుల్లో... 'ఈ.కోలై'

"ఇం దుగలడందులేడని సందేహమేల... ఎందెందువెదకినా..." అన్నట్టు, కంటికి కన్పించకుండా, శబ్దం చెయ్యకుండా, స్పర్శ తెలియకుండా మనకి బాక్టీరియా, వైరస్, శిలీంద్రాలు (మోల్డ్స్) హాని కలిగిస్తాయి. పిల్లలు ఆట వస్తువుల దగ్గర్నుంచి, డేకేర్ సెంటర్స్ వరకు... టెలిఫోన్స్, డోర్ నాబ్స్; కౌంటర్లు... ఇలా ఇవి ఎక్కడ బడితే... అక్కడే వృద్ధి చెందుతుంటాయి. అయితే మనం ఆఫీసుల్లో కాఫీ తాగే కప్పులున్నాయి చూశారూ... వీటి ద్వారా డయేరియాకి కారణమైన మైక్రోబ్స్ వ్యాప్తిజెందుతున్నాయని, ఈ కప్పుల ద్వారా 60% "ఎశ్చరీషింకూ కోలై" ఒకర్నుంచి మరొకరికి అంటుకుంటోందని పరిశోధనల్లో వెల్లడయింది. కప్పుల్తో తాగడమెందుకు, వ్యాధులు వృద్ధి చేసుకోవడమెందుకు అనుకుంటే... గో ఫర్ డిస్పోజబుల్స్.




అక్కడితో ఆఖరా... కాదు, కాదు.- మీరు ఉంగరాల బంగారయ్యలా! అయితే... బి అవేర్... అనాల్సిందే! చేతులు కడుక్కునే ప్రతిసారీ మీ ఉంగరాల్ని తీసి, చేతుల్ని సబ్బుతో, వేడినీటితో కడుక్కోవాలి. అలాగే ఉంగరాలక్కూడా స్నానం చేయించాలంటున్నారు.

ఎందుకంటే ఉంగరాలు ధరించని వాళ్లకంటే ఉంగరాలు ధరించేవాళ్ల చేతుల్లో ఎక్కువగా స్టాఫిల్‌కోకై వృద్ధిచెందుతోందని పరిశోధకులు చెప్తున్నారు. చేతులు కడుక్కోవడానికి వాడే వేడినీటి వేడి 37 C నుండి 42oC మధ్య ఉండాలట. మరి పారాహుషార్‌గా ఉండండి!

"ఏమిటది" అంది ఆసక్తిగా ముందుకు వంగి

"ఆడపిల్లలు లేరని"

"అవును. నేనూ గ్రహించాను"

"అందుకే నీ దగ్గరకి వచ్చాం"

"నా దగ్గరకా! నేనేం చేయగలను ఆ విషయంలో...?"

"నీకు ఆడపిల్లలు వుండాలని కోరుకున్నాం"

"నాకు పాప వుంది. అయితే!" పరిమళకి ఇదంతా ఆశ్చర్యంగా వుంది

"అయితే.. అయితే.."

"హే. నా దగ్గర మొహమాటం ఏమిటీ. చెప్పూ"

"ఒకవేళ నీ పాప మనిద్దరి పాప అయితే"

పరిమళ లిప్తకాలం పాటు ఆశ్చర్యపోయింది. అతడి మాటలు అర్థం కానట్లు చూసింది.

"మనిద్దరి పాపనా? !"

"అవును. అప్పట్లో అనే దానివి కదా. నాతో పిల్లలు పుట్టాలని"

"అవుననుకో"

"అందుకే నీకు నా ద్వారా ఆడపిల్లలు పుట్టారేమోనని తెలుసుకోవడానికి వచ్చాం"

"మన సంగతంతా హొయసలకు తెలుసా..!" విభ్రమంగా అడిగింది

"నా గురించి అంతా తెలుసు, అన్నీ తెలుసు"

"ఏమనదా!"

"పెళ్ళికి ముందు చేసిన వాటికి ఏమ

నదు. పెళ్లయిన తరువాత చేయడాన్ని మాత్రం ఒప్పుకోదు"

"అలాగా. అర్థం చేసుకోగల భార్య దొరికింది నీకు"

"అవును"

"ఒక వేళ పాప మన పాపే అనుకో. అప్పుడేమిటి?" పరిమళ స్వరంలో కాస్త కుతూహలం.

"పెద్దగా ఏమీలేదు. అప్పుడప్పుడూ చూసి వెళతాం. నీవు ఒప్పుకుంటే అప్పుడప్పుడూ తీసుకువెళతాం. మాతో, తమ్ముళ్ళతో కొద్ది రోజులు గడిపి వస్తుంది"

"ఓకె. బాగానే వుంది కానీ మరి మన పాపో కాదో ఎలా తెలుసుకోవడం? నీ పోలికలు రాలేదు కదా? అప్పుడు సుందరంకి స్పెర్మ్‌కౌంట్ తక్కువ వుండేది కానీ అసలే లేకుండా పోలేదు కదా. ఎవరి వల్లనో అనేది ఎలా నిర్ధారణకు రావడం" అంది. ఇదంతా పరిమళకు కూడా థ్రిల్లింగ్ గానే ఉంది. మోడువారిన జీవితంలో కొద్దిగా వెలుగులు.

"పోలికలు వస్తే మనకు ఈజీగా ఉండేది. రాలేదు కాబట్టే మనం కొద్దిగా ప్రయత్నించాలి"

"ఏమిటా ప్రయత్నం?" అతణ్ణే రెప్పవాల్చకుండా చూస్తూ.

"'ఎవరు' నవల చదివావా? నువ్వు పుస్తకాల పురుగువి కదా. చదివే వుంటావు"

"చదివాను. అప్పుడు పాప బ్లడ్ గ్రూప్ గురించి ఆసక్తి కూడా కలిగింది గానీ త్వరలోనే మర్చిపోయాను"

"పాప బ్లడ్ గ్రూప్ తెలుసా?"

"తెలియదు"

"పోనీ నీది"

"ఉహూ తెలియదు" తల అడ్డంగా ఊపుతూ అంది.

"సుందరం ది?"

గుర్తు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నట్లు రెండు క్షణాలు కళ్లు మూసుకుంది. తర్వాత కళ్లు తెరచి "ఉహూ. గుర్తుకు రావడం లేదు. ఆక్సిడెంట్ అయినప్పుడు బ్లడ్ అవసరమై టెస్ట్ చేశారు. కానీ అదే గ్రూపో గుర్తుకు రావడం లేదు" అంది.

"గుర్తు తెచ్చుకో. బ్లడ్‌టెస్ట్ రిజల్ట్ వుంటే చూడు. మనిషి చాలా సాత్వికుడు కాబట్టి ఏ నో 'ఎబి' నో అయివుండొచ్చు"

"కావచ్చు. వెతుకుతాను" అంటూ లోపలికి వెళ్ళింది. పరిమళ కొద్ది సేపట్లో తిరిగి వచ్చింది రిజల్ట్ పేపర్‌తో.

"నువ్వన్నట్లే ఏ గ్రూప్"

"గుడ్"

"మరి నాదేమయి వుంటుంది"

"ఓ నో, బి నో అయివుండాలి. నీలో దూకుడు ఎక్కువే కదా"

"అహ్హా. అలాగా. మరి తమరిదేమిటో? తమరి దూకుడు మాత్రం తక్కువా?" గలగల నవ్వింది

"నాది కూడా ఓ నే. పాప వచ్చిన తరువాత ల్యాబ్‌కి వెళ్ళి నీది, పాపది బ్లడ్ టెస్ట్ చేయిద్దాం"

"సరే. అదిగో మాటల్లోనే పాప వచ్చింది" అంది పరిమళ అప్పుడే గేటు తీసుకుని లోపలికి వస్తున్న కూతుర్ని చూసి.

శబ్దకి రాజేష్‌ని "సిటీలో వుండే అంకుల్. మనకు చాలా దగ్గరి వారు. ఆంటీనేమో బెడ్రూంలో నిద్రపోతోంది" అని పరిచయం చేసింది.

సంతోషంతో పాపని దగ్గరికి తీసుకొని కుశల ప్రశ్నలు వేశాడు రాజేష్. పాప చక్కగా సమాధానం చెప్పింది. అతడిలో పితృ హృదయం పొంగి పొర్లింది. అప్రయత్నంగా నుదిటి మీద ఒక ముద్దుపెట్టాడు. పాప కొద్దిగా బెంబేలు పడి అమ్మవైపు చూసింది.

"ఫర్వాలేదులేమ్మా. వారు నీకు నాన్న లాంటి వారు" బెంబేలు పడనక్కరలేదన్నట్లుగా చెప్పింది పరిమళ కూతురికి.

ఈ హడావిడి విని పాప వచ్చిందేమోననుకుంటూ హోయసల అక్కడికి వచ్చింది.

పాపని చూసి "ఎంత ముద్దుగా ఉన్నావో" అని బుగ్గలు సున్నితంగా చిదిమి ముద్దు పెట్టుకుని విరిచి, దగ్గరకు తీసుకొని ఉత్సాహంగా ఏవేవో అడగడం మొదలెట్టింది. అలా శబ్ద రాజేష్, హొయసల వాత్సల్యపు వర్షంలో మునిగి ఉక్కిరిబిక్కిరి అయింది కాసేపు.

ఈలోగా పరిమళ తయారైవచ్చింది. అది చూసి హొయసల కూడా రిఫ్రెష్ అయింది. టీ తాగి అందరూ కలిసి బయటకి నడిచారు. టౌన్ చివరగా వున్న ఒక మెడికల్ ల్యాబ్‌కి వెళ్ళి బ్లడ్ ఇచ్చారు పరీక్ష కోసం. పావు గంటలో రిజల్ట్ చెప్పారు. రాజేష్ ఊహించినట్లు గానే పరిమళది ఓ. పాపది బి. అప్పుడు గుర్తుకు వచ్చింది ఒక విషయం. 'ఎవరు' నవల వాళ్ళతోపాటు పట్టుకురావడం మరిచేపోయారు.

17



'ఎవరు' నవల మీద ప్రభుత్వ అభిప్రాయం ఏమిటో, ఎందుకు ఆ నవలని నిషేధించకూడదో తెలుపుతూ రెండు వారాల్లో అఫిడవిట్ సమర్పించాల్సిందిగా రాష్ట్ర ప్రభుత్వ అడ్వొకేట్ జనరల్‌కి కోర్టు నోటీసులు పంపింది. దానిపై న్యాయశాఖతో సంప్రదించాడు అడ్వొకేట్ జనరల్ సుధాకర్. ఆ నవల మీద ఎటువంటి అభిప్రాయమూ ప్రభుత్వానికి లేదనీ, దాని వల్ల పెద్దగా సమస్యలు ఏమీ రావడం లేనందువల్ల నిషేధం అవసరం లేదని ప్రభుత్వ అభిప్రాయంగా కోర్టుకు అఫిడవిట్ సమర్పించాడు సుధాకర్. ప్రభుత్వ నిర్ణయాన్ని కొంతమంది మెచ్చుకున్నారు, కొంతమంది ఖండించారు. అందరూ కోర్టులో జరిగే వాదోపవాదాల కోసం ఎదురు చూడసాగారు.

ఎవరు నవల రచయితకూ, పబ్లిషర్‌కు కూడా కోర్టు విచారణ గురించి నోటీసులు అందాయి. సత్యశ్రీ లాయర్ కృష్ణను ఏర్పాటు చేసుకున్నాడు తన తరఫున వాదించడానికి.

* * *

తండ్రి వచ్చాక మదాలస ఆయన్ని కూర్చోబెట్టి విషయం అంతా చెప్పి అడిగింది అసలు విషయం ఏమిటని.

కాస్త తల దించుకొని "నీ అనుమానం నిజమేనమ్మా. ఈ అమ్మ నీకు నిజమయిన అమ్మ కాదు" అన్నాడు రఘునాథం

"మరి ఎవరు"

"అది నువ్వు తెలుసుకోకపోవడమే మంచిది"

"కాదు కాదు. నాక్కావాలి. నేను తెలుసుకోవాలి" పట్టుదలగా అంది.

"చెబుతాను గానీ, ఆమెను కలవడానికి ప్రయత్నాలేం చేయకు. ఆమె ఇప్పుడు ఎక్కడుందో ఏం చేస్తోందో నాకు తెలియదు"

"సరే, చెప్పండి నాన్నా"

"ఆమె పేరు మందాకిని. అప్పట్లో పక్కింట్లో వుండేది"

"మీకు అమ్మ ఎలా పరిచయం అయింది" అడిగింది మదాలస ఉద్విగ్నతతో.

పక్కింట్లో ఉండేది. ఈ అమ్మతో మానసిక ప్రశాంతత తక్కువై మీ అమ్మకు దగ్గరయ్యాను. గర్భం దాల్చడంతో మీ అమ్మ తల్లిదండ్రులకు తెలిసింది. వచ్చి నాతో బాగా గొడవపడ్డారు. అప్పటికే ఆలస్యం అవడంతో అబార్షన్ చేస్తే తల్లికీ పిల్లకూ ప్రమాదమని చెప్పి ఆమెను డెహ్రాడూన్‌లో వున్న చుట్టాలింటికి తీసుకువెళ్ళి ప్రసవం చేయించారు. ముందుగా నాతో చేసుకున్న ఒప్పందం ప్రకారం బిడ్డను తీసుకువచ్చి నాకు అప్పగించి ఊరు మారిపోయి మీ అమ్మకు పెళ్ళి చేశారు. జన్మలో మళ్ళీ తనను కలిసే

ప్రయత్నం చేయవద్దని హెచ్చరించి వెళ్లారు. ముందు ఈ అమ్మ నాతో బాగా గొడవపడినా నిన్ను మాత్రం బాగా చూసుకుంది. సొంత కూతురిలా పెంచుకుంది. నీకు ఈ విషయం ఎప్పటికీ తెలియకుండా రహస్యంగానే ఉంచాలనుకున్నాం. కానీ ఇప్పుడు బయటపడింది 'ఎవరు' నవల ధర్మమా అని".

మదాలస అక్కడే కూలబడి "అయ్యో అమ్మా" అని గట్టిగా ఏడ్చేసింది.

ఈ ఏడుపు విని వరలక్ష్మి అక్కడకు వచ్చి కూతురు తల మీద చేయివేసి బాధను నిగ్రహించుకొమ్మన్నట్లుగా ప్రేమగా నిమిరింది.

వరలక్ష్మిని చూసి "మమ్మీ. విషయం తెలవక నిన్ను అపార్థం చేసుకున్నాను మమ్మీ నన్ను క్షమించు. నీ కడుపున పుట్టిన బిడ్డను కాకున్నా నీ స్వంత బిడ్డ కంటే మిన్నగా చూసుకుంటున్నావు. అలాంటి నిన్ను ఎన్నో మాటలని బాధపెట్టాను" అని వరలక్ష్మిని వాటేసుకుని వలవలా ఏడ్చేసింది.

"ఫర్వాలేదులేమ్మా. నీకు అసలు విషయం తెలవక అన్నావు. నీ పరిస్థితిలో నేనున్నా అలాగే చేసేదాన్నేమో"

"మమ్మీ. మందాకిని అమ్మను కూడా చూడాలని వుంది. ఎలాగ మమ్మీ ఆ అమ్మను చూడటం"

"పిచ్చిదానా. మీ అమ్మను నువ్వు నీకు తెలియకుండానే అప్పుడప్పుడు కలుస్తూనే వున్నావు"

తండ్రీ కూతుళ్ళు ఇద్దరూ ఆశ్చర్యపోయారు. మదాలస తేరుకుని "ఏమిటినువ్వనేది" అంది.

"మీ డాడీ లేనప్పుడు అప్పుడప్పుడు వచ్చి నిన్ను చూసి వెళుతూ వుంటుంది" అంటూ భర్త ముఖం వేపు చూసింది. ఈ విషయాల్ని ఏ మాత్రం నమ్మలేనట్లుగా వింటూ అలా గుడ్లప్పగించి చూస్తూండిపోయాడు రఘునాథం.

"నిజంగానా. అమ్మ నాకు తెలియకుండానే నన్ను చూసి వెళుతోందా"అని ఆర్తిగా అడిగింది

"అవునమ్మా, నువ్వూ మీ అమ్మని ఎన్నో సార్లు చూశావు. మాట్లడావు. కాకపోతే నీకు ఆమే అసలు అమ్మ అని తెలియదు అంతే"

"నిజంగానా...? " అంది సంభ్రమంగా

"అవును"

"మందాకిని అన్న పేరున్న వారినెవరినీ నేను కలిసినట్లు గుర్తుకులేదే"

"నీతో వేరే పేరు చెప్పాంలే"

"అలాగా. ఏం పేరు మమ్మీ. చెప్పవా తొందరగా. ప్లీజ్. నేను ఆగలేకుండా వున్నాను"

"కిరణ్మయి"

"కిరణ్మయి అంటీనా అసలు అమ్మ! ఎందుకు నా మీద అంత ప్రేమ చూపిస్తుంటుందా అనుకునేదాన్ని నన్ను వదిలిపెట్టలేక, వదిలిపెట్టలేక వెళ్లేది. అలా ఎందుకు చేస్తోందని అడిగితే ఆమెకు పిల్లలు లేరని అందుకే ఎవరి పిల్లలయినా ఇష్టమని చెప్పేదానివి"

"అవును"

"నేనే నీ తల్లినని అమ్మ నాతో ఎప్పుడూ ఒక్కసారన్నా చెప్పలేదెందుకూ? "

"మందాకినికి పెళ్లయిన తరువాత కొంత కాలానికి నీ మీద బాగా ఆపేక్ష కలిగింది. నిన్ను చూడాలని నువ్వు కిండర్ గార్టెన్ చదువుతున్న స్కూల్‌కి వచ్చి నా కంటపడింది. ఆమెకు నీ మీదున్న ఆపేక్ష చూసి అప్పుడప్పుడూ నిన్ను కలుసుకునేందుకు ఒప్పుకున్నాను. కానీ రెండు కండీషన్‌లు పెట్టాను. ఒకటి: ఆమె నీ తల్లి అని నీకు ఎప్పటికీ చెప్పకూడదని. రెండు: ఎప్పుడూ మీనాన్న కంట పడగూడదని. ఈ రెండింటిలో ఏ ఒక్కటి తప్పినా నిన్ను ఏ మాత్రం చూసే అవకాశం కలగదని ఖరాఖండిగా చెప్పాను.

అందుకే ఇప్పటిదాకా నీకు గానీ, మీ నాన్నకు గానీ మీ అమ్మ వచ్చి కలుస్తున్నట్లు తెలియదు"

"ఇప్పుడు తెలిసింది కదా మరి, మాకు. ఇపుడేంటి పరిస్థితి"

"చూడమ్మా. నువ్వ పెద్ద దానివయ్యావు. ఏం చేయాలో నీకే వదిలేస్తున్నాం. నువ్వు ఎలా చేసినా మాకు సంతోషమే"

"మమ్మీ. మందాకిని అమ్మను ఇన్ని సంవత్స రాలుగా గమనిస్తూ వస్తున్నావు కదా. అమ్మ మీద నీ అభిప్రాయం ఏమిటి? "

"చాలా మంచిది"

"అయితే అమ్మను నేను కలవాలనుకుంటు న్నాను"

"మాకూ సంతోషమే"

* * *

బదరీ బెంగుళూర్ వెళ్ళాక కష్టపడి రాజేశ్వరి బ్లడ్ గ్రూప్ తెలుసుకోగలిగాడు. అందులో సందే హించాల్సిందేమీ అనిపించలేదు. ఆ తరువాత బొంబాయి ప్రయాణం కట్టాడు. అక్కడ రాంకు మార్ బ్లడ్ గ్రూప్ తెలుసుకోవడం కొంచెం కష్టమే అయినప్పటికీ నేవీలో కాంపౌండర్‌కి లంచం ముట్టజెప్పి తెలుసుకోగలిగాడు. అక్కడ కూడా సందేహించాల్సిన అవసరం కనిపించలేదు.

శేషాచలం గారి మూడో సంతానమయిన రఘు హైదరాబాద్‌లోనే వుంటాడు కాబట్టి మళ్ళీ హైద రాబాద్‌కే వచ్చాడు. రఘు జేఎన్‌టియులో ఎంటెక్ చేస్తున్నాడు. అతనికి తరచుగా బ్లడ్ డొనేషన్ ఇవ్వడం హాబీ అని తెలుసుకున్నాడు. ఒకనాడు రఘు బ్లడ్ డొనేషన్ ఇచ్చినప్పుడు ఆ బ్లడ్ బ్యాంక్ ల్యాబ్ అసిస్టెంట్‌ని పరిచయం చేసుకొని రఘు బ్లడ్‌టైప్ కనుక్కున్నాడు. ఏ. ఇది అనుమానాస్పదంగా ఉంది అనుకున్నాడు. వెంటనే శేషాచలాన్ని కాంటాక్ట్ చేసి మాట్లాడదా నికి ప్రయత్నించాడు. శేషాచలం లైన్‌లోకి రాగానే "నంబర్ త్రీ. ఏ" అని చెప్పాడు క్లుప్తంగా. అనవ సరమయిన విషయాలు మాట్లాకుండా మాట లలో, చేతలలో పొదుపుగా ఉంటాడు బదరి. శేషాచలానికి బదరిలో అది కూడా బాగా నచ్చుతుంది.

"సరే. మిగతా వారి వివరాలు కూడా సేక రించు" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు శేషారత్నం.

## సరిగా వింటారనే ఆశ!

ప్రకాశం వాదించిన ఓ కేసును కృష్ణ స్వామి అయ్యర్ కొట్టేయడం జరిగింది. ఆ తర్వాత అదే కేసు ఇద్దరు న్యాయ మూర్తుల ధర్మాసనానికి వచ్చింది. ఆ ధర్మాసనంలో ఓ న్యాయమూర్తి మళ్ళీ కృష్ణస్వామి అయ్యరే.. రెండోవాడు వాలెస్. ఈ నేపథ్యంలో ఆ కేసుల్ని పూర్వాపరాలతో సహా వివరంగా మళ్ళీ చెప్పి తన వాదన విన్పిస్తున్నారు ప్రకాశం. కృష్ణస్వామికి ఆయన మళ్ళీ మొత్తం వాదన విపులంగా ఎందుకు చేస్తున్నారో అర్థంకాలేదు. అదే అడి గాడు.

'అయ్యా.. నా వాదనలు పూర్తిగా విన కుండానే ఈ కేసులో మీరప్పుడే ఓ నిర్ణ యానికి వచ్చేశారని నాకు తెలుసు. నా మాటమీద గౌరవం ఉంచి ఈ సారైనా వాదనలు సరిగా విని కేసును అర్థం చేసుకుంటారనే మళ్ళీ మొదటినుంచీ చెప్పుకొస్తున్నాను' అంటూ చురకేశారు ప్రకాశం.



# అలర్ట్... అలర్ట్...

ఇవి సర్కస్ జంతువులు కావు. దక్షిణాఫ్రికాలోని కలహరి ఎడారిలో కనిపించే ముంగిస జాతి జంతువులు. వీటిని మీర్కట్‌లు అంటారు. రెండు కాళ్ల మీద నిలబడి తపస్సు చేస్తున్న భంగిమలో ఉన్నప్పటికీ అవి చేస్తున్నది సెంట్రీ డ్యూటీ. ఇరవై వరకు గుంపులుగా సంచరించే ఈ మీర్కట్‌లు ఆహారపు వేటలో ఉన్నప్పుడు తమను కబళించే జంతువులు, పక్షులు దాడి చేయకుండా కొన్ని స్వచ్ఛందంగా సెంట్రీ డ్యూటీ చేస్తుంటాయి. ఇలా వెనుక కాళ్లమీద నిలబడి పరిసరాలను గమనిస్తూ కాపలా కాస్తూ ప్రమాదం చేరువ కానుందని పసిగట్టిన వెంటనే మిగిలిన వాటిని హెచ్చరిస్తాయి.



అతని మనసు మనసులో లేదు. అంటే భార్య ఎక్కడో కాలు జారిందన్నమాట. ఏం చేయాలి ఇప్పుడు? తీవ్రమయిన వ్యధ ఆవహించింది. ఆ రోజు మిగిలిన కార్యక్రమాలన్నీ రద్దు చేయమని సెక్రటరీకి చెప్పి తను ఎప్పుడూ ఒంటరిగా వెళ్ళిగడిపే నిరుపమా రెడ్డి గార్డెన్స్‌కి వెళ్ళాడు విశ్రాంతిగా ఆలోచించుకోవడానికి. ఎంత ఆలోచించినా ఏం చేయాలో పాలుపోలేదు. ఏదో సరదాగా తెలుసుకోవాలని ఉబలాటపడ్డాడు కానీ నిజంగానే ఏదయినా విషయం బయటపడుతుందని కలలో కూడా అనుకోలేదు. అప్పుడప్పుడు భార్య ప్రవర్తన కొద్దిగా అనుమానం కలిగించినా ఇంత దూరం వస్తుందని అనుకోలేదు.

'రఘు నా కొడుకు కాదు సరే. మరి ఎవరి కొడుకు...? ' దీర్ఘంగా ఆలోచించాడు. దాదాపు ఇరవై ఏళ్ళ క్రితం ఏం జరిగిందో గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ 'అప్పట్లో కుముదిని ఎవరితో సన్నిహితంగా వున్నట్లు అనిపించేది? ' అప్పట్లో తను గుంటూర్ మున్సిపల్ ఛైర్మన్‌గా ఉండేవాడు. అప్పుడు తనతోనూ, ఇంట్లోనూ కాస్త ఎక్కువ స్నేహంగా ఉంటూ వచ్చిన వాడు రాజరత్నం. ఏదో అనుమానం లీలగా అప్పుడు పొడసూపేది కానీ ఎన్నడూ గట్టి ఆధారాలు దొరక్క ఏమీ అనలేకపోయాడు ఇద్దరినీ. కొంపదీసి రఘు రాజారత్నం కొడుకు కాదు కదా. అసలే ఈ మధ్య రాజారత్నం అసమ్మతికి కేంద్రంగా తయారవుతున్నాడు. ఈ విషయం ఏమయినా తెలిస్తే ఏదయినా ఇరుకున పెట్టే అవకాశం వుందేమో ఆలోచించవచ్చు ఉత్సాహంగా పక్కమీద నుండి లేచి ఫోన్ చేశాడు. అవతలవున్నది బదరీ.

"మిగతా విషయాలు తరువాత గానీ మంత్రి రాజారత్నం బ్లడ్‌టైప్ తెలుసుకో ముందు" అని పెట్టేశాడు. ఆ తరువాత మళ్ళీ పక్కమీదకి చేరి హాయిగా నిద్రపోయాడు.




అసోసియేట్ డైరక్టర్ గురు, మళ్ళీ రమణికి ఫోన్ చేశాడు. "మన బాబుని చూడాలని ఉంది"

"మన బాబు కాదన్నానా. మా బాబు. నీ పిల్లల సంగతి చూసుకో ముందు" అంది నవ్వుతూ రమణి

"నా పిల్లల సంగతి నేను చూసుకుంటే థ్రిల్ ఏముంటుంది. అందుకే మన బాబు మీద ఆసక్తి"

"అలానా. అయితే పెద్దయేంత వరకు ఆగు. హీరో అయితే రాజేంద్ర కొడుకు, డైరక్టర్ అయితే నీ కొడుకు. సరేనా" అంది ఏడిపిస్తున్నట్లుగా.

"అబ్బా అలా అనకు. బాబు కళ్ళు చూస్తుంటే నా కళ్ళలా లేవూ"

"ఉన్నాయి. కానీ ముక్కు రవీంద్రలా వుందే. నీది కొంచెం నడ్డిముక్కు కదా"

"అబ్బా"

"నీ కొడుకే అని తెలిందే అనుకో. అప్పుడేం చేస్తావు. నీ ఆస్తిలో వాటా ఇస్తావా? "

"సరదాగా మాట్లాడుకుందాం. ఇప్పుడే అంత దూరం ఆలోచించాలా? "

"అవును ఆలోచించాలి. నువ్వు వాటా ఇస్తానంటే చెప్పు నీ కొడుకే అని నీకు చెబుతాను"

"ఇదిగో ఈ డొంక తిరుగుడు మాటలే వద్దనేది. నీ మనసుకి ఎవరి కొడుకు అనిపిస్తోందో స్పష్టంగా చెప్పు"

"చెప్పేదా? నా కొడుకు అనిపిస్తోంది" అని కిసుక్కున నవ్వింది గురు జుట్టు

పీక్కొని "దగ్గర వుంటే అసలు నిన్ను..."

"మరి రావచ్చుగా. దూరంగా వుండి బాబు గురించి ఈ ముచ్చట్లేమిటి అసహ్యంగా. ఇటువంటివి దగ్గరగా వుండి మాట్లాడాలి"

"అవుననుకో"

"అవునవును. నా దగ్గరికి వస్తే రాజేంద్ర ఎక్కడ తంతాడో అని భయం. నువ్వు ఒట్టి పిరికోడివి"

"సరేలే. ఈ మధ్య సైరా మొగుడితో చావు తప్పి కన్నులొట్టబోయినంత పనయ్యింది. అందుకే కాస్త జాగ్రత్తగా ఉంటున్నా"

"బాగా అయ్యింది. నీకంతే కావాలి. లేకపోతే ఏమిటా తిరుగుళ్ళు? ఎవరితో పడితే వారితోనేనా? "

"నేనేం చేసేది వాళ్లంతట వాళ్లు వెంటబడుతుంటే చేతులు ముడుచుకు కూర్చునేదా? మా ఫీల్డ్ సంగతి నీకు తెలియదా? "

"ముందు మీ ఆవిణ్ణి జాగ్రత్తగా చూసుకో. ఏవేవో పుకార్లు వినపడుతున్నాయి."

"ఛ. నిజంగా!" "ఒకసారి ఇంటికి వెళ్ళి చూడు. ఎవరితో కనపడుతుందో"

"ఆ! ఏమిటి నువ్వనేది? "

"ఒక హీరోతో ఏదో జరుగుతోందని చెవులు కొరుక్కుంటున్నారు"

"నిజంగా? ఎవరా హీరో? "

"రాజేంద్ర"

"? "

"షాక్ తిన్నావా? "

"అవును. ఇప్పుడూ మా ఇంట్లోనే వున్నాడని ఎలా చెప్పగలవు? "

"గ్లోబల్ పొజిషనింగ్ సిస్టం ద్వారా. రాజేంద్ర సెల్‌ఫోన్‌కి అది వుంది. నేనే కొని ప్రెజెంట్ చేసిన సెల్ అది. ఆ సిస్టం వుందని ఆయనకి తెలవదు. నిజానికి అత్యావసరమయిన పరిస్థితి వుంటేనే ఆపరేటర్ సెల్‌ఫోన్ ఎక్కడవుందో కో ఆర్డినేట్స్ చెబుతాడు. కానీ నేను కొంచెం రిక్వెస్ట్ చేసేసరికి ఆ ఆపరేటర్ తరచుగా ఆయన ఎక్కడ వుండేదీ చెబుతున్నాడు. ఆ కో ఆర్డినేట్స్‌ని బట్టి చూస్తే అది మీ ఇల్లే"

"అలాగా. వెంటనే వెళ్ళి చూస్తాను"

"చూసి ఏం చేస్తావు? "

"ఏం చేస్తాను. ఏం చేయగలను. ఏమీ చేయను. చూసి వస్తాను"

"ఎందుకయినా మంచిది మీ పిల్లల బ్లడ్ గ్రూప్స్ చెక్ చేయించు"

"అలాగే" అని హడావిడిగా ఫోన్ పెట్టేశాడు.

రమణి గట్టిగా నవ్వుకుంది

హడావిడిగా గురు ఇంటికి వెళ్ళి కాంపౌండ్ గేట్ నెమ్మదిగా తీసుకొని లోపలికి వెళ్ళాడు. ప్రహరీ గోడ చుట్టూ తిరిగి వెళ్ళి బెడ్ రూం కిటికీకి చెవి ఆనించి రిక్కించి విన్నాడు. లోపల ఆడ మొగ పకపకలు, వికవికలు. ఆ మగ గొంతు రవీంద్రదే.

గురుకి ఏం చేయాలో అర్థం కాలేదు. దిగాలు పడిపోయాడు. కోపం తెచ్చుకోవాలా? బాధపడాలా? భార్య మీద అసంతృప్తి చెందాలా? ఏది చేయడానికయినా ఏం నైతిక హక్కు వుంది? కాసేపు అలా ఆలోచించి భుజాలెగరేసి వచ్చిన దారినే

హడావిడిగా గురు ఇంటికి వెళ్ళి కాంపౌండ్ గేట్ నెమ్మదిగా తీసుకొని లోపలికి వెళ్ళాడు. ప్రహరీ గోడ చుట్టూ తిరిగి వెళ్ళి బెడ్ రూం కిటికీకి చెవి ఆనించి రిక్కించి విన్నాడు. లోపల ఆడ మొగ పకపకలు, యికయికలు

వెళ్ళాడు. తన పిల్లల బ్లడ్‌టైప్‌లు మాత్రం తెలుసుకోవాలనుకున్నాడు. తన ఆఫీసుకు వచ్చాక మళ్ళీ రమణికి ఫోన్ చేశాడు.

"ఏమయ్యింది. ఇంటికి వెళ్ళి చూశావా? "

అడిగింది రమణి.

"చూశాను. నువ్వు చెప్పింది నిజమే"

"బాధగా వుందా? "

"లేదు"

"కోపంగా వుందా? "

"లేదు"

"మరి...? "

"ఏమీ అనిపించడం లేదు"

"అర్థం చేసుకోగలను. గుడ్. అది నీలోని పరిపక్వతకు నిదర్శనం. ఇప్పుడు నువ్వు నచ్చావు"

"మనం ఒకసారి మనసు విప్పి మాట్లాడుకుందాం. నీతో తీరికగా మాట్లాడి చాలా రోజులయ్యింది"

"సరే కానీ, నన్ను తాకకుండా మాట్లాడాలి"

"అదేం"

"అది అంతే. ఎందుకో ఇకనైనా పవిత్రంగా వుండాలనిపిస్తోంది. అది నాలోని పరిపక్వతో, విరక్తో, వయసు తెచ్చిన మార్పో అర్థం కావడం లేదు"

"మంచిది. నీ భావాల్ని నేను గౌరవిస్తాను. మళ్ళీ నీలో మార్పు వస్తే గనుక చెప్పు"

"సరే"

"ఒక చిన్న సలహా. నువ్వు పవిత్రంగా వుండదలుచుకుంటే మనసా వాచా కూడా వుండు. ఆల్రెడీ కొన్ని తప్పటడుగులు వేశావ్. మారావు. కాబట్టి నీలో ఆత్మశక్తి ఇంకా బాగా వుంటుంది"

"నీ సలహా ఆలోచించదగ్గదే"

"నువ్వు పద్ధతిగా ఉండదలుచుకున్నప్పుడు నిన్ను డిస్టర్బ్ చేయడం నాకు ఇష్టం లేదు. నేను నీతో రహస్యంగా మాట్లాడి ఉదాత్తంగా ఉండాలనుకుంటున్నా: నీ భావాలని కల్తీ చేయదలచుకోలేదు. మనం ఇక ఇలా దొంగ చాటుగా మాట్లాడుకోవాల్సిన అవసరం లేదనుకుంటా. మామూలు స్నేహానికే అంటే నీకు ఎంతో మంది వుండి వుంటారు. నేనే అవసరం లేదు కదా. ఏదయినా అవసరం వస్తే మాత్రం ఈ మిత్రుడు ఉన్నాడని మర్చిపోకు. సరేనా"

"సరే" అంది ఆర్తిగా

"అలా అని శారీరక సుఖాలు పొందే వారిపట్ల నాకు చులకన భావం వుందని కాదు. ఏ కారణం వల్లనన్నా మళ్ళీ మనసు మార్చుకుంటే నీ మీది నా గౌరవం ఈషణ్మాత్రం తగ్గదని గుర్తుంచుకో. పైకి నీతి కథలు, కబుర్లు చెబుతూ లోపల ఈ సుఖాలు పొందేవారంటేనే నాకు నచ్చదు. నువ్వేమంటావు? "

"నీవు గొప్పరసికుడివే అనుకున్నాను గానీ నీలో ఇన్నిన్ని భావాలు వున్నాయనుకోలేదు అంటున్నా"

"ఎక్కడా. మనం కలిసినప్పుడు నువ్వు నన్ను మాట్లాడనిస్తే కదా. ఎప్పుడూ..."

"చాల్లే. ఇక ఆపు" అని నవ్వుతూ అతడిని ఇక మాట్లాడనివ్వకుండా అడ్డుపడింది.

"సరే. ఇంకా ఏమయినా చెప్పు. ముందు ముందు మనం ఇలా తీరికగా మాట్లాడుకోమనుకుంటా"

"మీ పిల్లలకు బ్లడ్‌టెస్ట్‌లు చేయించే విషయమై ఏమయినా ఆలోచించావా"

"ఆలోచించాను"

"ఏమని" కుతూహలంగా అడిగింది రమణి

"ముందు చేయిద్దామనుకున్నాను గానీ ఇప్పుడు నీతో మాట్లాడిన తరువాత నాలో కూడా ఉదాత్తత పెరిగినట్లనిపిస్తున్నది. అలా అని నీ అంతగా మారతానని కాదు గానీ కొంత మార్పు వుంటుంది నాలో. నా భార్యను ఇంకా గొప్పగా ప్రేమించదలుచుకున్నాను. పిల్లల బ్లడ్ గ్రూప్స్

ఏవయినా కావచ్చు. బయోలాజికల్‌గా ఎవరయినా తండ్రి కావచ్చేమో కానీ వాళ్ళు నా పిల్లలే. లీగల్‌గా కూడా వాళ్ళ నా పిల్లలే అవుతారు. నాకు ఆ సందేహాలు అనవసరం. నా పిల్లలకు నేనేనా తండ్రిని అనే సందేహం వచ్చే దశ నుండి నేను దాటిపోయి నా భార్యకు పుట్టిన పిల్లలు నా

పిల్లలే అన్న సంస్కారం అబ్బింది నాకు".

"గురూ, నీలోని విశాల భావాలు చూస్తుంటే ముచ్చ టేస్తోంది. 'ఎవరు' నవలని అందరిలో ఈ పరిపక్వత కలిగించడం కోసమే రచయిత రాశాడా అనిపిస్తోంది. ఇప్పటి వరకూ ఇలాంటి విషయా లను చర్చించడానికే తటప టాయించే సమాజంలో ఇప్పుడు దాని గురించిన చర్చ సాధారణం అయిపోయి ప్రజలు కొన్ని కఠిన వాస్తవా లని సులభంగా జీర్ణం చేసుకో గలుగుతున్నారు".

"నువ్వనేది నిజమే".

"నీ భార్య లక్కీ ఫెలో గురూ. ఆమె వేరే వాళ్ళని ఇష్టపడుతున్నా నిన్నే ప్రేమి స్తుందని ఆశిస్తాను".

"అదే నా నమ్మకం కూడా. ఎవరితో ఎలాగన్నా ఉండనీ నన్ను ప్రేమగా చూసుకుంటే చాలు. నేనేమీ మడిగట్టుకొని వున్న వాణ్ణి కాదు గదా ఆమె మాత్రం పతివ్రతగా ఉండా లని కోరుకోవడానికి. చాలా సేపటినుండి మాట్లాడుకుం టున్నాం. ఇక ఉంటాను. ఇంటికి మల్లె పూలు కొనుక్కె ళ్ళాలి. ఎప్పుడో పెళ్ళయిన కొత్తలో తీసుకు వెళుతుండేవా డిని. ఆ తరువాత తీరిక లేక ఎప్పుడూ తీసుకు వెళ్ళడానికి కుదరలేదు. ఇప్పుడు ఆలోచిస్తే డబ్బు యావలో పడి ఎన్నో సున్నితమయిన భావాలని రోజూ పోగొట్టుకుంటున్నామా అనిపి



స్తోంది".

"నిజమే గురూ. నా పేరిట ఇంకో మూర కొనుక్కెళ్ళు. నాకూ ఆలస్యమవుతోంది. మా వారు అలసిపోయి వస్తారు. ఆయనకు వేడి వేడి పకోడీలంటే ఇష్టం. తనకి ఇష్టమే అని తెలిసినా ఎప్పుడో కానీ చేయను తన మీద కోపంతో. ఇకనుండీ అప్పుడప్పుడు చేసిపెట్టా లనుకుంటున్నా. ఇక ఉంటాను" అలసిపో యిన అన్న పదాన్ని వత్తి పలుకుతూ అని ఫోన్ పెట్టేసింది.

గురూకి మాత్రం ఆ పదం మామూలు గానే వినిపించింది. అది అతని భావ స్రవం తిలో వచ్చిన మార్పు వల్ల కావచ్చు.

బదరీ నుండి ఫోన్ వచ్చింది శేషాచలా నికి. "సార్. ఎబి" అన్నాడు క్లుప్తంగా.

19



"సరే. ఇంక ఎవరి బ్లడ్ గ్రూప్స్ తెలుసు కోవాల్సిన అవసరం లేదులే. మళ్ళీ అవసర మయినప్పుడు పిలుస్తాను. నీ ఈ కష్టానికి గాను రెండు మూడు రోజుల్లో డబ్బు నీ ఎక్కౌంట్‌లో ఉంటుంది. సరిపోకపోతే చెప్పు"

"అలాగే సార్. ఒక విషయం".

"చెప్పు".

"మీరు అది కనుక్కోమనలేదు గానీ నాకది తెలిసింది".

"ఏమిటది? "

"రక్తదాన శిబిరం ఏర్పాటు చేసి మేడం రక్తం స్వీకరించాం కానీ ఆ రక్తం ఇతరులకి పనికి రాదు".

"ఎందుకని? "

"హెచ్ ఐ వి పాజిటివ్".

"నిజమా" నిర్ఘాంతపోయాడు శేషాచలం.

"అవును సార్"

"మరి ఆ లక్షణాలేమీ కనపడటం లేదే"

"మీకు తెలవదా సార్. అది ఇంకా ఎయిడ్స్‌లా మారి ఉండకపోవచ్చు".

"అవును కదూ. మరచే పోయాను. నువ్వు చెప్పిన వార్త విని మెదడు పని చేయడం మానేసింది".

"ఇక ఉంటాను సార్"

"మంచిది".

ఫోన్ పెట్టేసిన తరువాత శేషాచలంకి మనసంతా శూన్యమయింది. కుముదినికి హెచ్ ఐ వి ఉంటే ఫ్యామిలీ డాక్టర్ ఎందుకు చెప్పలేదు? బహుశా కుముది నియే చెప్పవద్దని చెప్పి ట్రీట్మెంట్ తీసు కుంటూ ఉండి ఉంటుంది. అటువంటప్పుడు రక్తదాన శిబిరాలకి ఎందుకు వెళ్లింది? అమాయకత్వమా లేక అతితెలివా? ఫ్యామిలీ డాక్టర్‌తో మాట్లాడి కన్ఫర్మ్ చేసు కోవాలి అనుకున్నాడు. వెంటనే మంత్రివర్గ సమావేశం ఉండటంతో ఆ భావాల్ని మన సులో దాచుకొని పాల్గొన్నాడు. అందులో 'ఎవరు' నవల మీద కొద్ది రోజులలో వచ్చే కోర్టు విచారణ కూడా చర్చకు వచ్చింది. న్యాయశాఖ అభిప్రాయాన్ని రాజారత్నం విమర్శించాడు. 'ఎవరు' నవలని నిషేధించా లని పట్టుపట్టాడు. మిగతా మంత్రులంతా దాదాపుగా తటస్థంగా ఉండటంతో అందరూ ముఖ్యమంత్రి అభిప్రాయం కోసం ఆయన వైపు చూశారు.

"మీరు ఎందుకు నిషేధించాలని పట్టుబడు తున్నారు" సూటిగా రాజరత్నాన్ని అడిగాడు ముఖ్యమంత్రి. మనసులో అతడి మీద రగిలి పోతూ ఉన్నా, సంభాళించుకుంటూ

"దానివల్ల ఎప్పుడో చేసిన పొరపాట్లు ఇప్పుడు బయట పడి కుటుంబాల్లో అశాంతి చెలరేగుతోంది."

"విజయకుమార్ గారూ. ఆ నవల వల్ల

## 'పెంపుడు' రోగాలు

పక్షులు, పిల్లులు, కుక్కల్ని ఎక్కువగా ముద్దుకోసం పెంచుకుంటుంటాం. ఇవి మనకి ఏవిధంగా హాని చేయవనుకుంటాం. కాని అవీ మనకి వ్యాధుల్ని అంటించడంలో ముందేఉంటాయి.

లవ్‌బర్డ్స్, పావురాలు, చిలకల్ని సాధారణంగా ఇళ్ళలో పెంచుకుంటాం. అయితే ఎండిపోయిన పక్షుల రెట్ట (మలం) నుండి వచ్చే వాసన పీల్చడం వల్ల, పక్షుల ఈకల మీద పడి వ్యాపించే ధూళివల్ల 'సిట్టాకోసిస్' అనే వ్యాధి వస్తుంది. ఈ వ్యాధిగ్రస్తుల్లో ఫ్లూ జ్వరపు లక్షణాలుంటాయి. ఎప్పటికప్పుడు పక్షుల పంజరాల్ని పరిశుభ్రంగా వుంచడం, ఎండిపోక ముందే పక్షుల మలాన్ని తీసి, శుభ్రపరచడం వలన 'సిట్టాకోసిస్'ను అరికట్ట వచ్చు.



పిల్లుల పళ్ళు చాలా పదునుగా, పలచగా వుండటం వల్ల అది కరిస్తే మనకి లోతుగా గాయాలయ్యే ప్రమాదముంది. దీనివల్ల ఇన్ఫెక్షన్స్ వచ్చే అవకాశముంది. బర్టోనెల్లా హెన్‌సెలే అనే బాక్టీరియా వల్ల క్యాట్ స్క్రాచ్ ఫీవర్ వస్తుంది. జ్వరం, లింఫ్ నోడ్ స్వెల్లింగ్, కంజెంక్టివైటిస్ వంటివి కూడ వస్తాయి. యాంటీ బయాటిక్స్‌తో వీటిని అరికట్టవచ్చు.

కుక్కలు కరిస్తే ఏం జరుగుతుందో, ఏం ట్రీట్‌మెంట్ ఇస్తారో తెల్సిందే. కుక్కలు విసర్జించే మలాన్ని తొక్కితే... హుక్‌వార్మ్ మన దేహంలో చేరిపోతాయి. కుక్కలు, 'కెన్నల్ కాఫ్'ని మనకి త్వరగా అంటిస్తాయి.

లా అండ్ ఆర్డర్‌కు విఘాతం కలుగుతున్నట్లుగా మీకేమయినా తెలుసా" అని మంత్రిని ప్రశ్నించాడు.

"అక్కడక్కడ పుకార్లు ఉన్నాయి కానీ ఎవరూ ఫిర్యాదుతో ముందుకు రావడం లేదు".

"ఇటువంటి విషయాల్ని ఎవరు బయటికి వచ్చి ఫిర్యాదు చేస్తారండీ. లోపల లోపల సంసారాల్లో యుద్ధాలే జరుగుతున్నాయి". ఆవేశంతో అన్నాడు రాజారత్నం.

"తప్పులు చేసిన వాళ్ళు ఫలితం అనుభవిస్తున్నారు. తప్పులు చేసిన వాళ్లది తప్పంటారా లేక తప్పు వివరించి చెప్పిన వాళ్లదా? "

"ఏదో చిన్నప్పుడు తెలిసీ తెలియని వయసులో, ఆకర్షణతో చేసిన వాటికి ఇప్పుడు గొడవ పడాలా? "

"చిన్నప్పుడు తెలిసి తెలవక చేయడమా? పెళ్లయి సంసారాలు చేస్తున్నవారు చేసిన తప్పుల్ని చిన్న పిల్లలాట అని వెనకేసుకొస్తున్నారేమిటి? "

"అంటే, నేననేది అది కాదు. జనాల్లో అశాంతి ఎందుకని"

"బయటపడుతుందేమోనన్న భయంతో నన్నా ప్రజలు బుద్ధిగా ఉంటారు కదా" అప్పటిదాకా మౌనంగా ఉన్న రవాణా శాఖా మంత్రి అప్పారావు అన్నాడు.

"మీరు కోరిన ప్రకారం నవలని నిషేధించాల్సి వస్తే ముందుగా ఆ బ్లడ్ గ్రూప్ సైన్స్‌నే నిషేధించడం మంచిది. ఆ రచయిత కొత్త విషయాలేమీ కనిపెట్టలేదు కదా. ఎప్పటినుండో ఉన్న విజ్ఞాన శాస్త్రాన్ని పాఠకులకు

వివరంగా చెప్పాడు. ఇప్పుడు చెప్పండి రాజా రత్నం గారూ. ఆ తప్పు సైన్స్‌దా లేక రచయితదా? సైన్స్‌ని ఏ ముఖం పెట్టుకొని తప్పు అనగలం. మనది డెమొక్రసీ. మనకు భావ



ప్రకటన స్వేచ్ఛ ఉంది. విషయం ఎలాగూ కోర్టులో ఉంది. కోర్టు తీర్పుని బట్టి నడుచుకుందాం" అంటూ దాని మీద చర్చని ముగించాడు ముఖ్యమంత్రి.

* * *

'ఎవరు' నవలను పట్టుకురావడం మరచిపోవడంతో రాజేష్, హొయసల, పరిమళల ఉత్సాహం చల్లబడింది. ఆటో తీసుకొని గబగబా ఇంటికి వచ్చారు. 'ఎవరు' నవల పరిమళ ఎక్కడ పెట్టిందో కానీ దొరకడం లేదు. కొద్దిసేపు వెతికిన తరువాత పక్కింటి పరమేశ్వరి ఎప్పుడో పట్టుకెళ్ళిన విషయం గుర్తొచ్చి అదే విషయం రాజేష్‌కి, హొయసలకి చెప్పింది.

"వెంటనే వెళ్ళి తీసుకురా ప్లీజ్" అన్నాడు రాజేష్.

పరిమళ గబగబా పరమేశ్వరి ఇంటికి వెళ్ళింది. కొద్ది సేపట్లోనే తిరిగి వచ్చి "వాళ్ళు లేరు. ఎక్కడికి వెళ్లారో తెలియదు. ఎప్పుడు వస్తారో కూడా తెలియదు" అంది.

రాజేష్ అసంతృప్తిగా "అసలు నేనే ఆ కాంబినేషన్లు రాసుకొని వస్తే బావుండేది. మరచిపోయాను" అన్నాడు.



"పర్వాలేదు లెండి. మనం బుక్ షాప్‌లో కొందాం" అంది హాయసల.

మళ్ళీ అందరు ఆటో మాట్లాడుకుని రోడ్డు మీద పడ్డారు. రెండు బుక్ షాపుల్లో అడిగినా అవుట్ ఆఫ్ స్టాక్ అన్నారు. మూడో షాప్ అతను కూడా అదే అని "బ్లాక్‌లో అయితే దొరుకుతుంది బ్రదర్" అన్నాడు గుసగుసగా.

"ఆ నవలకు అంత డిమాండ్ ఉందా" ఆశ్చర్యపడ్డాడు రాజేష్.

"ఆ నవల్ని నిషేధించమనే డిమాండ్ ఎక్కువయిన కొద్దీ సేల్స్ బాగా పెరుగుతున్నాయి బ్రదర్. ఎక్కడ చూసినా అందరూ అపరాధ పరిశోధకుల్లా ఎవరు ఎవరికి పుట్టారో తెలుసుకోవాలనే ప్రయత్నాలే. ఈ మధ్య బ్లడ్ టెస్టులు చేయించుకున్న వారం

దరూ ఆ రిజల్ట్ మరొకరికి తెలియకుండా ఆ రిపోర్ట్‌లు చూసి వెంటనే చించేస్తున్నారు. మీరేంటి బ్రదర్ ఆ పుస్తకం కోసం అంతగా ఆరాటపడుతున్నారు. మీదీ డౌట్ కేసేనా? " అన్నాడు షాపతను కులాసాగా నవ్వుతూ.

"దాదాపు అలాంటిదే గానీ ఆ పుస్తకం ఎంతకిస్తావో చెప్పు? "

"అయిదొందలు"

"అంత కాదు గానీ మరో మాట చెప్పు"

"నాలుగొందల యాభై"

"మరో మాట చెప్పు"

"నాలుగు వందలు. ఇది ఫైనల్"

"అంతకాదు గానీ మూడొందల యాభై వుంచుకో" అని కుదర్దంటున్నా బలవంతంగా అతని జేబులో కుక్కాడు రాజేష్

చేసేదేమి లేక ఇక ఆ నవల రాజేష్ చేతికిచ్చాడు షాపతను. పరుగున ఆ బుక్ తీసుకొని ఆటో దగ్గరికి వచ్చాడు.

"ఇంత లేట్ అయ్యిందేం? " హొయసల అడిగింది.

"బ్లాక్‌లో అయితే గానీ దొరకలేదు"

"అంత డిమాండా"

"అవును మరి!"

"ఇంటికి వెళదామా" అంది పరిమళ

ఆటోని ఇంటికి పోనివ్వమని చెప్పాడు రాజేష్. ఇంట్లోకి వెళ్ళగానే కూర్చొని గబగబా పేజీలు తిప్పాడు రాజేష్. కావాల్సిన సమాచారం అందులో త్వరగా దొరకడం లేదు.

"అబ్బా తొందరగా దొరకడంలేదు. ఈ కాంబినేషన్లు అన్నీ ఒక దగ్గర పట్టికలా ఇచ్చివుంటే బావుండేవి కదా"

"అలా అయితే అందరూ ఈ పట్టిక ఒకటే చదువుతారు గానీ పుస్తకం చదవరనేమో" అంది పరిమళ

"ఏ, ఓ కాంబినేషన్ దొరికింది. వాళ్ళకి ఏ, ఓ గ్రూప్ పిల్లలు మాత్రమే పుడతారట" అన్నాడు సంతోషంగా

"అంటే సుందరం పాప తండ్రి కాదన్న మాట. అంటే ఇక మీరే" అంది హర్షాతిరేకంతో హొయసల.

పరిమళ చిరునవ్వు నవ్వింది.

"కాదు" అన్నాడు రాజేష్ గాభరాగా పుస్తకంలో నుండి తల ఎత్తి.

"మరి"? రాజేష్‌ని విచిత్రంగా చూస్తూ అడిగింది హొయసల.

"ఓ+ఓ=ఓ అంతే. వాళ్లకి బి గ్రూప్ పిల్లలు పుట్టడానికి అవకాశం లేదు"

అది విన్న పరిమళకు గుండెల్లో రాయిపడ్డట్లని పించింది.

హొయసల ఉలిక్కిపడింది "ఏమిటి మీరంటున్నది? సరిగ్గా మరోసారి చూడండి"

"సరిగ్గానే చూశాను. ఇదిగో నువ్వేచూడు" అని చూపించాడు.

హొయసల అది చదివి నిట్టూర్చి "ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది" అంది

కొన్ని క్షణాలు నిశ్శబ్దం రాజ్యమేలింది. ఎవరి ఆలోచనల్లో వారున్నారు.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ "పొరపాటు ఎక్కడో కాదు. నా దగ్గరే జరిగింది" పరిమళ నెమ్మదిగా అంది నేల చూపులు చూస్తూ

"ఏమిటది" రాజేష్, హొయసల ఆతృతగా ముందుకు వంగుతూ ఏక కాలంలో అన్నారు.

"పాపకి తండ్రి సుందరం గానీ, నువ్వు గానీ కాకుండా వేరొకరు అయ్యే అవకాశం ఉంది" అని నెమ్మదిగా అంది తలవంచుకునే.

"వేరొకరా!" అన్నాడు రాజేష్ నమ్మలేనట్లు.

"అవును. ఆ రోజుల్లో పిల్లలు పుట్టడం కోసం నేను వేసిన తప్పటడుగుల్లో మరొకరికి భాగస్వామ్యం ఉంది. అప్పట్లో పిల్లలు కావాలనే ఆరాటం అటువంటిది"

హొయసల ఇదంతా ఆశ్చర్యంగా

వింటోంది. రాజేష్ ఇంకా పరిమళ చెప్పిన విషయాన్ని నమ్మలేకుండా వున్నాడు. పాప తన పాపే అవుతుందని ఆశించిన అతడికి పరిమళ చెప్పిన విషయం శరాఘాతంలా పరిణమించింది.

నెమ్మదిగా మనసు కూడదీసుకుని "అతనెవరో తెలుసుకోవచ్చా? " అనడిగాడు

పరిమళ మౌనమే సమాధానమయింది.

"సరే" అన్నాడు, కొద్దిసేపు పరిమళ జవాబు చెబుతుందేమో అని ఎదురు చూసి ఇక తను పాపకి తండ్రి కానప్పుడు వేరే ఎవరయితేనేం అనుకున్నాడు.

"ఎవరి వల్లనయినా కావచ్చు కానీ చక్కని పాపని కన్నారు" అంది హొయసల వాతావరణాన్ని తేలిక చేయడం కోసం ప్రయత్నిస్తూ

"పాప తండ్రి కూడా పోయారు"

"అరెరే. ఎలా జరిగిందది? " అంది హొయసల జాలిగా

"ఏక్సిడెంట్లో పోయారు. మూడేళ్ళ క్రితం"

"ఏక్సిడెంట్లోనా... మూడేళ్ళ క్రితమా... సుందరం కూడా ఆ సంవత్సరమే ఏక్సిడెంట్లో పోయాడన్నావు కదా" రాజేష్ అనుమానంగా అన్నాడు

"అవును. ఇద్దరూ ఒకేసారి పోయారు"

"ఒకేసారా!" నమ్మలేనట్లు అడిగింది హొయసల.

"అవును. మా వారితో పాటు ఏక్సిడెంట్లో ఇంకొకరు కూడా చనిపోయారని చెప్పాను కదా. ఆయనే ఈయన. మా ఆయనకు క్లోజ్ ఫ్రెండ్. ఇద్దరూ కలిసి ఒక పార్టీకి వెళ్ళి బాగా తాగి తిరిగి వస్తుండగా స్కూటర్ అదుపు తప్పి లారీని గుద్దేసింది"

"అరెరే పాపం. పాప ఇద్దరి తండ్రులూ ఒకేసారి పోయారు" అప్రయత్నంగా అనేసింది హొయసల. ఆమె స్వరంలో జాలి ధ్వనించింది.

అవునన్నట్లుగా పరిమళ తల ఊపింది. అంత చక్కటి పాపకు తండ్రి లేకపోవడం రాజేష్‌ని కదిలించింది. పాపకి తను తండ్రి కాలేకపోయినందుకు ఎంతో అసంతృప్తిగా కూడా వుంది అతడికి.

20



శేషాచలానికి అంతా అయోమయంగా ఉంది. ఆ రెండు వార్తలని ఎలా జీర్ణం చేసుకోవాలో అర్థం కాలేదు. ఫామిలీ డాక్టర్ని వాకబు చేయగా భార్యకు ఎయిడ్స్ వున్న మాట నిజమేనని, ట్రీట్మెంట్ తీసుకుంటోందని తేలింది. అలాంటప్పుడు రక్తదాన శిబిరంలో కుముదిని ఎందుకు రక్తం ఇచ్చిందో అర్థం కాలేదు. అది అమాయకత్వమయినా కావచ్చు లేదా అతితెలివి అయినా కావచ్చు. భార్యతో ఎయిడ్స్ విషయం ఏమీ ప్రస్తావించదలుచుకోలేదు. ఆమెతో వున్న మనస్పర్థల వల్ల సంసార సుఖానికి దూరమయి దాదాపు పదేళ్ళు కావస్తోంది. అలా భార్యతో కలవకపోవడమే తనకు ఎయిడ్స్ రాకుండా రక్షించింది అనుకున్నాడు. భార్యతో ఇంకా జాగ్రత్తగా వుండాలనుకున్నాడు.

భార్యకి ఎయిడ్స్ ఉందని తెలిశాక తన పిల్లలు ఎవరి పిల్లలు అనే విషయం తెలుసుకోవడం అంత ప్రధానమయిన విషయంగా అనిపించలేదు. తన పిల్లలనుకుంటున్న వారు తన పిల్లలు కాదని తెలవడం, భార్యకి ఎయిడ్స్ వుందని తెలవడం అతనిలో కొంత వైరాగ్యాన్ని, పరిపక్వతనీ కలిగించాయి. తన పిల్లలు బయోలాజికల్‌గా ఎవరి పిల్లలు అనే విషయం పట్టించుకోలేనంతగా మనసు ఎదిగింది. ఇక ఆ




ఆలోచనలు వదిలేసి పరిపాలన మీద ఇంకా బాగా శ్రద్ధ పెట్టాలని, ప్రజలందరినీ తన కన్నబిడ్డలుగా చూసుకోవాలని నిర్ణయానికి వచ్చాడు. ప్రజలకి పునరంకితం కావాలని తీర్మానించుకున్నాడు.

* * *

లక్ష్యకు రోజూ అసహనంగా వుంటోంది. తన జన్మ రహస్యం అర్థంకాక ఒకవేళ మమ్మీదే పొరపాటు అయినా నాన్నగారు అర్థం చేసుకోగలరనే ధైర్యం వుంది. అందుకని ఎలాగోలా నాన్నగారితో మాట్లాడాలని నిర్ణయించుకుంది. ఒకనాడు వినిత పేరంటానికి వెళ్ళాక నెమ్మదిగా నాన్నతో ఆ విషయం కదిపింది.

"నాన్నగారూ. మీతో ఒక విషయం చెప్పాలని అన్నాను కదా"

కాఫీ చివరి గుటక వేసి కప్పు కిందపెట్టుతూ "అవునమ్మా. చెప్పావు. ఎప్పుడు చెబుతావా అని చూస్తున్నాను"

"ఇది నా గురించిన విషయం కాదు గానీ ఈ విషయంలో ఏమన్నా పొరపాటు వుందో లేదో నాకేమీ అర్థం కావడం లేదు. ఒకవేళ పొరపాటు వున్నా మీరు పెద్దమనసుతో అర్థం చేసుకోవాలి"

"సరే చెప్పమ్మా" అన్నాడు కూతురు చెప్పేది ఏమయివుంటుందో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ.

"మనం ఆ మధ్య 'ఎవరు' నవల గురించి మాట్లాడుకున్నాం గుర్తుంది కదా"

"అవును. గుర్తుంది".

"తల్లిదండ్రుల ద్వారా వచ్చే పిల్లల బ్లడ్ గ్రూప్స్ గురించి కూడా మనం మాట్లాడుకున్నాం".

"అవును" విషయం ఎటు పోతోందో చూచాయగా గ్రహించాడు యశస్వి.

"ఆ ప్రకారం చూస్తే మన బ్లడ్ గ్రూపులు సరిగ్గా లేవు నాన్నగారూ" అంది బేలగా నేల చూపులు చూస్తూ.

"అదా నీ సందేహం ఇన్నాళ్లనుండి? " అని చిరునవ్వుతో అడిగాడు.

తండ్రికి ఆ ప్రశ్నతో కోపం వస్తుందేమో అనుకున్న లక్ష్యకి అతడి నవ్వు వినిపించేసరికి ఆశ్చర్యంగా తల ఎత్తి చూసింది.

లక్ష్య భుజం మీద చేయివేసి తట్టుతూ "నీ అనుమానం నిజమే నమ్మా. మన బ్లడ్ గ్రూప్స్ కలవక పోవడంలో ఆశ్చర్యం లేదు" అన్నాడు.

తండ్రి అలా ఉల్లాసంగా ఉండటం చూసి కాస్త ధైర్యం తెచ్చుకొని తను కూడా చిరునవ్వు నవ్వుతూ విషయం చెప్పండన్నట్లుగా చూసింది. అమ్మ పొరపాటు నాన్నగారికి ఏ విధంగానన్నా తెలుసేమో? లేక నేను టెస్ట్ ట్యూబ్ బేబీ కాదు కదా. తండ్రి ఏం

**తను కూడా చిరునవ్వు నవ్వుతూ విషయం చెప్పండన్నట్లుగా చూసింది. అమ్మ పొరపాటు నాన్నగారికి ఏ విధంగానన్నా తెలుసేమో? లేక నేను టెస్ట్ ట్యూబ్ బేబీ కాదు కదా. తండ్రి ఏం చెప్పినా జీర్ణించుకోవడానికి మనసు సంసిద్ధం చేసుకుంది**

చెప్పినా జీర్ణించుకోవడానికి మనసును సంసిద్ధం చేసుకుంది.

"నీతో ఈ విషయం ఇప్పటిదాకా దాచిపెట్టామమ్మా. అలా దాచిపెట్టడం పొరపాటో కాదో తెలీదు గానీ ఎంతో అవసరం వస్తే తప్ప ఆ విషయం నీకు చెప్పదలుచుకోలేదు".

"చెప్పండి నాన్నగారూ" మనసుని బాగా సన్నద్ధం చేసుకుంటూ అంది.

"మేం నిన్నొక అనాథ శరణాలయం నుండి తెచ్చుకున్నాం".

కొన్ని క్షణాలు నిశ్శబ్దం తాండవించింది అక్కడ. ఆ తరువాత నెమ్మదిగా లక్ష్య కళ్ల నుండి ధారాపాతంగా కన్నీళ్ళు.

కూతురిలో ఆ మాత్రం షాక్ ఊహించిందే అయినందున అది చూస్తూ కూడా మిగతా వివరాలు చెప్పడం మొదలెట్టాడు యశస్వి.

"నీ నిజమయిన తల్లిదండ్రులు ఎవరో అనాథ శరణాలయం వారికి కూడా తెలవదట. ఎవరో నిన్ను ఆ శరణాలయం గేట్ ముందట వదిలిపెట్టి వెళ్ళారట"

లక్ష్య కళ్ళు ధారాపాతంగా వర్షిస్తూనే ఉన్నాయి. తండ్రి భుజం మీద తల వాల్చి "నాన్నగారూ" అని సోలిపోయింది. యశస్వి కూతురిని అనునయిస్తూ భుజం మీద ప్రేమగా తట్టాడు.

* * *

రాజు వేసిన పిల్ విచారణకు వచ్చింది ఆ రోజు. విచారణలో ఏం తెలుతుందా అన్న ఆసక్తితో చాలా మంది ప్రజలూ, రిపోర్టర్లు రావడంతో కోర్టు హాలంతా కిక్కిరిసి ఉంది. రేవన్ కూడా వచ్చాడు ఆ విషయాన్ని కవర్ చేయడానికి. రేవన్ భార్య మదాలస కూడా వచ్చి ఒక మూల కూర్చుంది. ఈ విచారణకు పరమపిత, పరమానంద, వరలక్ష్మిలు కూడా హాజరయ్యారు. ఏం జరుగుతుందో ప్రత్యక్షంగా తెలుసుకునేందుకోసం వాదోపవాదాలు ఘాటుగా జరిగాయి. జడ్జి రాధాకృష్ణకి ఇరు వైపుల వాదనలలో పస ఉన్నట్లే అనిపించింది.

## మీకు కాదు... ఆయనకు

శ్రీనివాస అయ్యర్ చాలా గొప్ప మేధావి. సీటులో కూర్చునే ముందే కేసుకు సంబంధించి ఆయన ఓ నిర్ణయానికి వచ్చేసేవాడు. ఎందుకంటే ముందే కేసును తనకు నచ్చినపద్ధతిలో స్టడీచేసుకుని వచ్చేవాడు. ఓ సారి అయ్యర్, కూట్స్ ట్రోటర్‌ల బెంచ్ ముందు ప్రకాశం వాదిస్తున్నారు. తను అప్పటికే జడ్జిమెంట్ విషయంలో ఓ నిర్ణయానికి వచ్చేశానన్న విషయం ప్రకాశానికి తెలియచేయాలని అయ్యర్ ఏదేదో ప్రశ్నలు వేసి ఆయన వాదనలను అడ్డుకుంటున్నాడు. కొద్దిసేపు ఈ హింస భరించిన ప్రకాశం ఇక ఉండబట్టలేక,

'సర్.. ఈ కేసులో నా వాదనలను నేను మీకు విన్పించడంలేదు. ఎందుకంటే మీరిప్పటికే ఓ నిర్ణయానికి వచ్చేసినట్లు అన్పిస్తోంది. ఇప్పుడే నేను విన్పించేది రెండో జడ్జిగారి కోసం.. దయచేసి గ్రహించండి..' అన్నారు.

దాంతో అయ్యర్ మౌనశిల్పమే అయిపోయాడు.



అందరి వాదనలు కూలంకషంగా విన్న తరువాత "పెద్దగా శాంతి భద్రతల సమస్య లేదు. కాబట్టి 'ఎవరు' నవలని ఇప్పటికిప్పుడు నిషేధించాల్సిన అవసరం లేదు. 'ఎవరు' నవల మీద ప్రజా ప్రతినిధులే కూలంకషంగా శాసనసభలో చర్చించి ఒక నిర్ణయం తీసుకుంటే బావుంటుంది" అని తీర్పునిచ్చారు.

కోర్టు ప్రాంగణంలోనే విలేఖరులు తీర్పు మీద పరమ పిత, పరమహంస, వరలక్ష్మి, సత్యశ్రీ, రాజు మొదలగు వారి అభిప్రాయాలను సేకరించారు. రేవన్ తన అత్తగారయిన వరలక్ష్మి అభిప్రాయాన్ని ప్రత్యేకంగా తీసుకున్నాడు. ఆమె చిరునవ్వుతో తన అభిప్రాయం సెలవిచ్చింది. ఎవరికి వారే గెలుపు తమ పక్షం వారిదేనన్నట్లుగా మాట్లాడారు.

ఆ విధంగా ఎవరు నవల ముఖ్యమంత్రి శేషాచలం గొంతులో పచ్చి వెలక్కాయ మాదిరిగా పడింది.

* * *

పరిమళ తమకు చూపించిన గదిలో విశ్రమించారు హొయసల, రాజేష్.

"ఏమండీ, ఇలా జరిగినందుకు మీకు బాధగా ఉందా?" అనునయంగా అంది హొయసల.

రాజేష్ తల తిప్పి ఆమె వైపు చూసి "కొంత అసంతృప్తిగానే ఉందనుకో కానీ దానికంటె ముఖ్యంగా అంత చక్కటి అమ్మాయికి ఏ విధంగానూ తండ్రి లేకపోవడమే జాలిగా అనిపిస్తోంది" అన్నాడు.

"అవునండీ. మీరు చెప్పింది నిజం. మనకు ఇద్దరు కొడుకులున్నారు. వాళ్లకి మనం ఉన్నాం. కాబట్టి విచారం లేదు. కానీ, ఆ పాపదే తండ్రి లేని జీవితమైపోయింది"

"ప్చ్. మనమేం చేయగలం. ఇలా జాలిపడటం తప్ప"

"నాకో ఆలోచన వస్తోంది" సాలోచనగా అంది హొయసల.

"ఏమిటది" ఆసక్తిగా అడిగాడు

"మీరే ఆ పాపని తండ్రిలా సాకండి. తల్లి ఎవరయినా ఫర్వాలేదు తండ్రి మీరయితే చాలు మన పిల్లలుగా భావిద్దామని ఇప్పటి వరకూ అనుకున్నాం. మనం మరికొంత ఉదారత్వాన్ని అలవరచుకోవాలి. తల్లీ తండ్రీ ఎవరైతేనేం ఒక చక్కటి పాపని మన కన్న బిడ్డలా ప్రేమించలేమా చెప్పండి. ఆ పాపకి ఒక తండ్రి, తోడబుట్టిన వాళ్ళూ అవసరం. అందుకు మీరు, మన పిల్లలు ఉన్నారు. ఏమంటారు"

సాలోచనగా ఆమెవంక చూశాడు రాజేష్. తర్వాత తల దిండు మీద ఆనించి కళ్లు మూసుకున్నాడు. ఏదో ఆలోచిస్తున్నట్లుగా. భర్త మౌనం విచిత్రంగా అన్పించింది హొయసలకు.

"ఏమంటారు" రెట్టిస్తున్నట్లు అడిగింది.

రాజేష్ నెమ్మదిగా కళ్లు తెరచి "నువ్వు చెప్పింది కరెక్ట్. ఇక నుండి శబ్ద పరిమళ బిడ్డనే కాదు, మన బిడ్డ కూడా" అన్నాడు సంతృప్తిగా భార్యను దగ్గరగా పొదువుకుంటూ.

21



కోర్టు తీర్పు కారణంగా ఎవరు నవల మళ్ళీ మంత్రి వర్గం ఎజెండాకి వచ్చింది. ఎవరు నవలని నిషేధిస్తూ చట్టం చేయాలని సమావేశంలో సమాచార మంత్రి రాజారత్నం ప్రతిపాదించాడు. మంత్రుల్లో కొంతమంది అతనికి మద్దతు పలికినా చాలా మంది మంత్రులు మౌనం వహించారు. కొద్దిమంది మంత్రులు ఆ నవల మీద నిషేధం తీసుకురావాల్సినంత అవసరం లేదని తమ మునుపటి అభి

## కనులు లేవని కలత పడవలదు

"కనుపాప కరవైన కనులెందుకూ..." అని అంధత్వంతో బాధపడే వారినెవరిని కదిలించినా అంటారు. ఇహ ఆ అవసరం లేదంటున్నారు జపాన్ శాస్త్రవేత్తలు. "సేకరించిన కార్నియల్ సెల్స్ నుండి కార్నియా బాహ్యపొరని రెండు వారాల్లో కల్చర్ ద్వారా వృద్ధి పరచవచ్చు. తద్వారా కంటి చూపు తెప్పించవచ్చు" అంటున్నారు. కార్నియాను పెట్రీడిష్‌లో ఇంక్యుబేట్ చేస్తారట. తర్వాత చాలా సులభంగా దాని నుండి బాహ్యపొరని తొలగించి, దానిని కాంటాక్టు లెన్సులాగా చిన్న కుట్టు కూడా లేకుండా కంటిమీద అమరుస్తారట. ఐదు నుండి పది నిమిషాల్లో కార్నియా కంటితో కలిసిపోయి... చూపు వస్తుందట. ఇలా ఒక దాత నుండి సేకరించిన కార్నియల్ సెల్స్ నుండి వందలాది అంధులకు చూపు సంప్రాప్తించేలా చెయ్యొచ్చునట. ఇలా చెయ్యటం వలన శాశ్వతంగా అంధత్వానికి గుడ్‌బై చెప్పొచ్చుట.

మరి "కల నిజమాయెగా..." అని అంధత్వంతో బాధపడే వారంతా పాట పాడుకునేరోజు దగ్గర్లోనే ఉంది.!



ప్రాయాన్నే వెలిబుచ్చారు.

మంత్రి జయరాం "ఎవరు నవలను నిషేధించడం ద్వారా దానికి అనవసరంగా అధిక ప్రాధాన్యం ఇస్తున్నట్లవుతుంది. సేల్స్ పెరుగుతాయి. చదవాలనుకునేవారు బ్లాక్ మార్కెట్‌లోనయినా దాన్ని కొంటారు" అన్నాడు.

దానికి రాజారత్నం అభ్యంతరం చెప్పాడు. "ఆ నవలని నిషేధించడం ద్వారా మన ప్రభుత్వాభిప్రాయం ఏమిటో ప్రజలకి తెలుస్తుంది. ఎవరో కొద్ది మంది బ్లాక్ మార్కెట్‌లో చదువుతారని మనం దానిని నిషేధించకుండా వుంటే ప్రజలకి, రచయితలకి మనం తప్పుడు సంకేతాలు ఇచ్చిన వారమవుతాము"

"ఆ నవలని నిషేధించాల్సినంత తీవ్రమయిన విషయాలు అందులో ఏం వున్నాయో నాకు అర్థం కావడంలేదు రాజారత్నం గారూ' ' అన్నాడు సహాయ మంత్రి ఈశ్వరయ్య.

"బయటకి రావడం లేదు కానీ ఎన్నో కాపురాల్లో ఆ నవల అశాంతిని రేకెత్తిస్తోంది. ఎంతో మంది అబలలు నిస్సహాయంగా వుండిపోతున్నారు. చాలామంది కుర్రాళ్ళు డిటెక్టివ్‌ల్లా మిగతా వారి బ్లడ్ గ్రూప్‌లు తెలుసుకొని పెళ్లయిన ఆడవారిని వేధించడానికి ప్రయత్నిస్తున్నారు. మెడికల్ ల్యాబ్‌లు కొన్ని తమ దగ్గరకు వచ్చిన వారి బ్లడ్‌టైప్ వివరాలను దుర్వినియోగ పరచి మహిళలను వేధిస్తున్నట్లు వార్తలొస్తున్నాయి"

"ఆ విషయాలన్నీ త్వరలోనే చల్లబడతాయి. బ్లడ్ గ్రూపుల మీద వచ్చిన అసలయిన విజ్ఞానమే ప్రజలకి గుర్తుంటుంది. ఇది వరకు అటువంటి విషయాలను చర్చించడానికే వెనకడుగు వేసే ప్రజలు ఇప్పుడు

అయా విషయాలపై చర్చించగలుగుతున్నారు. అందువల్ల కొన్ని పెడ ధోరణులు ప్రబలవచ్చును గానీ మొత్తం మీద చూస్తే ప్రజలు ఇంకా ఉదాత్తులవుతారు. ఆయా విషయాలను సవ్యంగా అర్థం చేసుకోగలుగుతారు. ప్రజలలో విశాల భావాలు పెరుగుతాయి. మొత్తం మీద సమాజానికి ఆ నవల మేలే చేస్తుందని నా అభిప్రాయం" అన్నాడు జయరాం

ముఖ్యమంత్రి శేషాచలం అందరి అభిప్రాయాలను శ్రద్ధగా వింటూ ఆలోచించసాగాడు. మనసులో మెదులుతున్న పరస్పర విరుద్ధమయిన భావాలవలన తన అభిప్రాయం ఏమిటో వెలిబుచ్చలేకుండా ఉన్నాడు. ప్రజల సంగతి సరే. ఆ నవల ప్రభావం తన మీద, తన కుటుంబం మీద ఏమిటి అన్న విషయం మీద ఒక ఇదమిద్ధమయిన అంచనాకు రాలేకపోతున్నాడు.

"విశాల భావాలు అంటే ఏమిటండి? చెడు ప్రవర్తనని అర్థం చేసుకొని గమ్మున ఉండటమేనా" అని ఘాటుగా ప్రశ్నించాడు రాజారత్నం.

"తమ తప్పులు తెలుస్తాయనే భావంతో ప్రజలలో నైతిక ప్రవర్తన పెరుగుతుంది కదండీ"

"ఆ భయంతో ఎవరు ఆగుతారండీ. కాకపోతే కండోమ్స్‌తో జాగ్రత్తపడతారు. అసలు ఈ కండోమ్స్ వల్లనే అనైతికమయిన పనులు చేయడానికి ప్రజలలో సగం ధైర్యం వస్తోంది"

శేషాచలానికి మనసులో నవ్వు వస్తోంది. అక్రమ సంబంధాలు పెట్టుకొని పిల్లలు కూడా కలగడానికి కారణమయిన ఈ రాజరత్నమేనా ఇలా మాట్లాడుతున్నది? మనుషుల్లో ద్వంద్వ నీతి అంటే ఇదే కదా అని అనిపించి అతడి వాదన చిరెత్తిస్తున్నా తన భావాలు బయటపడకుండా జాగ్రత్తగా వినసాగాడు.

మరో మంత్రి రాజారాం నవ్వుతూ అడిగాడు "ఈ లెక్కన కండోమ్స్ కూడా నిషేధిద్దామా? "



"ఏదో మాటవరసకి అన్నానులెండి"

"ఆ నవల మీద మన ప్రభుత్వం ఒక అభిప్రాయమంటూ ఏర్పరచుకోవాల్సిన అవసరం ఇప్పుడు లేదని నా అభిప్రాయం" అన్నాడు శేషాచలం.

"లేదండి ఆ నవలని నిషేధించాల్సిందే" అన్నాడు పట్టుదలగా రాజారత్నం

"ఎందుకో మీకు ఆ నవల మీద అంత కోపం" కాస్త వ్యంగ్యంగానే అడిగాడు శేషాచలం.

"నాకు వ్యక్తిగతంగా కోపం ఏమీలేదు. ప్రజలు ఇబ్బంది పడుతున్నారని అంతే" ఆగ్రహంగా అన్నాడు రాజారత్నం.

ఇక రాజారత్నానికి ముక్కుతాడు వేయక పోతే ఇలాగే రెచ్చిపోతాడని అనుకున్నాడు



శేషాచలం. "మనలో కొంత మందికి 'ఎవరు' నవల వల్ల వ్యక్తిగతంగా ఎటువంటి సమస్యలు వచ్చాయో నా దగ్గర సమాచారం వుంది. తాము చేసిన తప్పులు ఇప్పుడు వారికి ఇబ్బంది కలిగిస్తున్నాయి. దానికని బ్లడ్ గ్రూప్ సైన్స్‌ని తప్పుపట్టడం భావ్యం కాదు. అంతే కాదు. నా దగ్గర మరి కొంత సమాచారం కూడా వుంది. మనలో ఎంత మందికి అక్రమ సంతానం వున్నారనే విషయం నాకు తెలుసు"

చాలా మంది మంత్రుల ముఖాలు కత్తి వాటుకి నెత్తురు చుక్కలేకుండా పాలిపోయాయి. ముఖ్యంగా రాజారత్నంది. ఎలా గోలా బోలెడంత సమాచారాన్ని ముఖ్యమంత్రి తెప్పించుకుంటాడని వారికందరికీ ఇది వరకు అనుభవమే.

శేషాచలం ఒకసారి అందరినీ పరిశీలనగా చూసి తన మాటలని కొనసాగించాడు. "మన సమాజం ముందున్న భయంకరమయిన సమస్య ఎయిడ్స్ అంతే కానీ 'ఎవరు' నవల కాదు. మన ప్రాధాన్యతలు ఏమిటో మనం గుర్తెరిగి పాలించాలి. అనవసరమయిన విషయాలలో ప్రభుత్వం వేలుపెడితే అభాసుపాలవుతుంది. ఎయిడ్స్ అనేది ప్రపంచ మానవాళికి ముఖ్యంగా మన రాష్ట్రం ముందున్న పెను సవాలు. అందరూ దాని మీద దృష్టి సారించండి.దానిని నిర్మూలించడానికి ఉద్యమిద్దాం. దానితో వస్తున్న సమస్యలతో పోల్చుకుంటే 'ఎవరు' నవల మీద వస్తున్న సమస్యలు అతి స్వల్పం. ఆ నవలని ఇష్టమున్న వారు చదువుతారు, ఇష్టంలేని వారు చదవరు. అటువంటి చిన్న చిన్న విషయాలకి ప్రాధాన్యతనిచ్చి సమయాన్ని, ధనాన్ని మనం వృధా చేయవద్దు. పెనుభూతంగా మారుతున్న ఎయిడ్స్‌ను ఎదుర్కోవడానికి మనం ఏమేమి కార్యక్రమాలు చేపడితే బావుంటుందనే విషయమై మంచి ఆలోచనలతో ముందుకు రండి"

శేషాచలం ఒకసారి చుట్టూ చూశాడు. అందరూ శ్రద్ధగా వింటున్నారు.

"రాష్ట్రంలో ఎయిడ్స్ నిర్మూలన కోసం ఒక ప్రత్యేక శాఖని ఏర్పాటు చేస్తున్నారు. రాజారత్నం గారూ! మీకు వున్న సమాచార శాఖకి తోడుగా మీరు అది కూడా నిర్వహించాలి. ఆ శాఖ మీకే ఎందుకిస్తున్నానన్న విషయం మీరు ఊహించగలరనుకుంటా"

చివరి మాటలకు క్షణంపాటు బిత్తరపోయి తనకి ఎయిడ్స్ వుందన్న విషయం ముఖ్యమంత్రికి తెలిసిపోయిందని గ్రహించే తేలు కుట్టిన దొంగలా కిమ్మనకుండా సరే అన్నట్లుగా తలూపాడు రాజారత్నం.

"మీలో చాలామందికి తెలవదనుకుంటా రచయిత సత్యశ్రీ ఇంకొక నవల కూడా రాశారు. ప్రజలకు బాగా ఉపయోగపడే నవల అది. దాని పేరు 'ఎయిడ్స్'. దానిని అందరూ చదవండి. ఎయిడ్స్ వ్యాధి మీద మనం చేయబోయే పోరాటానికి అటువంటి నవలలు ప్రజలను జాగృతపరుస్తూ ఎంతగానో ఉపయోగపడతాయి. అయితే రచయితకు అలాంటి మంచి నవల రాసినందుకు తగిన గుర్తింపు లభించలేదు. ఆ కసితోనే రాష్ట్రంలో సంచలనం సృష్టించి బాగా పేరు తెచ్చుకోవడానికి ఈయన ఎవరు నవల రాశారంట. వారు ఊహించినట్లుగానే ఈ విషయాల్ని చాలామంది సంచలనాత్మకం చేయడంతో ఆ రచయిత ఇప్పుడూ బాగా ప్రసిద్ధిలోకి వచ్చారు. అలా తెలవకుండానే చాలా మంది రచయిత ట్రాప్‌లో పడి రచయితకు ప్రఖ్యాతి తీసుకువచ్చారు"

రాజారత్నం ముఖం వెలవెలబోవడాన్ని శేషాచలం గమనించాడు

"'ఎవరు' నవలలో రచయిత చివరలో సూచించినట్లుగా దేనికి ప్రాధాన్యం ఇవ్వాలో దానికి ప్రాధాన్యం ఇద్దాం. ఇంతటితో ఆ విషయంపై చర్చని ముగిద్దాం" అని ముఖ్యమంత్రి శేషాచలం తన మాటలని ముగించి కేబినెట్ సమావేశ మందిరం నుంచి బయటకు నడిచాడు. ✦

# ఉత్తమ నవలలకు ఆహ్వానం

మీరు విలక్షణ రచయితలా
వైవిధ్యమంటే మీకు మక్కువా
వినూత్నంగా అక్షరాన్ని సంధించడం మీ అభిలాషా

మరింకేం, వెంటనే స్పందించండి.

మీకు నవ్య నవలా వేదిక

చతుర సాదర స్వాగతం

గత 28 సంవత్సరాలుగా అప్రతిహతంగా నెలనెలా ఉత్తమ నవలను పాఠకులకు అందిస్తున్న చతుర రానున్న సంచికలను మరింత అద్భుతంగా వెలువరించాలని సంకల్పిస్తోంది. అశ్లీలతకు తావు లేకుండా, మానవతా విలువలతో ఆబాలగోపాలాన్ని అలరించగల మంచి నవలలకు స్వాగతం పలుకుతోంది.

**సునిశిత హాస్యంతో ఓలలాడించే వ్యంగ్య నవలలకు ప్రత్యేక ప్రాధాన్యం**

నవలలు ఇతివృత్తంలో నవ్యత, రచనాసంవిధానంలో వైవిధ్యం కలిగి ఉండాలి. తెలుగు వాతావరణాన్ని, తెలుగు వారి సమకాలీన జీవితాన్ని విభిన్న కోణాల నుండి సమగ్రంగా ప్రతిబింబించగలగాలి. సామాజిక స్పృహతో మానవ స్వభావాలను, ఆంతరంగిక చిత్రాన్ని సమర్థవంతంగా ఆవిష్కరించగలగాలి. నవల చతురలో అచ్చులో 90 పేజీలు మించకుండా చూసుకుని పంపించాలి. అంతకు మించిన పేజీలు ఉన్న పెద్ద నవలలను పరిశీలించడం కుదరదు. కనుక రచయితలు చతురలోని ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో సరిచూసుకుని నవలలు పంపించాలి. ఎంపిక కాని వాటిని తిప్పి పంపగోరువారు తగు పోస్టేజి ఉన్న కవరును జతపరచాలి.

సంపాదకుడు

చతుర

'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాద్ - 82.




## గూటిపక్షి

అడవులు, కొండ కోనల నుంచి మానవుడు బయటపడి, మైదాన ప్రాంతాల్లో ఇల్లు వాకిళ్లు కట్టుకుని నాగరికతను సృష్టించుకుని అజేయుణ్ణని విర్రవీగే స్థితికి ఏనాడో చేరుకున్నాడు. ఈ నాగరీక ప్రపంచం కూడా క్షణం క్షణం మారిపోతూ తనను సృష్టించుకున్న మానవుడే అందుకోలేనంత వేగంగా పరుగులు దీస్తూ పలు పోకడలు పోతోంది. ఆ వేగానికి ఆ పోకడలకు విసుగొచ్చేసిన వాళ్లు చెట్టూ చేమలు, కొండా కోనలవైపు పరుగులు దీయడం వింటూనే ఉంటాం. ప్రశాంతతను, సహజ వాతావరణాన్ని స్వయంగా సృష్టించుకుంటుంటారు కొందరు. అలాంటి వారి కోవకు చెందిందే రోక్సానా పోన్స్. అర్జెంటీనాకు చెందిన ఆవిడగారు తనలోని ఆదిమ స్పృహను కాపాడుకుంటూ ఆవాసాన్ని ఏర్పాటు చేసుకుంది. అదీ ఎక్కడనుకున్నారు? పిట్టలా ఒక చెట్టు మీద! మరీ అడవుల్లోకి వెళితే ఒంటరితనం బోరు కొట్టిస్తుందనేమో శాన్‌రాఫెల్ రైల్వేస్టేషన్ సమీపంలో ఆకులు, కొమ్మలు, కుషన్లతో ఒక గూడు అల్లుకుని అందులో ఏడాదిగా నివసిస్తోంది. 'గూడు కట్టుకోవడం గురించి ఒక పుస్తకంలో చదివాను. అది నాకెంతో నచ్చింది. వెంటనే అమలు చేసేశా' అని సగర్వంగా చెబుతున్న ఆవిడగారికి కొంపా గోడు లేవనుకోకండి. అన్నీ ఉన్నా పిట్టలా ఆ చెట్టు మీద గూడులో ఒదిగి ఉండడమే యమహాయిగా ఉందంటోంది. అంతా బాగానే ఉంది కానీ, ఈ ఐడియా ఏదో మన రియల్ ఎస్టేట్ వాళ్ల దృష్టిలో పడితే పిట్టల బతుకేమైపోతుందో!

## వేలు మింగిన పిల్లి

ఎవర్ని ఎక్కడుంచాలో అక్కడే ఉంచాలి తప్ప నెత్తికెక్కించుకోరాదు అనేది సూక్తి. ఆ సూక్తిని పెడచెవిని పెట్టేస్తుంటారు పెంపుడు జంతువుల యజమానులు. వాటిని అంత ముద్దు చేస్తే ముప్పు సుమా అన్నా వినరు. అలా చేసే ముప్పు తెచ్చుకొన్నాడో పెద్ద మనిషి. జర్మనీలోని ల్యూబెల్‌లో ఉడోరీజ్ (41) అనే సదరు జంతుప్రియుడు తన పెంపుడు పిల్లి పుణ్యమా అని కాలి వేలు పోగొట్టుకున్నాడు. ఈ అయ్యగారు కిచెన్‌లో ఓ భారీ చాకుతో బ్రెడ్డును ముక్కలు కోస్తుంటే అది కాస్తా పొరపాటున చేజారి పాదంమీద పడింది. ఇంకేముంది... అయ్యగారి కాలి రెండో వేలు పుటుక్కున తెగింది. ఆయనగారు బెంబేలు పడిపోయి దూది కోసం బాత్రూంలోకి పరిగెత్తాడు. అలా పరిగెత్తుతూనే సెల్ ఫోన్‌లో ఎమర్జెన్సీ సర్వీసెస్‌కి ఫోన్ చేసి విషయం చెప్పాడు. ఈ హడావిడి భయంలో అసలు సంగతి మరిచిపోయాడు. అదే అదనుగా పెంపుడు పిల్లి చిన్నపాటి చికెన్ పీస్ అనుకుందో ఏమోగాని నెత్తుటి వేలు నోట కరచుకుని బయటి తోటలోకి తుర్రుమంది. బాత్రూం నుంచి వెనక్కి వచ్చి వేలుకోసం వెతుక్కున్న రీడ్ పిల్లి వెంట పడి తోటంతా గాలించినా లాభం లేకపోయింది. ఇక వెతకడం ఆపేసి ఆస్పత్రికి చేరాడు చికిత్స కోసం. పిల్లి దొంగిలించకపోతే ఆ వేలును రీడ్ పాదానికి అతికించేవాళ్లమే. ప్చ్ అతగాడికి ఆ అదృష్టం లేదు. మరేం చేద్దాం... అంటూ సానుభూతి కురిపించారు వైద్యులు.





## శృంగార వాకిళ్లు

ప్రేమ పక్షులం మనం. ఎవరేమన్నా ఇక వినం అని చెట్టా పట్టాలేసుకుని పాడుకుంటూ అలసిపోయి ఆనక ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగిపోయి తన్మయించడం ఒక్క మానవుల హక్కు మాత్రమే ననుకుంటున్నారా? ఛట్ ఎంత మాత్రం కాదు. మిగతా ప్రాణులకీ ఉంది. ఆ మాటకొస్తే మానవుడి కంటే ముందే అవిర్భవించిన జంతుజాలానికి మరింత హక్కు ఉంది పొమ్మంటున్నారు ఆ హోటల్ వాళ్లు. అంతటితో ఆగారా? ఊహూ! ఎంచక్కా వాటికోసం శృంగార హోటళ్ళు ప్రారంభించేశారు ఈ జంతుప్రేమికులు. బ్రెజిల్‌లోని శావోపాలోకు చెందిన వీరు చక్కగా పెంపుడు జంతువుల కోసం ప్రత్యేకంగా లవ్ హోటల్స్ ప్రారంభించి ఆ జంతువుల యజమానుల్ని ఆకర్షిస్తున్నారు. మానవుల కోసం అలంకరించినట్లే ఈ హోటళ్లలోని గదులను శాటిన్ పరదాలు, ముఖమల్ దుప్పట్లతో అలంకరించి, సీలింగ్‌కు అద్దాలు అమర్చి, మెత్తమెత్తని అనేక కుషన్లు ఏర్పాటుచేసి సర్వహంగులతో తీర్చిదిద్దుతున్నారట. అలాంటి వాతావరణంలో మోహావేశం ముంచెత్తి శృంగారపుటంచుల్ని తాకడమంటే ఎంత హాయి, ఎంత తన్మయత. అది ఊహించుకుని మురిసిపోతూ పెంపుడు ప్రేమ జంతువుల ప్రతినిధి ఒకాయన, 'వాటికీ అవసరాలుంటాయి. వాటికీ కాసింత ఉద్వేగం, అలౌకికానందం కలగలసిన ఎక్సైట్‌మెంట్ కావొద్దూ' అంటున్నాడు మన రావుగోపాలరావు లెవల్లో.



## మసాలా మూషికం

కాదేదీ భక్ష్యానికనర్హంబు అనుకున్నారో ఏమో కానీ ఆ సంస్థ వారు జరిగిందానికి ఇప్పుడు లబోదిబోమంటున్నారు. చిప్స్ తయారుచేసి అమ్మే ఆ సంస్థవారు ముగ్గురు వినియోగదారులు తమ మీద పళ్లు పటపటా కొరుకుతూ, కారాలు మిరియాలూ నూరుతుంటే బిక్కమొగం వేసి దిగాలు పడుతున్నారు. అలా దిగులు బాబుల ఫోజు పెడితే ఊరుకుంటామా? మా చేత మసాలా ఎలుకను తినిపించాలనుకున్నందుకు మాకు పది లక్షల పౌండ్ల పరిహారం చెల్లించి తీరాల్సిందేనని ఆ వినియోగదారులు మొండికేస్తున్నారు. వాళ్లు కింగ్ సైజ్ చిప్స్ పాకెట్ కొనుక్కుని మసాలా చిప్స్ మజా మజాగా తిందామనుకుంటే ఓ నాలుగు తినేసరికి వాంతొచ్చినట్లనిపించిందట. ఏంటబ్బా ఇది అనుకుంటూ ఆ కింగ్ సైజ్ పాకెట్లోకి చూపులు గుచ్చి శోధిస్తే మూషికా కళేబరం ముడుచుకుపోయి వెగటు ఘుమఘుమలు వేలార్చుతూ దర్శన మిచ్చిందట. బంగాళాదుంపలతో పాటు ఆ ఎలుక కూడా ఏ మాత్రం చెక్కు చెదరకుండానే స్పైసీగా తయారై జిహ్వా చాపల్యం తీర్చడానికి సిద్ధమయిందట. మా కంతటి జిహ్వా చాపల్యం లేదు బాబూ అంటూ కళ్లెర్ర చేసిన ఆ కొనుగోలుదార్లు కోర్టు తలుపులు తట్టి ఆ పరిహారం కోసం యుద్ధం ప్రకటించారు. ఈ మాత్రం దానికే వాళ్లంత రభస చేస్తుంటే పులుసులో బొద్దింకలు, సాంబారులో బల్లులు, అన్నంలో పురుగులు నిత్యం దర్శనమిచ్చే మన హోటళ్లు, సంక్షేమ హాస్టళ్లలో ముద్ద గతికే వాళ్లేంచేయాలో మరి? !





# రమ్యా!

అమ్మిన వెంకట అమ్మిరాజు

**రా**మనాథం సాయంత్రం వేళ చల్లగాలికి డాబా మీద కూర్చున్నాడు. భార్య పార్వతి కూడా ఆయన పక్కనే కూర్చొని చేతికి గోరింటాకు పెట్టుకుంటోంది.

"పార్వతీ! మన రమ్యకు పెళ్ళి సంబంధాలు చూస్తే మంచిదేమో?" అన్నాడు భార్యతో రామనాథం.

"అప్పుడే ఏం తొందర? అయినా దాని వయసెంత? ఇంకా డిగ్రీ కూడా పూర్తి కాలేదు!" అంది పార్వతి చిరాగ్గా మొహం పెట్టి.

అంతలోనే రామనాథం చూపులు ఇంటి గేట్ వైపు మళ్ళాయి. సరిగ్గా అపుడే వాళ్ళ అమ్మాయి రమ్య స్కూటీ రయ్ మంటూ వచ్చి గేటు ముందు ఆగింది. ఆ స్కూటీ మీదనే కూర్చుని రమ్య సెల్‌ఫోన్‌లో మాట్లాడుతోంది ఎవరితోనో.

రమ్య గురించి ఈ మధ్యనే కొన్ని విషయాలు తెలిశాయి రామనాథానికి. ఉండబట్టలేక భార్యతో "మన రమ్య రోజూ పార్కులకు, పార్టీలకు, సినిమాలకు, షికారులకు ఫ్రెండ్స్‌తో తిరుగుతుందని తెల్సిందోయ్!" అన్నాడు భార్యతో.

"మీరు తెలిసీ తెలవకుండా మాట్లాడకండి! మన రమ్య అలా తిరిగే పిల్లకాదు. అయినా దానికి సినిమాలంటేనే చిరాకు" విసుక్కుంటూ అంది పార్వతి.

అంతలోనే డాబా మీద కూర్చున్న తల్లిదండ్రుల దగ్గరకు పరుగులాంటి నడకతో ఆయాసపడుతూ వచ్చింది రమ్య.

"హాయ్! మామ్, డాడ్ ఇక్కడున్నారా మీరు" అంది పలకరింపుగా.

"ఏంటీ రమ్యా... ఇవ్వాళ ఆలస్యంగా వచ్చావ్? కాలేజీలో ప్రయివేటు క్లాసులేమ యినా జరిగాయా? " రామనాథం కూతుర్నే చూస్తూ అడిగాడు.

"క్లాస్లులేమీ లేవు డాడ్ కానీ..." అని రమ్య అంటుండగానే ఆమె చేతిలోని సెల్ మోగింది. రమ్య కాస్త పక్కకు వెళ్ళి మాట్లా డింది. 'ఐ యామ్ రెడీ... బై' అంటూ సెల్ ఆఫ్ చేసి "మామ్ డాడ్ రేపు మా కాలేజీ ఫ్రెండ్స్ అందరం కల్సి 'గోవా' టూరుకు వెళ్ళుతున్నాం. మీరు వద్దన్నా నేను మాత్రం మానను..." అంటూ గారాలు పోయింది తల్లిదండ్రుల ముందు.

"అదేంటమ్మా... సరదాగా టూర్ వెళ్తామంటే మేము మాత్రం వద్దంటామా!" అన్నారు ముక్తకంఠంతో భార్యాభర్తలిద్దరూ.

ఆ మాటలకు ఎగిరి గంతేసింది రమ్య. అంతలో ఆమె సెల్ మళ్ళీ మోగింది. సెల్‌లో మాట్లాడుతూ డాబాదిగి కిందకి వెళ్లింది.

ఆ రాత్రి రమ్య సూట్‌కేస్‌లో బట్టలు సర్దుకుంటుండగా పార్వతి వచ్చి "రమ్యా... టూర్‌కి మీ ఫ్రెండ్స్ ఎవరెవరొస్తున్నా రేంటి? " అనడిగింది.

"ఆం ఫ్రెండ్స్ ఎవరొస్తే రాకపోతే నాకేంటి! నా బెస్ట్ ఫ్రెండ్ రమా, నేనూ టూర్‌కు వెళ్ళడం ఖాయం మమ్మీ" అంది రమ్య సూట్‌కేసులో బట్టలు సర్దుకుంటూనే.

"నాలుగు జతలు ఎక్కువ పెట్టుకో, టూర్‌లో ఎన్ని డ్రస్సులున్నా చాలవు. అక్కడ బట్టలుతుక్కోవడం కుదరదుగా" అంది పార్వతి.

అంతే రమ్య చిన్నగా నవ్వి, "ఈ డ్రెస్ బాగుందా..." అంటూ ఒక్కొక్క డ్రస్సు తల్లికి చూపిస్తూ సర్దుకోసాగింది.

రాత్రి భోజనాలయిన తర్వాత "మామ్ నన్ను రేపు ఎర్లీ మార్నింగ్ లేపు. లేకపోతే ట్రైన్ మిస్సవుతాను" అంది రమ్య పడు కుంటూ.

"తప్పకుండా లేపుతాలే. రేపు ఉదయం మీ డాడే నిన్ను స్టేషన్‌దాకా డ్రాప్ చేస్తాన న్నారు" అంది పార్వతి బుజ్జగింపుగా.

"ఏంటీ మామ్! నేనేమన్నా చిన్న పిల్లనా? గ్రాడ్యుయేట్ స్టూడెంట్‌ను!" ముఖం చిట్లించుకుంటూ అంది రమ్య.

"కన్నవారికి పిల్లలు ఎప్పుడూ చిన్నగానే




కన్పిస్తారే" అని నవ్వుతూ రమ్య బుగ్గలు నిమిరింది పార్వతి.

"నీకేం భయం లేదు మామ్! రేపు మార్నింగ్ మా ఫ్రెండ్ 'రమా' మనింటికి వచ్చాకే టూర్‌కు బయలుదేరుతాను సరేనా!"అంది రమ్య దుప్పట్లోకి దూరుతూ.

తెల్లవారగానే రమ్యను నిద్ర లేపింది పార్వతి. రమ్య తొందరగానే తయారయిపో యింది. రమా కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

రమ్యతో పాటు తన తల్లిదండ్రులూ 'రమా' కోసం ఎదురు చూస్తున్నారు.

ఇంతలోనే కాలింగ్ బెల్ మోగింది. వెంటనే వెళ్ళి తలుపు తీసింది రమ్య ఎదు రుగా 'రమా'.

"మామ్ డాడ్, మా ఫ్రెండ్ 'రమా'..." అంది చాలా ఉత్సాహంగా రమ్య.

ఆ వచ్చిన 'రమా'ని చూసిన రమ్య తల్లి దండ్రులకు నోట మాట రాలేదు!

"మామ్ డాడ్! తను రియల్‌గానే మా ఫ్రెండ్ 'రమాకాంత్'" కాస్త గట్టిగానే అంది రమ్య. ✦

# గీతోపదేశం




"నీకు బొత్తిగా తెలివి లేదే. చదువుతున్నావ్. ఎందుకు ఏడవనా? భర్తను కొద్దిగానైనా గ్రిప్‌లో పెట్టుకోలేకపోయావ్. నిన్ను చూస్తుంటే నిజంగా జాలేస్తోంది. నేను చూడు. నా భర్త నేను గీచిన గీటు దాటడు" దర్పంగా అంది భ్రమరాంబిక.

"అందరికీ నీ అదృష్టం ఉండొద్దూ.. మా ఆయన అసలు నన్నొక మనిషిలానే ట్రీట్ చేయడు. నీకో విషయం చెప్పనా... ఈ రోజుకీ ఆయన జీతం ఎంతో నాకు తెలియదు"

"ఛీ... సిగ్గులేదు"

"ఏ ఊరో వెళ్లినప్పుడు వందో రెండొందలో ఇచ్చినా రాగానే లెక్కలు చెప్పి మిగిలింది ఆయనకిచ్చెయ్యాలి"

"ఛ ఛ... మరీ ఇంత ఘోరమా? అంటే కేవలం పిల్లల్ని కనే యంత్రంగా, ఇంటికి పర్మినెంట్ పనిమనిషిగా బతుకుతున్నావన్న మాట. నాతిచరామి, నువ్వో సగం నేనో సగం ఈ మాటలన్ని ఉత్తదేనని నీకన్పించ లేదూ..."

"అన్పిస్తుంది... కానీ ఏం చేయను? "

"పిచ్చి ముఖమా... కాస్త మారు. జీతం నీ చేతిలో పడే ఉపాయాలు ఆలోచించు. అప్పుడు ఎంతో నిశ్చింత. ఈ మగాళ్లు మాయగాళ్లు. వాళ్లను నమ్మకూడదు. మనకు తెలియని ఖర్చులు ఎన్నో పెట్టేస్తుంటారు. అందుకే మనమీ జాగ్రత్తలు తీసుకోవాలి. మా వారు జీతమంతా నాకే ఇస్తారు. అన్ని ఖర్చులు పోను చీటీ కూడా కడుతున్నాను. పెత్తనం వాళ్లు తీసుకుంటే ఇదిగో నీలాగా ప్రతీ రూపాయి బిచ్చగత్తెలా అడుక్కోవాలి"

"నిజమే గానీ..."

"పిచ్చి మొద్దూ... ఏదో ఒక మంచి ఆలోచన చేయి. జీతం నీ చేతికి ఇచ్చేలా చేసుకో" పండుగ సందర్భంగా పుట్టింటికి వెళ్లినప్పుడు స్నేహితురాలికి ఎన్నో హితబోధలు చేసింది భ్రమరాంబిక.

* * *

"ఎంట్రా అంత డల్‌గా ఉన్నావు"? క్యాంటీన్‌లో రామాచారిని అడిగాడు ఆనంద్‌రావు.

"ప్చ్.. ఏం లేదు"

"సావిత్రికి జ్వరం తగ్గిందా? "

"ఆ... తగ్గింది. నాకే హైఫీవర్ వచ్చేట్లుంది"

"అదేంటి? " ఆశ్చర్యపోయాడు ఆనందరావు

"ఖర్చులు... ఖర్చులు... ఒకటే ఖర్చులు. కోరికలు... అలకలు... కోపాలు... కొట్లాటలు... గొడవలు... ఛీ ఛీ... విసుగేస్తుంద

**కోటమర్తి రాధా హిమబిందు**

నుకో. నా మాటకో లెక్కలేదు.. సాయంత్రం వాళ్ల అమ్మా నాన్న ఊరెళుతున్నారు. వాళ్లకు కాస్ట్లీ బట్టలు తెమ్మంది. ఛస్తున్నాననుకో. తన మాటే గెలవాలని పట్టుదల" తల పట్టుకున్నాడు రామాచారి.

పదిహేను రోజుల క్రితమే ట్రాన్స్ఫర్ మీద వచ్చాడు రామాచారి. ఆనందరావు రామాచారి మంచి ఫ్రెండ్స్. ఇలా ఒకే ఆఫీసులో ఉండే అదృష్టం ఇంత త్వరగా కల్సి వచ్చినందుకు ఇద్దరికీ మహదానందంగా అన్పించింది. కానీ ఆనందరావును చూస్తున్నకొద్దీ కాస్త ఈర్ష్యగానే అన్పిస్తోంది రామాచారికి. పెళ్లయిందంటే ఒక చట్రంలో బిగింపబడటమే అని, పిల్లలు పుట్టారంటే జైలు లాంటి ఇంట్లో అరెస్ట్ అయి జైలర్ లాంటి భార్యకు ఎప్పుడూ సంజాయిషీ ఇచ్చుకుంటూ బతుకును వెళ్లదీయాల్సి వస్తుంది అన్నది రామాచారి అభిప్రాయం. అలాంటిది ఆనందరావు ఎంతో కలివిడిగా తిరుగుతూ, నవ్వుతూ నవ్విస్తూ పూలరంగడిలా వుండటం ఆశ్చర్యాన్నే కల్గిస్తుంది.

"మీ ఇంట్లో జీతం మెయింటెనెన్స్ నీదే గదా... అదిగో అక్కడే సాంబారులో కాలేశావ్. నేనో సలహా ఇస్తాను విను. జీతం అవిడకే ఇవ్వు"

"ఇంకా నయం... ఇప్పటికే ఎడ్జెస్ట్ చేయలేక ప్రాణం పాదరసం మింగుతున్నట్లుంది... జీతం తనకిచ్చానంటే నా పని గోవిందా..."

"అస్సలు గాదు... ఓ నెల ఇచ్చి చూడు. అన్నీ ఆవిడనే మెయింటెయిన్ చేయమను. మనకంటే బాగా మెయింటెయిన్ చేస్తారు.. నిజం చారీ... మా ఇంట్లో ఈ బాధ్యతలూ, భారాలన్నీ మోసేది నా భార్యే. అన్నీ పోను ఒక చిట్టీ కూడా కడుతుంది. కానీ ఆ విషయం నాకు తెలియదనుకుంటుంది పాపం... అదో పిచ్చి మొహం. బజారు పనులు, కరెంట్ బిల్లు, ఫోన్ బిల్లు, బ్యాంక్ పనులు, పిల్లల పనులు, బట్టలు తేవడం... ఒకటేమిటి ఎన్నో ఎన్నెన్నో పనులు మనకు తగ్గిపోతాయి. ఇవన్నీ లేవంటే మనకు హ్యాపీ. ఉంటే వారికి హ్యాపీ. ఇల్లంతా ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతున్నామన్న గర్వంతో కూడిన ఫీలింగ్... వాళ్లు మన తలకెక్కి నాట్యం చేయాలనుకుంటారు... చేయనీ అదో తృప్తి, పాపం ఆ పిచ్చి మనసులకి. నిజానికి వాళ్లనే మనం గ్రిప్‌లో పెట్టుకుంటాం. ఆ విషయం అర్థం కాదు వాళ్లకు. నెలకు చేతిలో పడే జీతం ఒక్కటే కన్పిస్తుంది వాళ్లకి అంతే"

"ఆనంద్..." విస్తుపోయాడు రామాచారి. అంతలోనే ఏదో గుర్తొచ్చినవాడిలా "మరి మన ఖర్చులకి డబ్బు... ప్రతీ రూపాయి వాళ్లని అడుక్కోవద్దూ..."

"అడుగుతాం. తప్పేముంది? దానికీ గొప్పగా ఫీలవుతారు వాళ్లు. కానీయ్ గురూ... నేను అవసరం వున్నప్పుడు ఓ ఏభై, వందా అడిగి తీసుకుంటుంటాను. లెక్క చెప్తాను"

"నిజంగా...?"

"అవును. నేను అడిగి తీసుకునేది ఎక్స్‌ట్రా మనీ"

"అంటే..."

"కటింగ్స్ పోను మన జీతం ఎంత?"

"పన్నెండు వేలు"

"నేను పదివేలనే చెప్తాను. అంతే ఇస్తాను"

"మిగతా రెండు వేలు..."

"వాటిని మనం నొక్కేస్తాం. ఇక అడపాదడపా పెరిగే జీతాల గురించి పెద్దగా చెప్పను. ఇది అసలు రహస్యం. అమ్మో... పది నిమిషాలు లేటైంది. రోజూ ఈ టైంలో ఓసారి మా భ్రమరాంబికతో మాట్లాడాలి. లేకపోతే సాయంత్రం ఇంటికి వెళ్లేసరికి నిజంగా సార్థకనామధేయురాలైపోతుంది.. వన్ మినిట్ ఇప్పుడే వస్తా. ఇంతకూ నీదీ నా రూటేనా లేక..."

అప్పటికే రామాచారి కళ్లు వెలుగులు చిమ్ముతూ మెరుపు పూలదండను తయారు చేశాయి. ఆనందరావు మెడలో ప్రేమగా వేయటం కోసం. ✦

ఉద్యోగ విరమణ తర్వాత ఇంట్లో కాలు మీద కాలువేసుకుని కూర్చుని కార్టూన్ నెట్ వర్కు చూస్తూ కాలక్షేపం చేస్తు న్నాను. శేష జీవితాన్ని మూడు కార్టూన్‌లు ఆరు జోకులుగా గడపాలని నిర్ణయించుకు న్నాను. అలాగే గడిచిపోతోంది.

ఒక రోజున తెలుగు సంభాషణలతో ప్రసారమవుతున్న వాల్ట్‌డిస్నీ కార్టూన్‌ను బెర్మూడా వేసుకుని వంటిమీద మరొక ఆచ్ఛాదన లేకుండా గోడకి అనుకుని

# అసలు రహస్యం

## తాజీ ప్రసాద్

కూర్చుని చూస్తున్నాను. ఇంతలో కాలింగ్ బెల్ మోగింది. లేచి తలుపు తీశాను.

టక్ చేసుకుని, టై కట్టుకుని, సెల్ ఫోన్ మెడలో వేళ్లాడేసుకుని, చేతిలో బ్రీఫ్ కేస్ పట్టుకున్న ఒక మోడ్రన్ యంగ్ శాల్తీ ప్రత్యక్షమయింది.

"గుడ్‌మార్నింగ్ సార్, ఐయామ్ మార్టిన్" అన్నాడు అతను.

మార్టిన్ దోమల నాశిని కదా. ఆ కంపెనీ నుంచి అదే పేరు గల వ్యక్తి ఆ మందుని ప్రచారంలోకి తీసుకు రావడా నికి వచ్చాడనుకున్నాను.

"ఆమధ్య ఉపయోగించాము, కాని ఈమధ్య దోమలు లేవు, ఇక రావు. పరి సరాలను పరిశుభ్రంగా ఉంచుతున్నాం" అన్నాను.

అతను అయోమయంలో పడి "దోమలు ఏమిటి" అన్నాడు.

"మార్టిన్ దోమల మందు కాదా"

"ఔను, కానీ, నాకు దానికి సంబంధం లేదు" అన్నాడు.

"మరి"

"నేను ఎబిసిడి బ్యాంక్ నుంచి వస్తు న్నాను" అంటూ తన ఐడికార్డ్ చూపించి, విజిటింగ్ కార్డు ఇచ్చాడు.

ఇక బాగుండదని లోపలకు రమ్మని కూర్చోమనీ కుర్చీ చూపించాను.

అతను కూర్చొని "ఇవాళ లీవా సార్" అని అడిగాడు.

లీవ్ అయినా కాకపోయినా వీడికెందుకు





అనుకున్నాను. అయినా మర్యాదగా "సెలవు పెట్టాను" అన్నాను, అసలు సంగతి ఎందుకు చెప్పాలని.

అదేదో తనకోసమే పెట్టినట్లు "మీరు ఇంట్లో ఉన్నారు నా అదృష్టం" అన్నాడు.

నేను ఇంట్లో ఉండడం అతనికి అదృష్టమెందుకో అర్థం కాలేదు. నా ముఖంలో కనిపించిన ఆశ్చర్య ప్రశ్నార్థకాలను ఆ అనుభవజ్ఞుడు అర్థం చేసుకున్నాడు.

"చెప్పాను గదా సార్, నేను ఏబి సిడి బ్యాంక్ నుంచి వస్తున్నానని" అన్నాడు అతను.

"చెప్పావు సరే" అన్నాను.

"మా బ్యాంక్ తక్కువ వడ్డీకి ఎక్కువ మొత్తాలు వివిధ అవసరాలకు రుణాలు ఇస్తుంది"

"అయితే"

"ఏదో ఒక అవసరానికి మీరు మా వద్ద రుణం తీసుకుంటారనే నమ్మకంతోనూ, ఇవ్వాలనే సదుద్దేశంతోనూ మిమ్మల్ని కలుసుకుంటున్నాను" అన్నాడు ఏబిసిడి మార్టిన్.

"మిస్టర్ మార్టిన్ ఈ ఫ్లాట్ మా స్వంతం. హౌస్‌లోన్ మాకు అనవసరం, మా అబ్బాయి ఎంబిఏ, ఎంసిఏ వగైరాలు పూర్తిచేసి అమెరికాలో సెటిల్ అయ్యాడు. నాకు ఎడ్యుకేషనల్ లోన్ అక్కర లేదు. ఇక మా అమ్మాయి పెళ్లి చేసుకుని భర్తతో ఆస్ట్రేలియాలో ఉంటోంది. అందువల్ల మ్యారేజ్ లోన్ కూడా అనవసరం. నా ఆరోగ్యానికి ఢోకా లేదు కాబట్టి మెడికల్ హెల్త్ లోన్ కూడా అవసరం లేదు" అని చిన్న ఉపన్యాసమిచ్చాను.

"అవే అవసరం లేదనుకుంటే ఇప్పుడు మేము ఇస్తున్న టూ వీలర్ లోన్ మీకు తప్పక ఉపయోగపడుతుంది. మీకు టూవీలర్ లేదనుకుంటాను" అన్నాడు ధీమాగా ఏబిసిడి మార్టిన్.

"టూ వీలర్ నాకెందుకు. నేను రిటైర్ అయిపోయాను" అంటూ అప్రయత్నంగా నిజం చెప్పేశాను.

"అప్పుడే రిటైర్ అయ్యారా సార్. నాలుగు పదులు నిండి అయిదులో అడుగు పెట్టినట్లున్నారు" అంటూ ఖితాబిచ్చాడు మార్టిన్.

"థాంక్యూ" అన్నాను మానవమాత్రుడనయిన నేను.

"సర్వీస్‌లో లేకపోయినా ఇంటి పనిమీద అక్కడికి ఇక్కడికి వెళ్తూఉంటారు. టూ వీలర్ మీకు అవసరం" అన్నాడు ఏబిసిడి.

"టూ వీలర్ లేదనుకో మార్టిన్" అంటూ ఆ అవసరం లేదు, రాదని చెప్పబోయే లోపున

"అదే చాలు. ఫార్మ్ రాయమంటారా? " అంటూ బ్రీఫ్‌కేస్ తెరవబోయాడు మార్టిన్.

"అక్కరలేదు. నాకు డ్రైవింగ్ రాదు" అంటూ మరో నిజం చెప్పేశాను.

"డ్రైవింగ్ రాదా. నిజమా, అబద్ధమా. ఈ హైటెక్ ఏజ్‌లో టూవీలర్ డ్రైవింగ్ రాని వారు ఉంటారా" మార్టిన్ తెగ ఆశ్చర్యపోయాడు.

"ఇది హైటెక్ ఏజ్. కాని నేను పుట్టింది లాగుడు రిక్షా యుగంలో" అన్నాను.

"సరే మీ మిసెస్ ఏం చేస్తున్నారో తెలుసుకోవచ్చా సార్"

"కాలేజ్‌లో లెక్చరర్‌గా పని చేస్తున్నారు"

"మీ ఆవిడ కాలేజికి ఎలా వెళ్తారు"

"ఆటోలో"

"అయ్యా బాబోయ్ ఆటోలోనా. ఆటోల లోని దొంగ మీటర్లు మనని ముంచేస్తాయి. ఫ్లాట్ రేట్ చెబితే మనం ఫ్లాటయి పోతాము. మేడమ్ కోసం టూవీలర్ లోన్ తీసుకోండి" అభ్యర్థించాడు మార్టిన్.

నేను సమాధానం చెప్పే లోగానే సందేహం నివృత్తి చేసుకోవాలని "మేడమ్‌కి టూవీలర్ డ్రైవింగ్ వచ్చా? " అని అడిగాడు మార్టిన్.

"బ్రహ్మాండంగా వచ్చు"అన్నాను గర్వంగా.

"అయితే ఎందుకు ఆలస్యం" అంటూ లోన్ ఫారాలు నా ముందుంచాడు.

"మిస్టర్ మార్టిన్! మా ఆవిడకి టూవీలర్ డ్రైవింగ్ వచ్చినా, చచ్చినా టూ వీలర్ డ్రైవ్ చెయ్యదు" అన్నాను కాస్త గట్టిగా.

"సార్! ఎప్పుడైనా యాక్సిడెంట్ లాంటిది అయిందా? " అంటూ నీళ్లు నమిలాడు మార్టిన్.

"అదేం కాదు" అన్నాను.

"మరి"

"మా ఆవిడకి తన శిరోజాల మీద అమిత శ్రద్ధ. చక్కగా తల దువ్వుకుని, జడ వేసుకుని పువ్వులతో అలంకరించుకుంటుంది" అన్నాను.

"మీ ఆవిడ శిరోజాలంకరణకి, టూవీలర్‌కి కనెక్షన్ ఏమిటి? " అడిగాడు మార్టిన్ అర్థం కాక క్వొశ్చన్ మార్క్ మొహంతో.

"అక్కడే ఉంది. అసలు రహస్యం. హెల్మెట్ కంపల్సరీ చేశారు గదా. ఆడవారయినా టూవీలర్ డ్రైవ్ చేసేటప్పుడు హెల్మెట్ ధరించాలి గదా. మా ఆవిడకి జుట్టు చెదిరిపోతుందనీ, జుట్టు చెదిరిపోతే అందం కూడా చెదిరిపోతుందనీ భయంతో హెల్మెట్ ధరించడం ఇష్టం లేదు. అందుకే టూవీలర్ ఉపయోగించక హాయిగా త్రీవీలర్‌లో వెళ్తోంది" అని అసలు కథ చెప్పాను.

ఏబిసిడి మార్టిన్ ఒక విజిట్ వేస్ట్ అయిందనుకుని బయటకు తీసిన ఫారాలు బ్రీఫ్‌కేస్‌లో పెట్టుకుని "వస్తాను" అంటూ గొణుక్కుంటూ సెలవు తీసుకున్నాడు. ఎందుకు మళ్ళీ రావడం అని లోపలే అనుకుంటూ 'మ్యూటింగ్' తీసేసి నేను కార్టూన్ వరల్డ్‌లో మళ్ళీ ప్రవేశించాను. ✦

# నీ మొహం

పెయ్యేటి శ్రీదేవి

షీలా డిగ్రీ పూర్తి చేసింది. యాంకరింగ్ చెయ్యాలని ఎప్పట్నించో అనుకుంటోంది. కొత్తగా పెట్టిన 'యల్' ఛానల్ కి అప్లికేషన్ పెట్టింది. వెంటనే రమ్మని లెటర్ వచ్చింది. ఇంటర్వ్యూలో సెలక్టయింది. ఫలానా రోజు రమ్మని కబురొచ్చింది. షీలా ఆనందానికి




పధుల్లేవు.
ండ్స్అంద
చెప్పు
ది.
హంలో
ప్పలు కనబడ
డా దట్టంగా క్రీములు పట్టించింది.
త్తానికి చాలా డబ్బులు ఖర్చుపెట్టేంది
్యూటీ పార్లర్‌కి. ఖరీదైన డ్రస్సు వేసుకుని
ల్' ఛానల్ స్టూడియోకి వెళ్ళింది షీలా.
హలో మీపేరేమిటండి? "

"వినీల"

"వినీలగారూ! మీ పేరు చాలా బాగుంది. ఎక్కడ్నించి కాల్ చేస్తున్నారు? "

"థాంక్సండి. నేను వికారాబాద్ నించి ఫోన్ చేస్తున్నానండి"

"వినీలగారూ, మీరేం చేస్తుంటారు? "

"ఇంటర్ ఫస్టియర్ చదువుతున్నాను. మీ యాంకరింగ్ బాగుంటుంది"

"థాంక్సండి"

"మీ డ్రస్సు కూడా చాలా బాగుందండి"

"థాంక్సండి. ఓ.కె వినీలగారూ. మీ కోసం మంచి పాట వేస్తున్నా చూసి ఎంజాయ్ చెయ్యండి"

తను యాంకరింగ్ ఎలా చెయ్యాలో అందరూ తనని ఎలా పొగుడుతారో యాంకర్లు డ్రస్సు కర్టసీ అంటూ తనకి ఖరీ

డైన డ్రెస్సుని స్పాన్సర్ చేసినవారి పేరు, ప్రోగ్రాం, ఆఖర్న టైటిల్సుతో వేయడం అన్నీ ఊహించుకుంటూ ఎంతో గర్వంగా ఫీలై పోయి 'యల్' ఛానల్ స్టూడియో లోకి అడుగుపెట్టింది షీలా. ముందుగా ఆమెకి 'యల్' ఛానల్ మైకు ఇచ్చి ఎలా పట్టుకోవాలో చెప్పారు. ఆ మైకు చేత్తో పట్టుకోగానే థ్రిల్ ఫీలయింది.

తరువాత ఆమెని ఓ సినిమాహాలు దగ్గర నిలబడి కొత్తగా రిలీజైన సినిమా గురించి అందర్నీ వాళ్ళ వాళ్ళ అభిప్రాయాలు చెబుతుంటే మైకు పుచ్చుకుని నుంచోమన్నారు. టి.వి. ముందర నుంచుని అందరితో ఫోన్లో లైవ్ ప్రోగ్రాం ఉంటుందని ఊహించిన షీలా కొంచెం నిరాశపడినా తమాయించుకుని ఉత్సాహంతో సినిమాహాలు దగ్గర నిలబడింది. మైకు పుచ్చుకుని తరవాతెలాగైనా పెద్ద యాంకర్ని కాలేకపోతానా అనుకుంటూ.

వీడియోగ్రాఫర్ వీడియో తీస్తున్నాడు. సినిమా విడిచిపెట్టారు. జనం చాలా మందే వచ్చారు. కొత్త సినిమా కదా.

షీలా మైకు పుచ్చుకుని నిలబడింది వాళ్ళ అభిప్రాయాలు తెలుసుకోడానికి. అందరూ వాళ్ళ వాళ్ళ అభిప్రాయాలు చెబుతున్నారు.

"నీ మొహం చాలా బాగుంది"

"నీ మొహం చాలా నవ్వు తెప్పిస్తోంది"

"నీ మొహం సూపర్"

"నీ మొహం అందరూ చూడొచ్చు"

"నీ మొహం వెరైటీగా వుంది"

"నీ మొహం హండ్రెడ్ డేస్ గ్యారంటీ"

"నీ మొహంలో రొమాన్సు, డాన్సులు, ఫైట్స్, పాటలు, హాస్యం అన్నీ బాగున్నాయి"

"ఎంత అందమైనదీ నీ మొహం. ఎవరికీ వుండదు నీ లాంటి మొహం. ఎన్నిసార్లు చూసినా తనివి తీరనిదీ మొహం. ఈ మొహమే నన్ను పిచ్చివాణ్ణి చేసింది. అన్న పాట చాలా బాగుంది"

"నీ మొహంలో అన్నీ బాగున్నాయండి"

ఎంతో అందంగా తనని చూసుకోవాలని 'యల్' ఛానల్ చూస్తున్న షీలాకి తన మొహం కనిపించలేదు. తను చేత్తో పట్టుకున్న 'యల్' ఛానల్ మైకు మాత్రమే కనిపించింది. షీలా మొహం కందగడ్డలా అయింది. తను యాంకర్ అవాలని ఎంతో ఆశపడితే ఆఖరికి సినిమాహాలు దగ్గర నిలబడి మైకు పట్టుకోవల్సిన ఖర్మపట్టిందా? అంటే యాంకర్గా తనమొహం బాగా లేదా? అద్దంలో తన మొహం చూసుకుంది. అద్దం కూడా నీ మొహం అంది.

తరువాత "నీ మొహం" చిత్రం గురించి ఆ చిత్ర దర్శకుడితో లైవ్ ప్రోగ్రాం జరుగుతోంది.

"హలో"

"హలో"

"హలో! మీపేరమిటండి? "

"హలో నేను సహితని మాట్లాడుతున్నాను"

"సహిత గారూ కొంచెం మీ టి.వి. వాల్యూమ్ తగ్గించి మాట్లాడండి"

"నమస్కారం మధుగారూ బాగున్నారా? "

"ఆ నమస్కారం మీరు బాగున్నారా? ఇక్కడ 'నీ మొహం' చిత్ర దర్శకులు కంగాళీ గారున్నారు. వారితో మాట్లాడండి"

"కంగాళీగారూ, నమస్కారమండీ"

"ఆ నమస్కారమమ్మా బాగున్నారా? "

"అ బాగున్నామండి మీరంటే మా ఇంట్లో అందరికి చాలా అభిమానమండీ. మీ సినిమాలు వెరైటీగా వుంటాయండి. 'నీ మొహం' చాలా బాగుందండీ"

"థాంక్సమ్మా మీ ఇంట్లో అందరూ చూశారా? "

"లేదండి. నేను, నాఫ్రెండు వెళ్లామండి"

"నువ్వేం చదువుతున్నావు? "

"టెన్తు చదువుతున్నానండి"

"వెరీగుడ్! అందర్నీ చూడమని చెప్పమ్మా మళ్ళీ నువ్వు కూడా చూడు. ఈ సినిమ చూసి బాగా నవ్వుకున్నారా? "

"ఆ.. నీ మొహం చూసి చాలా నవ్వుకున మండి. అందరూ చూడదగ్గ చిత్రమం ఎంత అందమైనదీ నీ మొహం పాట చా

బాగుంది. ఆ పాట వెయ్యండి"

"సరే అలాగే వేస్తామమ్మా. ఈ సినిమా కనీసం ఆరుసార్లైనా మీరందరూ కలిసి చూడండి. మీరడిగిన పాట వేస్తా చూడండి. థాంక్స్ ఫర్ కాలింగ్"

"ఎంత అందమైనదీ నీ మొహం.."

"నెక్ట్స్‌కాల్ చూద్దాం"

"హలో"

"హలో నేను షీలాని మాట్లాడుతున్నాను"

"షీలాగారూ చెప్పండి సినిమా చూశారా? ఎన్నిసార్లు చూశారు? ఇదిగో 'నీ మొహం' డైరక్టరు కంగాళీగారితో మాట్లాడండి.

"నమస్కారం కంగాళీగారూ"

"నమస్కారమమ్మా. సినిమా చూశారా? "

"ఆ చూశానండి. ఆ సినిమా చూసిన వాళ్ళని చూశాను. మైకుపుచ్చుకుని అందరూ నీ మొహం చాలా బాగుందన్నారు. టైటిలు కొంచెం ఆలోచించి పెడితే బాగుండేదండి. ఆ సినిమా చూసిన వాళ్ళంతా ఎదుటివారితో 'నీ మొహం' బాగుంది అని చెబుతుంటే డౌటొచ్చి నిజమా, అబద్ధమా అని అద్దంలో వాళ్ళ మొహం చూసుకుంటున్నారు"

"షీలాగారూ మీరన్నది కరక్టేనమ్మా. ముందర 'నా మొహం' అని టైటిలు పెడదామనుకున్నాము. కాని సినిమా చూసి నా మొహం బాగుందంటే ఎవరూ నమ్మరని నీ మొహం అని పేరు పెట్టడం జరిగింది. 'నీ మొహం' బాగుందంటే అవతలి వాళ్ళు తన అందాన్ని పొగుడుతున్నారనుకుని పొంగిపోయి సంతోషిస్తారు. అందువల్ల రెండు విధాలుగానూ ఉపయోగపడుతుందని తెలివిగా 'నీ మొహం' అని పేరు పెట్టానమ్మా. ఏది ఏమైనా నీ మొహం మీ ఇంట్లో అందరూ చూసి ఎంజాయ్ చెయ్యండి. థాంక్స్ ఫర్ కాలింగ్"

"నీ తెలివితేటలు మండినట్టే ఉన్నాయి. అద్దంలో చూసుకో ఎలా ఉందో 'నీ మొహం' అని మనసులో అనుకుంటూ ఠక్కున కోపంతో ఫోన్ పెట్టేసింది యాంకర్ షీలా.

✦

## వినకుండానే తీర్పు రాస్తారా?

మద్రాస్ అనే సివిల్ జడ్జి ముందు ప్రకాశం ఓ కేసు వాదిస్తుండగా ఆయన వాదనలేవీ పూర్తిగా వినకుండానే తీర్పు ప్రతిని రాస్తూ కూర్చున్నాడు. దాంతో ఒళ్లుమండిన ప్రకాశం, 'అయ్యా.. కేసును మీకు విన్నవించేందుకు కనీసం నాకు అవకాశమైనా ఇవ్వకుండా మీదారిన మీరు తీర్పు రాసేస్తున్నారు. మీరు విననప్పుడు నా కంఠశోష ఎవరికోసం?' అనిఅడిగాడు.

దానికాయన 'నేను తీర్పే రాస్తున్నానని మీరెందుకు అనుకోవాలి?' అనితిప్పికొట్టాడు.

'నేనలా ఊహిస్తున్నాను. మీరు కూర్చున్న భంగిమ.. రాసే తీరు..వగైరాలన్నింటినీ పరిశీలిస్తే నాకలాగే అన్పిస్తోంది మరి' అన్నారు ప్రకాశం తడుముకోకుండా.

వెంటనే మద్రాస్ మారుమాటాడకుండా రాసేదాన్ని పక్కకు పెట్టి ప్రకాశం వాదనలు వినడం కొనసాగించాడు.



కథ వెనుక కథ

## న్యాయవ్యవస్థను నిలదీసిన

# జమానత్



'జమానత్' ఓ చక్కని కథ. ఏప్రిల్ 02 'విపుల'లో ప్రచురితమై పలువురి ప్రశంసలు చూరగొంది. కోర్టులో ముద్దాయిలు చెప్పినట్లు ఒక్కో పాత్ర తన కథ చెప్పడం ఇందులోని వైచిత్రి... రచయిత జింబో(మంగారి రాజేందర్) మన న్యాయవ్యవస్థపైకి ఎక్కు పెట్టిన బాణంగా 'జమానత్'ను భావించవచ్చు. దీని 'కథ వెనక కథ' గురించి జింబో ఇలా వివరిస్తున్నారు..

'నా కథలు ఊహల్లోనుంచి ఊడిపడ్డవి కావు.. అన్నీ అనుభవంలోకి వచ్చినవే. వాటిని కథారూపంలోకి మార్చడమే నేచేసిన పని. న్యాయవాదిగా ప్రాక్టీస్ చేశాను.. మేజిస్ట్రేట్‌గా చేశాను. కొంతకాలం డిప్యూటేషన్ మీద పోలీస్ అకాడమీలో పని చేశాను. ఎందరో పోలీసు అధికారులకు, ప్రాసిక్యూటర్లకు, న్యాయాధికారులకు శిక్షణ ఇచ్చాను. ఇలా ఎన్నోరకాల అనుభవాలు.. వీటిల్లో నుంచి వచ్చినవే నా కథలు. 'జమానత్' కూడా అలాంటిదే.

ఓ వ్యక్తిని చంపి కాల్చివేసిన సంఘటన సికింద్రాబాద్ ప్రాంతంలో కొన్నేళ్ల క్రితం జరిగింది. ఫుట్‌పాత్ వ్యాపారుల నుంచి మామూళ్లు వసూలుచేసే వ్యక్తి ఈ హత్య చేశాడన్న సంగతి చాలారోజులకు పోలీసుల దర్యాప్తులో తేలింది. ఆ సంఘటన చూసిన వ్యక్తుల స్టేట్‌మెంట్‌ని నమోదు చేయమని పోలీసులు రిక్విజిషన్ నాముందు దాఖలు చేశారు. ఆ మేరకు వారి వాంగ్మూలాల్ని నమోదు చేశాను. ఒక్క చిన్న సంఘటన ఒక వ్యక్తి మరణానికి ఎలా దారితీసిందన్న విషయం నా మనస్సులో చాలా కాలం అలజడి రేపింది. చివరికి అదే కథగా రూపుదిద్దుకుంది.

బట్టలు ఆరేసుకునే విషయంలో ఓ మురికివాడలోని లక్ష్మి, జయమ్మలకు గొడవవుతుంది. ఇద్దరూ తిట్టుకుంటారు. తన భార్య లక్ష్మిని అత్యంత నీచంగా తిట్టిందని విని లడ్డూ జయమ్మను కొడతాడు. పోలీసులు అతన్ని అరెస్టుచేసి కోర్టుకు పంపుతారు. ఐదువేల చొప్పున ఇద్దరు వ్యక్తులు జమానత్ ఇస్తే బెయిల్‌మీద విడుదల చేస్తానంటాడు మేజిస్ట్రేట్. కానీ అంత జామీను ఇచ్చే స్థోమత లడ్డూకు లేదు. దాంతో జైల్లోనే మగ్గాల్సి వస్తుంది. ఓ వాయిదాకు కోర్టుకు వచ్చినపుడు అంత జామీను ఇవ్వలేనని, కొంత తగ్గించమని మేజిస్ట్రేట్‌కు

మొరపెట్టుకుంటాడు లడ్డూ. ఆయన విన్పించుకోడు. లడ్డూ ఇద్దరు భార్యలూ జామీను ఇచ్చే వ్యక్తులకోసం చాలా ప్రయత్నాలు చేసినా ఫలితం లేకపోతుంది. మళ్లీ జైలుకు పోతాడు లడ్డూ.

రెండునెలలు గడుస్తాయి. మళ్లీ ఓరోజు లడ్డూను కోర్టుకు తీసుకొస్తారు. జామీను ఇచ్చేవారు దొరకలేదని లక్ష్మి విచారంగా అతనికి చెబుతుంది. లడ్డూకు దిక్కుతోచదు. కేసునుంచి బయటపడడానికి సలహా చెప్పమని ఓ కానిస్టేబుల్‌ను అడుగుతాడు. రెండురోజుల్లో చార్జిషీట్ దాఖలు చేయబోతున్నారు. జయమ్మతో రాజీపడితే కేసు కొట్టేస్తారు. నీ భార్యను వెళ్లి జయమ్మతో మాట్లాడమను అంటాడతను. గత్యంతరం లేని పరిస్థితి. ఆ మాటే భార్య లక్ష్మితో చెబుతాడతను. లక్ష్మి కూడా అయిష్టంగానే జయమ్మ ఇంటికి వెళ్తుంది. అక్కడ జయమ్మ ప్రియుడు రామ్మూర్తి ఉంటాడు. అతను లక్ష్మి వచ్చినపని తెలుసుకుని దాందేముంది? అలాగే రాజీపడదాం అని చెప్పి జయమ్మ సహాయంతోనే లక్ష్మిని దారుణంగా అనుభవిస్తాడు. కానీ లడ్డూ విడుదలకు మాత్రం ప్రయత్నం చేయడు. 'రేపు కోర్టుకు వెళ్దాం.. లడ్డూను విడిపించుకొద్దాం' అని మరోమారు ఆశపెట్టి, మళ్లీ తన కోరిక తీర్చుకుంటాడు. అతనేమీ చేయడని అర్థమయ్యాక లక్ష్మి తనసవతి పుష్పతో కలిసి ఉన్నదంతా ఊడ్చి ఎలాగైతేనేం? లడ్డూను విడుదల చేయిస్తుంది. ఆమె విషయం లడ్డూకు చెబుతానని బెదిరించి రామ్మూర్తి ఇంకోమారు లక్ష్మిని బలత్కారంగా అనుభవిస్తాడు. అన్యాయంగా తను అతని కోరికకు సమిధనవ్వాల్సి వస్తోందని లక్ష్మి మనసులోనే ఆవేదన చెందుతుంది.

ఓరోజు పొద్దున ఇంటిముందు లక్ష్మి బట్టలు ఉతుకుతుంటే జయమ్మ వస్తుంది. 'ఇంకోసారి రామ్మూర్తిని నా దగ్గరకు తీసుకురాకు.. జరిగిందేదో జరిగింది.. నా మానాన నన్ను బతకనివ్వు' అని ఆమెను అభ్యర్థిస్తుంది లక్ష్మి. జయమ్మ తనభార్యతో మాట్లాడడం లడ్డూ చూస్తాడు. అతనికి విపరీతమైన కోపం వస్తుంది. లక్ష్మిని బాగా కొడతాడు. జరిగిన విషయమంతా చెబుతుంది ఆమె. రాజీపేరుతో తన భార్యను



వంచించిన రామ్మూర్తి అంతుచూడడానికి నిశ్చయించుకుంటాడతను. అనుకున్నట్లే జాగ్రత్తగా ప్లాన్‌చేసి అతన్ని చంపి, కాల్చి

బూడిదచేస్తాడు. నెలరోజుల తర్వాత లడ్డూకు సాయం చేసిన ఇద్దరు వ్యక్తులనీ, ఆటోడ్రైవర్‌ను పోలీసులు కనుక్కొంటారు. జయమ్మనూ విచారిస్తారు.

ఇలా వాళ్లందరి స్టేట్‌మెంట్లనూ నమోదు చేశాను. ఓ చిన్న సంఘటన ఎన్ని గొడవలకు దారితీసింది.. అన్న ఆలోచన చాలా రోజులు నా మనసులో మెదిలింది. లడ్డూ నాకు స్టేట్‌మెంటిస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన ఆ సంఘటనను కథగామార్చింది. ఈ కథలో రచయిత కథ చెప్పడు. ఒక్కో పాత్ర వచ్చి కథచెప్పి వెళ్లిపోతుంది. కథచెప్పడంలో ఒక కొత్తప్రయోగం.. అద్భుతం అన్నవాళ్లూ ఉన్నారు. ఏం ప్రయోగం ఉందీ అన్నవాళ్లూ ఉన్నారు. నాకు మాత్రం అన్ని రకాలుగా నచ్చిన కథ ఇది.

కథలో లడ్డూపాత్ర ఇలా స్టేట్‌మెంట్ ఇస్తుంది.. కేసు కాంప్రమైజ్ గురించి నా భార్య.. జయమ్మ దగ్గరకు పోతే రామ్మూర్తి అలుసుగా తీసుకుని ఆమెను మభ్యపెట్టి అనుభవించాడు. అదీ ఒకసారికాదు.. నాలుగుసార్లు.. అంతేకాదు.. నేను జైలు నుంచి వచ్చాక కూడా ఆమెను బెదిరించి లొంగదీసుకున్నాడు. అలాంటివాణ్ని నేనెలా వదిలిపెట్టాలి? అందుకని రామ్మూర్తిని తాగడానికి తీసుకుపోయి మిత్రుడు సుధాకర్‌రెడ్డి సాయంతో ముక్కలు ముక్కలుగా నరికాను. గోనెసంచిలో ప్యాక్‌చేసి చిట్టీ వెంకటరావుల సాయంతో కాల్చిబూడిద చేశాను.

నన్ను జైలునుంచి విడిపిస్తానని చెప్పి నా భార్యను బలవంతంగా అనుభవించిన రామ్మూర్తిని చంపడం తప్పంటారా? అదే సాకుతో మళ్లీమళ్లీ ఆమెను వంచించిన వాడిని ముక్కలు ముక్కలుగా నరకడం సమంజసం కాదంటారా? నేను జైలునుంచి వచ్చాక కూడా బెదిరించి ఆమెను లొంగదీసుకున్న నీతిమాలినోడిని పెట్రోలు పోసి కాల్చివేయడం న్యాయబద్ధం కాదంటారా?

మరి ఏది న్యాయం? చిన్నదెబ్బకొట్టినందుకు నాలుగురోజులు లాకప్‌లో ఉంచి నన్ను చితగ్గొట్టిన పోలీసులది న్యాయమా?

చిన్ననేరానికి విచారణ లేకుండా రెండునెలలు జైల్లోవుంచిన కోర్టుది న్యాయమా? నా ఆర్థిక స్థోమత చూడకుండా చెప్పేది వినకుండా ఐదువేల రూపాయలతో ఇద్దరు జామీనుదారులను తెచ్చుకోమన్న మేజిస్ట్రేట్‌ది న్యాయమా? నా స్థోమతకు తగ్గ జామీనుంటే కేసు కాంప్రమైజ్ గురించి జయమ్మతో మాట్లాడమని నా భార్యకు చెప్పేవాడినా? ఆ రామ్మూర్తిగాడి కళ్లు ఆమె మీద పడేవా? వాడింతపని చేసేవాడా?

ఈ కోర్టుని.. ఈ జమానత్‌నీ ముక్కలు ముక్కలుగా నరకలేక రామ్మూర్తిగాడిని నరికేశాను. తగలబెట్టాను. ఇప్పుడు చెప్పండి. నేను చేసింది తప్పా? అంటూ నిలదీస్తాడు లడ్డూ. ఇదే జమానత్ కథవెనుక కథ!

– చంద్రప్రతాప్ ✦

# ప్రేమ = సమానత




ప్రేమ గురించి ఆలోచిస్తే చెప్పలేని అనుభూతితో ఒళ్లు పులకిస్తుంది. అదే సమయంలో భయంతో కంపిస్తుంది. మనిషిని ఔన్నత్యానికి ఎత్తివేసే శక్తీ, పాతాళానికి పడదోసే శక్తీ, రెండూ ప్రేమకుండటంతో దాని అర్థాన్నీ, వేగాన్నీ, బలాన్నీ అంచనా వేయటంలో మనుషులు సమతూకాన్ని తేలికగా కోల్పోతారు. ప్రేమ అనగానే యవ్వనం, మనసు, చందమామ, వెన్నెల పువ్వులు, గుండె లయ తప్పటం ఇత్యాదులన్నీ ఒకవైపూ కన్నీళ్లు, బాధ, రక్తం, మృత్యువు మరొకవైపు మన ఊహల్లోకి వస్తాయి. ప్రేమ అనే పదానికున్నంత విలువ మరే పదానికీ లేదు. ఆ పదం గురయినంత చౌకబారుతనానికీ, అపార్థాలకూ మరింకే పదమూ గురవలేదు. బాల్యం నుంచీ వృద్ధాప్యం వరకూ రకరకాల రూపాలతో, రకరకాల అర్థాలతో మన జీవితాన్ని ఆడించి, లాలించి, పాలించి, శాసించే ప్రేమ గురించి మనకు మొదట పరిచయమయ్యేది సాహిత్యంతోనే. పుస్తకాలు చదివినా చదవకపోయినా చిన్నతనంలోనే గుడిలోనో, బడిలోనో, నాటకాలలోనో, సినిమాలలోనో రాధాకృష్ణులు, సంయుక్త పృథ్వీరాజులు, రోమియో జూలియట్లూ, లైలా మజ్నూలు, పార్వతీ దేవదాసుల కథలు మనకు పరిచయమవుతున్నాయి. బాల్యంలో మొదటిసారి విన్నపుడు ఆ కథలకు ఆ పేర్లకూ మన జీవితంతో సంబంధం ఉంటుందని అనిపించదు. కానీ ఎక్కడో మనసు పొరలలో ఆ ముద్రలు బలంగానే పడతాయి.

ఒక మనిషికీ ఇంకొక మనిషికీ మధ్య ప్రేమ ఎందుకు కలుగుతుంది? అందమా, డబ్బా, తెలివా, కళలా, గుణమా, కులమా, వర్గమా, లింగమా ఇలా ప్రశ్నించుకుంటే వీటిలో ఒక్కో మనిషికి ఒక్కో సందర్భంలో ఒక్కొక్కటి ప్రేమ కారణం కావచ్చు మనిషిలో సంస్కారాలను బట్టి వ్యామోహాలుంటాయి అంటారు కొడవటిగంటి కుటుంబరావు. మన సంస్కారం పెరిగిన కొద్దీ మనం ప్రేమించే మనుషులు మారతారు. ఇది చాలామందికి ఆశ్చర్యం. కానీ యదార్థం. తెలిసీ తెలియని వయసులో, ఎదిగీ ఎదగని మనసుతో, ఇంకా వ్యక్తిత్వం పూర్తిగా రూపుదిద్దుకోకముందే ఒక వ్యక్తిని అందం చూసో, డబ్బు చూసో, తెలివి చూసో ప్రేమించవచ్చు కొంత కాలం గడిచాక అది ప్రేమ కాదని తెలిసి రావచ్చు అపుడు దాన్ని ఒప్పుకుని, తేలికగా తీసుకుని మనకు కావలసిన ప్రేమ కోసం వేచి ఉంటే చాలా అనర్థాలు తప్పుతాయి. ప్రేమ చుట్టూ వందల సంవత్సరాల నుండీ ఎంతో భ్రమ ఆవరించుకుని ఉంది. ప్రేమ మారదు. జీవితంలో ఒక్కరినే ప్రేమించగలం. ఒకసారి ఒకరిని ప్రేమించామనుకుంటే చచ్చేవరకూ ఇక దానికే అంకితమై ఉండాలనే భావాలొకవైపు, ప్రేమకు డబ్బుతో, కులంతో, వర్గంతో పని లేదు. అది అనిర్వచనీయం. అవ్యాజం, అజరామరం అంటూ మరో వైపూ ఎన్ని భ్రమలో, ఎన్ని భ్రాంతులో. అందుకే చాలాసార్లు ప్రేమ గురించి చాలామంది "అంతా భ్రాంతి యేనా" అని పాడుకోవాల్సి వస్తుంది.

"గుండె గొంతుకలోన కొట్లాడుతాది,

కూసుండ నీదురా కూసింత సేపు" అంటూ మెల్లిగా మనకే తెలియని భావంగా మొదలైన ప్రేమను ఎలా అర్థం చేసుకోవాలి. దానితో ఎలా జీవితాన్ని అర్థవంతం చేసుకోవాలి? ఇది చాలా పెద్ద సవాలు ప్రేమికులకు. తొలి రోజులలో ప్రేమలో అంతా ఎదుటివారికి ఇచ్చేద్దామనే. మొత్తం బతికేదే వారి కోసమ నుకుంటారు. క్రమంగా అశాంతి మొదలవు తుంది. మనం ఇచ్చినంత ఎదుటి వారు ఇవ్వటం లేదని కేవలం మన కోసమే బత కటం లేదని. అప్పుడు కాస్త వివేకం ఉన్నవా ళ్లయితే స్థిమితంగా ఆలోచించి ఇద్దరం ఒక్కటే అని ఇన్నాళ్ళూ అనుకున్నది నిజం కాదనీ, ఇద్దరు వేరు వేరు వ్యక్తుల సహ జీవనం ఇద్దరికీ ఆనందాన్నివ్వటమే ప్రేమ అనీ గమనిస్తారు.

'ఆత్మార్పణ' అనే పదం పెట్టే భ్రమలోంచి బైటికొచ్చి మన ఆత్మకు కావలసిందేమిటో అవ తలి వారికి తెలియజెప్పి వారి గురించి ఆలో చిస్తారు. మనిద్దరం ఒకటి కాదు. భిన్న నేప థ్యాలనుంచీ, భిన్న వ్యక్తిత్వాలతో ఎదిగిన మనుషులం. ఐనా మనల్ని దగ్గర చేసిన కామన్ విషయాలివి. ఈ విషయాలను మనం ఒకరితో ఒకరం పంచుకుంటున్నపుడు చాలా ఆనందంగా ఉన్నాం. ఒకరి కోసం ఒకరం మన వ్యక్తిత్వాలను పరిమితుల్లో, పరి ధుల్లో బిగించాల్సి వచ్చినప్పుడు బాధ కలుగు తోంది అని ఆలోచించగలిగిన మనుషుల మధ్య ప్రేమ ఎక్కువ కాలం బతుకుతుంది. ప్రేమికులు ఎంతగా ఒకటి కావాలో ఆలోచి స్తారు గానీ వాళ్ళకు ఎవరికి వారికి కొంత చోటు, గాలి ఆడే చోటు కావాలనేది గుర్తిం చరు. అందువల్లే చాలామంది ప్రేమలు రొటీ న్‌గా ఇదేనా ప్రేమంటే అనుకునేంతగా మారి పోతాయి.

ప్రేమలో వందల సంవత్సరాల పాటు మనం చూసిన సుగుణాలు సేవ, దాస్యం, త్యాగం మాత్రమే. అవి కూడా ఆడవాళ్ళ వైపు నుంచే. ఎంత సేవ చేస్తే అంత ప్రేమ. దాస్యం అయితే ఇక ఆ ప్రేమకు తిరుగు లేదు. త్యాగం చేశా మంటే అమరత్వం సాధించినట్టే. ఐతే మారిన సామాజిక పరిస్థి తులలో పైవి పోయి కొత్త విలువలను మనం తెచ్చుకోవాలి. సమా నత్వం, పరస్పర గౌరవం, ప్రజాస్వామిక జీవన విధానం. ఐతే ఇవి ప్రస్తుతం భావా లలో ఉన్నంతగా భౌతిక రూపం దాల్చలేదు. వాటిని జీవితంలోకి తెచ్చుకున్నపుడు ప్రేమ కొత్త కాంతితో, కొత్త అర్థంతో నిండుతుంది. ఐతే సమానత్వం, ప్రజాస్వామ్యం వంటి భావాలు ప్రేమలోకి వస్తున్నట్లే, వాటికంటే వేగంగా హింస, దోపిడీలు కూడా ప్రేమ పేరుతో పెరగటం మనం చూస్తున్నాం. నిజా నికి సమానత్వ భావన ఆలోచనల్లోనే ఉండగా హింస మాత్రం జీవితంలోకి వచ్చే సింది. దేవదాసుల రోజులు పోయి మనోహ ర్‌ల రోజులొచ్చేశాయి. దేవదాసు పెద్దల నెది రించలేని బలహీన మనస్తత్వంతో తనను తాను నాశనం చేసుకున్నాడు. మనోహర్ ఇవాళ్టి సమాజం, సినిమాలు సంస్కృతి పెంచి పోషిస్తున్న పురుష దురహంకారపు మగ మదమృగమై ప్రేమ పేరుతో ఒక యువతిని చంపేశాడు. వేగంగా పతనమవు తున్న మానవ విలువల నేపథ్యంలో యువ తులు ప్రేమ అంటే భయపడాల్సిన పరిస్థితి పెరుగుతోంది. ఇంతకుముందు ప్రేమ అంటే పెద్దల నెదిరించాలనే భయం ఒకటే. ఇప్పుడు హింసకు దారుణంగా బలి అవుతామేమోననే భయం తోడయింది.



ప్రేమకూ, నీతికీ మధ్యనున్న సంబంధం కూడా వందల సంవత్సరాల నుంచీ అందరినీ కలవరపెడుతూనే ఉంది. ప్రేమ నీతి సూత్రాలకు లొంగదు. నీతి సూత్రాలూ కాలాన్ని బట్టి మారుతుంటాయి. ప్రేమను సంఘ నీతితో సమన్వయించటం ఒకప్పుడు

చాలా కష్టంగా ఉండేది. అసలు కుదిరేది కాదు. బాల్య వివాహాలలో, పెద్దలు కుదిర్చిన వివాహాలలో అసలు ప్రేమ ప్రసక్తే ఉండదు. వాళ్లు పెద్దవాళ్లయ్యాకనో, లేదా తనకు నచ్చిన వ్యక్తి తటస్థపడినపుడో



వేరేవాళ్ల మీద ప్రేమ కలిగితే అది అవినీతి అవుతుంది. దానివల్ల ఎన్ని సమస్యలో. పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్లలో పెళ్ళాడిన వాళ్ళను ప్రేమించటమంటే ఈ విశాల ప్రపంచంలో ఎవరినైనా ప్రేమించగల గటం లానే ఉంటుంది. దానిని ప్రేమ అనలేం. ఎందుకంటే అది వ్యక్తిగత ఎంపిక కాదు. ప్రేమకు అదే ప్రధానం. అందువల్లే దానికంత విలువ. పెళ్లిళ్లలో కుటుంబం, సమాజం విధించిన బాధ్యత ప్రధానంగా ఉంటుంది. ఆ బాధ్యతను సక్రమంగా నెరవేర్చటమే ప్రేమ అని అనలేం. మన సహచ రులను స్వేచ్ఛగా మనమే ఎంచుకున్న పుడే అది ప్రేమ అవు తుంది. ఆ ప్రేమకు బాధ్యత వహిస్తూ పెళ్లిలోకి వెళ్ళినపుడు కలిగే అనుభూతి వేరు.

ఇద్దరు వ్యక్తుల మధ్య కలిగిన ప్రేమ భావన లోని గట్టిదనాన్ని పెళ్లికి ముందే పరీక్షించుకోవటం మంచిది. కానీ పరీక్షించుకునేదెలా? భావాలూ, ఆలోచ నలూ, అభిరుచులూ ఒకటే కావచ్చు. కానీ ఆచరణలో రకరకాల తేడాలుంటాయి. ఆ తేడాలు ఈ ప్రేమ భావనను బలహీన పరి చేంత బలమైనవా అని తెల్చుకోవటం మంచిది. ఇద్దరూ

కలిసి ఒక పని చేస్తే, ఆ క్రమంలో ఒకరి జీవనశైలి ఒకరికి అర్థమవుతుంది. వాళ్ళ పద్ధతులతో మనం సహజీవనం చేయగలమా లేదా అనేది స్పష్టమవుతుంది. అందువల్ల ప్రేమికులిద్దరూ కలిసి ఏదో ఒక పనిచేసి క్రియాత్మకంగా తమ ప్రేమను పరీక్షించుకోవాలని ఉప్పల లక్ష్మణరావుగారు 'అతడు - ఆమె' నవలలో చెబుతారు.

స్త్రీ పురుష సంబంధాలలో ప్రేమ ఉన్నప్పుడు శాంతి ఆనందం కలుగుతాయి. అవి లేనిచోట అశాంతి, ద్వేషం, హింస ఏదో ఒక స్థాయిలో చోటు చేసుకోక తప్పదు. ఐతే స్త్రీ పురుషుల మధ్య నిజమైన ప్రేమ ఎప్పుడు సాధ్యపడుతుంది? ఇద్దరూ సమానులుగా ఉన్నప్పుడు మాత్రమే. అసమానుల మధ్య అచ్చమైన ప్రేమ సాధ్యం కాదు. అది రక్షణ నిస్తున్నామనే ఆధిపత్య భావనో, సేవలు చేస్తున్నామనే దాస్య భావనో అవుతుంది. ఆ భావనలోంచి కూడా ఆనందం ఒకోసారి మనుషులు పొందుతారు. యజమానుల, సేవకుల బంధంలోంచి వచ్చే సంతోషాల గురించీ, వాళ్ళ అనుబంధాల గురించీ మనం వింటాం. చదువుతాం. అలవాటువల్లా, అవతలివారి మంచితనం వల్లా యజమానీ సేవకుల బంధంలో కూడా కొన్ని సంతోషపు అనుభూతులు కలగవచ్చు అలాగే అసమానులైన స్త్రీ పురుషుల సంబంధంలో కూడా సంతోషపు అనుభూతులు కొన్ని ఉండవచ్చు ఆ సంబంధాలు సామరస్యంతో మరీ హింసాపూరితం కాకుండా నడవవచ్చు కానీ అది ప్రేమ సంబంధం కాదు. గాఢతలో, లోతులో, అసలైన సారాంశంలో సమానుల మధ్య కలిగే ప్రేమ ఉన్నతమైనదిగా ఉంటుంది. అది గుణాత్మకంగా వేరుగా ఉంటుంది. ప్రేమలో ఔన్నత్యానికి వెళ్లటం సమానుల మధ్యే సాధ్యపడుతుంది. సమానత్వం అంటే ఇద్దరికీ ఒకే డిగ్రీ ఉండటం, ఒకే కులానికో, వర్గానికో చెందటం కాదు. తాము వ్యక్తిగతంగా, సాంఘికంగా సమానావకాశాలు, హక్కులు, బాధ్యతలూ ఉన్న వ్యక్తులమని గుర్తించి, ఒకరి హక్కులను ఒకరు గౌరవించుకుంటూ, ఒకరికొకరు సహకరించుకుంటూ సహజీవనం గడపటాన్ని స్త్రీ పురుష సంబంధాలలో సమానత్వంగా మనం చెప్పవచ్చు

ఇద్దరూ సమానులుగా ఉండి, ఇద్దరికీ ఆర్థిక స్వాతంత్ర్యం ఉండి, ఒకరి ప్రేమ నొకరు కావాలనుకున్నప్పుడు ఇక వివాహం అవసరమా అన్న ప్రశ్న కూడా చాలా కాలం నుండీ ఆలోచింపచేస్తూ ఉంది. అప్పుడు వివాహం కేవలం ఒక తంతుగానే మిగులుతుంది. నిజానికి ఇప్పటికీ అది తంతుగానే ఉంది. వివాహం నుంచి స్త్రీలకు రక్షణ దొరుకుతుందని ఇవాళ మనం చెప్పగల స్థితిలో ఉన్నామా? రక్షణ నివ్వకపోగా అది స్త్రీలకు బంధనంగా, ఉరి తాడుగా మిగులుతోంది. ఆస్తులు మాత్ర మే ముఖ్యమైన వివాహం వ్యాపారంగా మారి చాలా రోజులైంది. ప్రేమ వివాహాలో, సంబంధాలో కాక పోయినా, ఇదొక వ్యాపార సంబంధమనే స్పృహతో ఆడపిల్లలు వివాహాలు చేసుకున్నా కాస్త తెలివిగా బతక గలుగుతారు. వివాహం పవిత్రం, అవిచ్ఛిన్నం అనే భ్రమలో పడి ప్రేమ మాట దేవుడెరుగు కనీస మనుగడ దుర్భరం చేసుకునే వాళ్లే ఎక్కువ. ప్రేమలేని వివాహం కంటే, వివాహం లేని ప్రేమ సంబంధం, సమానత్వం, ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్న ప్రేమ సంబంధం నయమని కొందరు భావిస్తున్నారంటే డొల్లబారిన వివాహ వ్యవస్థదే లోపం.

ప్రేమ దొరకటం, దానిని పొందటం, కాపాడుకోవటం ఇవి జీవితంలో అమూల్యమైన విషయాలు. వీటిని కావాలనుకునే వారు ముందు సమాజంలో ప్రేమ అంటే ఉన్న భ్రమలను పోగొట్టుకుని, అనేక కోణాలనుంచి ఆలోచించాలి. ప్రేమకు సమానత్వం జీవధాతువనే విషయం గుర్తించాలి. స్త్రీ పురుష సంబంధాలకు ప్రేమ మాత్రమే ప్రాతిపదిక కావాలి.

–ఓల్గా ✦

# సామగానం

ఫ్లాష్‌బ్యాక్

— శ్రీవిరించి

నాటి చతుర



నాటి నవల

ఫిబ్రవరి 1979: సంపుటి: 2 సంచిక: 1

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. 1979వ సంవత్సరం ఫిబ్రవరి నెల **చతురలో** ప్రచురించిన **'సామగానం'** నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

**కూ**తురికి ఇతోధికంగా ప్రేమానురాగాలు పంచి, అల్లారుముద్దుగా పెంచి, సంగీత విద్యలో నిష్ణాతురాలిని చేసిన తల్లిదండ్రులే తమ స్వార్థం కోసం ఆమె బంగారు భవిష్యత్తుకు అడ్డుతగలడాన్ని మించిన అన్యాయం మరొకటుండదు. తనకు కావలసినదేమిటో, తల్లిదండ్రుల అంతరంగమేమిటో తెలుసుకున్న ఆ యువతి మూగబోయిన తన హృదయవీణను శ్రుతి చేసుకుని రసరాగాలు పలికించుకుంది. సరైన వేళకు సరైన నిర్ణయం తీసుకుంది. ముందుగా ఆశ్చర్యంతో పెద్దలు తబ్బిబ్బయినా తరువాత తథాస్తు అనక తప్పని పరిస్థితిని కల్పించింది.

ఈ వైనాన్ని 'శ్రీ విరించి' 'సామగానం' చేసి మరీ పాఠకుల వీనులకు విందు చేయటం ఈ 'సామగానం' నవల ప్రత్యేకత.

**ఇక నవలలోకి తొంగిచూస్తే:**

ఆ రోజు భానుమూర్తి చెల్లెలు శకుంతల టౌన్‌హాల్‌లో సంగీత కచేరీ చేస్తోంది. భానుమూర్తి ఓ రెండు గంటలు ముందే మిత్రుడు సుందరం గదికి వెళ్ళి కచేరీకి ఆహ్వానిస్తాడు. బలవంతంగా అతడిని తీసుకువచ్చి చెల్లెలికీ, ఆమె గురువుగారికీ పరిచయం చేస్తాడు. సుందరానికి సంగీతం గురించి ఏమీ తెలియకపోయినా శకుంతల పాడగా ప్రసారమైన సంగీత తరంగాలతో నిండిన తన మనసు పరవశించటం గుర్తిస్తాడు. ఇక నిజంగా సంగీతంలో పాలు పంచుకుని వింటాడు. రసానుభూతికి లోనవుతాడు. సంగీత కచేరీ జయప్రదంగా ముగిసి, శ్రోతల మన్ననలందుకున్నందుకు సంతోషిస్తూ ఇంటికి వస్తారు భానుమూర్తి, శకుంతల, శకుంతలకు సంగీతం నేర్పిన గురువు రామనాథంగారు.

శాంతమ్మ, గోపాలం దంపతులకు రమణ,

భానుమూర్తి, శకుంతలలు సంతానం. ఉద్యోగం సంపాదించి పెట్టే జీతం డబ్బుతో సంసారం పొదుపుగా నెట్టుకొస్తాడు గోపాలం. మరో పది సంవత్సరాలు పని చేస్తే పిల్లలకు ఓ మార్గం ఏర్పడుతుందను కుంటుండగా పక్షపాతం పాలబడతాడు. ఆయన మంచంలో పడేనాటికి రమణ స్కూలు ఫైనలులో, భానుమూర్తి కింది తర గతులలో ఉన్నారు. మూడవ సంతానం శకుంతల.

తండ్రి మంచాన పడటంతో కుటుంబ భారం రమణ మోయలేక తప్పలేదు. తాలూకా ఆఫీసులో అటెండరుగా చేరిపో తాడు. తరువాత గుమస్తాగా ప్రమోషన్ ఇస్తామని చెప్పటంతో కొంతలో కొంత ఊరట కలిగిందతనికి. నెలనెలా జీతం డబ్బులు తల్లికిచ్చేవాడు. ఆమె గుంభనంగా కుటుంబం వెళ్ళదీస్తుంటుంది. భానుమూర్తి పదవ తరగతి ఫెయిలవుతాడు. శకుంతల ఎలిమెంటరీ స్కూలు చదువుతూనే బడి మానేసింది. కంఠం శ్రావ్యంగా ఉండటంతో తల్లి దగ్గర ఆధ్యాత్మిక రామాయణ కీర్తనలు, ఇతర సాంప్రదాయపు పాటలు నేర్చు కుంటూ ఉండేది. కూతురుకు సంగీతం నేర్పించాలనే పట్టుదల శాంతమ్మలో ఎక్కువ వుతుంది.




అంతలో గోపాలం స్నేహితుడు రామ నాథం వీళ్ళ ఇంటికి వస్తాడు. ఆ ఊళ్ళో అరుణాచలంగారి అమ్మాయిలకు రోజూ గంట సేపు సంగీతం చెప్పటం, సాధన చేయించటం, వారిచ్చే డబ్బుతో కుటుంబాన్ని పోషించుకోవటం చేస్తున్నానంటారు. శకుం తల పాడటం విని "అమ్మాయి గొంతు అతి శ్రావ్యంగా ఉంది. శాస్త్రీయ సంగీతం చెప్పిం చండి" అని సలహా ఇస్తాడు రామనాథం. అంతే కాదు, "బాబు గారూ! మీకు అభ్యంతరం లేకుంటే నేనే నేర్పుతాను" అంటాడు. గోపాలం అంగీకరిం చగా పాఠాలు నేర్పటం మొదలు పెడతాడు. శకుంతల చక్కగా అభ్యాసం చేస్తుంటుంది. నాలుగు సంవత్సరాలు గడిచేసరికి సంగీతం విద్య శకుంతలకు కరత లామలకం అవుతుంది. శకుంత లకు సంగీతం నేర్పడం వల్ల తన జన్మ ధన్యమైందనుకుంటాడు రామనాథం.

మొదట్లో తనకు సంగీతం అంటే ఆసక్తి లేకపోయినా శకుం తల కచేరీ విన్నాక ఆసక్తి ఏర్పడటం గమ నిస్తాడు సుందరం. ఓ రోజు భాను మూర్తితో పాటు వాళ్ళింటికి వెళతాడు. అంతకు ముందు శకుంతల పాడుతూ ఆపే సిన కీర్తన కొనసాగిస్తుంది. కీర్తనలు ముగి శాక "బాగా పాడారు. మీ కచేరీ ఆ రోజు బాగుంది" అని పొగుడుతాడు. భానుమూర్తి సుందరాన్ని తన తండ్రి గోపాలానికి పరి చయం చేస్తాడు.

శకుంతల సంగీతం ప్రారంభించిన వేళ శుభప్రదమైనదనే చెప్పక తప్పదు. విద్య లభించడం ఒక ఎత్తు. దానికి తగిన ప్రచారం

లభించడం మరో ఎత్తు. శకుంతలకు మొదటి సంగీత కచేరీతోనే మంచి పేరు వచ్చేసింది. వారం రోజులైనా తిరగకుండా ఓ సంగీత సభ నిర్వాహకులు ఇద్దరు వచ్చి శకుంతల కచేరీ ఏర్పాటు చేయదలచామని మూడువందలు ఇస్తామనీ చెబుతారు. గురువు రామనాథం నాలుగువందలిమ్మని వారిని ఒప్పిస్తాడు. వారు అంగీకరించడంతో ఆర్కెస్ట్రా వారికి అందులోదే కొంత డబ్బిచ్చి మిగతాది శకుంతలకు ఇస్తాడు.

శకుంతల ఆ డబ్బును తల్లికివ్వగా గురుదక్షిణ కింద రామనాథానికి పట్టుబట్టలు పెడతారు. "శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు" అంటూ ఆయన దీవించటం భానుమూర్తికి రుచించదు. "ఈ పెద్దలకు పెళ్ళి రంధే ఎప్పుడూ" అనుకుంటాడు. శకుంతల చేత కొన్ని కీర్తనలు గోపాలం ఎదుట పాడిస్తాడు రామనాథం. అప్పుడే వచ్చిన సుందరం కూడా ఆమె గాన మాధుర్యానికి పరవశించి పోతాడు.

శకుంతల సంగీతాన్ని గురించి పత్రికలు శ్లాఘిస్తూ సమీక్షలు రాస్తాయి. గురువుగారు ఆలిండియా రేడియో వారికి శకుంతల తరపున దరఖాస్తులు పంపుతాడు. కర్నాటక సంగీత కచేరీలు రేడియో ద్వారా ప్రసారం చేయడానికి ఆడిషన్‌కు రమ్మని రేడియో స్టేషన్‌నుండి జవాబు వస్తుంది. శకుంతల మరింత శ్రద్ధగా సాధన చేస్తుంటుంది. రెండు మూడు నెలల్లో ఐదారు సంగీత కచేరీలు చేస్తుంది. పై ఊళ్ళలో కచేరీలు చేయడానికి సైతం అవకాశాలు వస్తాయి. అన్న భాను మూర్తి డబ్బు లావాదేవీలు చూసుకుంటూ, తారీకులు నిర్ణయిస్తూ చెల్లెలుకు తోడుగా పొరుగూళ్ళ కచేరీలకు కూడా వెళుతుంటాడు. అతనికి అదో మంచి కాలక్షేపమేగాక డబ్బు సంపాదనకు మార్గమైంది. రేడియోలో పాడడానికి కూడా అవకాశాలు ఎక్కువగానే వస్తుంటాయి.

సంగీతం పట్ల అభిమానం ఉన్నవాళ్ళంతా శకుంతలను గౌరవిస్తూ, అభిమానిస్తారు. తన పట్ల ఎంతో ఆరాధన, అనురాగం, అభిమానం ప్రదర్శించి పరిచయం పెంచుకోజూస్తున్న వారిని చూసి ఇదంతా తన సంగీతానికేగాని తనకేమాత్రం విలువ లేదనుకుంటూ ఉంటుంది శకుంతల. సంగీత కచేరీకి ముందు తొలుత కొందరు అభిమానులు తన చుట్టూ చేరి రకరకాల ప్రశ్నలు వేయటం మొదట్లో ఆశ్చర్యంగా ఉండేది. రాను రాను వాటికి అలవాటు పడిపోతుంది.

రేడియోలో సంగీత కచేరీలతోపాటు సంగీత రూపకంలో పాల్గొనే అవకాశమూ వస్తుంది. ఆ సందర్భంలోనే రాజేశ్వరితో పరిచయమేర్పడుతుంది. రాజేశ్వరి ఆహ్వానం మేరకు ఆమె ఇంటికి వెళుతుందో సారి. ఆమె ఇల్లు, సంసారం, భర్త, పిల్లలు, ఆమె సంగీత సాధనకు భర్త ఇస్తున్న ప్రోత్సాహం, సంసారం-సంగీతం చూసి "అదృష్టవంతురాలు రాజేశ్వరి" అని అనుకోకుండా ఉండలేకపోతుంది శకుంతల. సంగీత విద్వాంసులలో పరస్పరం ఉండే అసూయాద్వేషాలు, ఒకళ్ళనొకళ్ళు పడదొక్కాలనే ప్రయత్నాలు, సంగీత సభల వాళ్ళలో ఉన్న రాజకీయాలు వివరిస్తుంది రాజేశ్వరి. అది శకుంతలకు అనుభవమవుతుంది. రేడియోలోనేగాక కచేరీ చివర్లో కూడా శ్రోతలు అష్టపదులు, తరంగాలు, లలితగీతాలు పాడమని కోరుతుండడంతో వాటి అభ్యాసం కూడా చేసింది శకుంతల.

శకుంతలకు ఆ తరువాత రాష్ట్రం నలుమూలలనుండీ ఆహ్వానాలు వస్తుంటాయి. త్యాగరాయ ఉత్సవాలు జరిగేటప్పుడు ఎక్కడికి వెళ్ళాలి, ఎక్కడికి అక్కర్లేదో తేల్చుకోవడమే కష్టమైపోతుంది. ఒక సంవత్సరం గడిచేటప్పటికి ఆమె కార్యక్రమాలలోనేగాక దినచర్యలోనూ మార్పులొచ్చాయి. బ్యాంక్ బ్యాలన్స్ ఊహించనంతగా పెరిగింది.

భానుమూర్తి పాత ఇంటినుండి మేడమీదికి తమందరి మకాం మార్చాడు. కట్టుబ

ట్టల ప్రమాణం పెరిగింది. గోపాలానికి మంచి, ఖరీదైన వైద్యం చేయిస్తున్నారు. "మా శకుంతల వల్ల మాకు మళ్ళీ మంచి రోజులొచ్చాయి" అనేది శాంతమ్మ. ఆనం దంతో మెరిసే కళ్ళతో.

శకుంతలకు ఇది ఆనందించవలసిన తరు ణమే అయినా జీవితంలో ఎదురవుతున్న హడావిడి, బాదరబందీ కష్టమనిపిస్తున్నాయి. భానుమూర్తి నిర్ణయాల ప్రకారం తను ఆచ రిస్తూ వెళ్ళాలంతే. శకుంతలకు ఒకసారి ఒంట్లో బాగా లేదు. జ్వరం. ప్రయాణం వలన ఆరోగ్యం దెబ్బ తింటుందేమోనని అభ్యంతరం చెప్పినా వినక బలవంతపెట్టి కచేరీకి తీసుకువెళ్ళటంతో శకుంతల నొచ్చు కుంటుంది. అలా శకుంతలకు రోజులు యాంత్రికంగా గడచిపోతుంటాయి. అందరి తోనూ తానే సర్దుకుపోవాలి. తన మనసు ఎరిగి తనకు కావలసిన తృప్తి, ఉత్సాహం ఎక్కడ ఉన్నాయో వెదికిచ్చేవాళ్ళే కరువవు తున్నారు అనుకునేది అప్పుడప్పుడు.

రేడియో ఆఫీసర్ దేశికన్, గురువుగారు రామనాథం కలిసి శకుంతలకు ఓ పెళ్ళి సంబంధం తెచ్చారు. కుర్రాడు ఓ కచేరీలో శకుంతలను చూశాడనీ, అతడు సంగీత ప్రియుడనీ, శకుంతలను బాగా ఇష్టపడుతు న్నాడనీ, అబ్బాయి డాక్టర్ అనీ దేశికన్ చెప్పడంతో పెళ్ళిచూపులు ఏర్పాటు చేశారు. పెళ్ళిచూపులు ముగిశాక పెళ్ళికొడుకే అమ్మా యిని వెదుక్కుం టూ వచ్చాడు. ఇంతకంటే కావలసినదేముంది అంటున్న తన తండ్రితో "మన అమ్మాయికి అప్పుడే పెళ్ళేమిటండీ" అని అంటున్న తల్లి శాంతమ్మ మాటలు విని ఆశ్చర్యపోతుంది శకుంతల. "ఇంతకూ అమ్మాయిని కనుక్కున్నారా?" అని గోపాలం ప్రశించగా, "పిచ్చిపిల్ల దానికేం తెలుసు భయపడుతుంది" అంటుంది శాంతమ్మ. పక్క వరండాలో నుండి లీలగా ఈ మాటలు విన్న శకుంతల గుండెలు "అబద్ధం అబద్ధం" అని కొట్టుకున్నాయి. వరుడికి ఏదో వంకలు పెట్టి అన్నా, తల్లీ ఆ సంబంధం క్యాన్సిల్ చేసేస్తారు.

సుందరం కథలు రాస్తాడని తెలిసి కథల గురించి అతనితో చర్చించింది ఓసారి శకుం తల. అతని కథలు చదువుతాను ఇమ్మని అడుగుతుంది. అలా కాసేపు సంభాషణ గడిచాక "నాలో ఏ ఔన్నత్యము లేదు. మనిషిగా నేను మామూలుదాన్నే. అందరు ఆడపిల్లల వంటిదాన్నే. నాకూ నలుగురిని చూసి జీవితం అంటే ఏమిటో ఆలోచించు కోవడం, అన్నిటినీ అనుభవించాలను కోవడం, తపించటం ఉంటాయి" అనటంలో సుందరం ఆలోచనలో పడిపోతాడు.

ఓసారి పక్క ఊళ్ళో సంగీత కచేరీ ఉన్నా స్కూలు ఫైనల్ పరీక్షలున్నాయి గనుక భాను మూర్తి శకుంతలకు తోడుగా వెళ్ళలేక సుందరాన్ని పంపిస్తాడు. ఆ సందర్భంలోనే ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నారు శకుంతల, సుందరం. మొదటి బిడియాలు, భయాలు, సంకోచాలు తొలగిపోగా స్నేహి తుల్లా పరస్పరం తమ అభిప్రాయాలు చెప్పు కుంటుంటారు.

ఆ తరువాత శకుంతలకు ఓ ఐ.ఎ.యస్. ఆఫీసర్ సంబంధం వచ్చినా "అంత పెద్ద ఆఫీసర్లతో మనకు పొసగుతుందా" అని ఊరుకుంది. కూతురి సంపాదనలో ఇంటిల్లి పాదీ నిశ్చింతగా తిండికీ, గుడ్డకు లోటు లేకుండా గడుపుతున్నారు. శకుంతలకు పెళ్ళి చేసి పంపిస్తే ఆమె సంపాదనపై తమకు హక్కు ఉండదు. తమకు పాత రోజులే ఎదురొస్తాయి. కనుక సాధ్యమై నంత వరకు ఆమె పెళ్ళిని జరగకుండా చూడలన్నదే శాంతమ్మ, భానుమూర్తిల ప్రయత్నం అయింది మరి! "చిన్న పిల్ల... దానికేం తెలుసు? ఇవి పెద్దవాళ్ళు ఆలోచించాల్సినవి. అయినా మా శకుంత లకు ఇప్పుడిప్పుడే పెళ్ళి ఇష్టం లేదు కూడాను" అని ప్రచారం చేస్తుంటారు.

శకుంతలకు తనమీద తనకే కోపం పెరి

గిపోతుంది. తెగబడి మాట్లాడటం చేతగాక మనసు నొక్కేసుకుని కూర్చోలేక సతమతమవుతుంది. తనకీశాపం ఎందుకో అర్థం కాదామెకు. ఎవరికి చెప్పుకోవాలి? ఏం చెప్పుకోవాలి? చెప్పుకోకుండా ఉండటమెలా? సమస్యల సంధిలో పడిపోయిందామె. శకుంతలలో వస్తున్న మార్పులను శాంతమ్మ గ్రహించలేకపోలేదు. ఎంతైనా ఆమెదీ స్త్రీ హృదయమే! అంతలోనే "రమణది ఎదుగూ బొదుగే లేని జీవితం. భానుమూర్తికి కుదురు ఏర్పడలేదు. అమ్మాయికి ఏం తక్కువ చేస్తున్నాం? " అనుకునేది. తల్లి కృత్రిమ ఆప్యాయతే శకుంతలకు మెత్తని ఉరితాడు అనిపించేది.

ఓ రోజు సుందరం తమ ఇంటికి వచ్చినప్పుడు రమణ, "శకుంతల అడవిలో పూసిన మల్లెపూవులా వాడిపోవలసిందేనా అని అనుకుంటూ ఉంటాను. లాభం లేదు మాస్టారూ! వాళ్లు శకుంతలకు పెళ్లి చేయరు. దాన్ని చూస్తే కడుపు తరుక్కుపోతోంది నాకు. శకుంతలకు తనను ప్రేమించే మనిషి కావాలి సుందరంగారూ! డబ్బు, గౌరవం, పరువు ప్రతిష్ఠ ఇలాంటివి దానికి లెక్కలేదు. శకుంతలకు మీరంటే ఇష్టం. ప్రేమ. దాని మనసులో మీరు నిండి ఉన్నారు. మిమ్మల్ని బలవంతం చేయటం లేదు. శకుంతల సుఖపడాలంటే, మామూలు మనిషి కావాలంటే ఇదొక్కటే మార్గమని నా నమ్మకం" అంటాడు రమణ. సుందరం ఆలోచిస్తాడు.

వారం రోజుల తర్వాత సుందరం వచ్చేసరికి శకుంతల కళ్లు మూసుకుని పాడుతోంది. ఐదు నిమిషాల తరువాత గమనించి పలకరించింది. "వంట్లో బాగా లేదని తెలిసింది. ఎలా ఉందిప్పుడు? " అడుగుతాడు సుందరం. "చూస్తున్నారుగా" అంది నీరసంగా శకుంతల. "సరే పోనివ్వండి ఇంకేమిటి? మామూలుకు భిన్నంగా ఏమి చేయలేమా" అని ప్రశ్నించాడు. శకుంతల నవ్వి ఊరుకుంటుంది. అందులోనే అతనికి జవాబు దొరికింది.

ఓ రోజు ఉదయం తొమ్మిదికే బయటకి వెళ్లింది శకుంతల. పదకొండున్నరకు సుందరం, శకుంతలలు కలిసి టాక్సీ దిగివచ్చారు. వధూవరులను చూసి గోపాలం ఆశ్చర్యపోయి భార్యను అక్షింతలు తెమ్మంటాడు. "చిరకాలం చల్లగా వర్థిల్లండి" అని ఆశీర్వదిస్తారు. జరిగినదేమిటో అర్థమైన శాంతమ్మ యాంత్రికంగా ఆశీర్వదించింది. హడావిడిగా బయటకు వచ్చిన భానుమూర్తికి మాత్రం గుండెలు గుభేలుమన్నాయి. "భానుమూర్తీ! ఇప్పుడే అరగంట క్రితం మేం రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి చేసుకున్నాం. మీ అమ్మా నాన్న రెండు నిమిషాల క్రితం ఆశీర్వదించారు" అన్నాడు సుందరం. భానుమూర్తి సుందరాన్ని నోటికొచ్చినట్లు తిడతాడు. శంకుతల నోరు విప్పి అన్నగారికి ఇది తన ఇష్టం మేరకే జరిగిందని వివరించినా భానుమూర్తి కోపం చల్లారదు.

"అమ్మాయికి కావలసినదేదో తెచ్చుకుంది. అనవసరంగా నోరు పారేసుకుని వెర్రివాడివి కాకు"అని కొడుకును హెచ్చరిస్తాడు గోపాలం.

"బాబుగారూ శకుంతల ఇష్టప్రకారమే చేశాను. ఇందులో నాకేం స్వార్థం లేదు. ఇక వెళ్లొస్తా" అంటున్న సుందరాన్ని భోజనాలు చేసి వెళ్లమంటాడు గోపాలం.

దాంతో నవల ముగుస్తుంది.

తమ కుటుంబం సాఫీగా గడిచిపోవాలనీ, అవసరాలు తీరాలనీ, అందుకు కూతురు పెళ్లి కాకుండా తమ దగ్గరే ఉంటే ఆమె సంపాదన తమకే చెందుతుందనే స్వార్థంతో కూతురు భవిష్యత్తును బలిచేసే తల్లిదండ్రులు, అన్నదమ్ములు ఉంటారనే వాస్తవాన్ని మరోసారి గుర్తు చేసిందీ నవల. ఎవరెలా ప్రవర్తించినా నిరాశతో కుంగిపోక తనకేం కావాలో, ఎవరు కావాలో ఆలోచించి సరైన వేళకు, సరైన నిర్ణయం తీసుకోవలసింది యువతులేననే సందేశాన్నీ ఇచ్చింది. ✦

# గిన్నీస్ మ్యూజియం

## చతుర ప్రపంచం




గిన్నెస్ బుక్ చదివి ఆనందిం చేవారు, ఆ పుస్తకం అభి మానులు-కేవలం ఆ గ్రంథాన్ని చదవడం వల్ల లభించే ఆనందాన్నే కాక దాన్ని మించిన విభ్రమం కావాలని కోరుకుంటారు! ఆ రికార్డు లను తమ కళ్లముందే ప్రత్యక్షంగా చూడాలని ఉవ్విళ్లూరుతారు.

అటువంటి అభిమానుల ఆకాంక్ష నెరవే ర్చడం కోసం గిన్నెస్ బుక్ వారు, తమ రికార్డ్‌లో చోటు చేసుకున్న అనేక అద్భుత విశేషాలను చక్కగా తీర్చిదిద్ది, వాటితో ఒక మ్యూజియం నెలకొల్పారు!

ఆ మ్యూజియంలో, ఒక అతి పొడవైన మనిషీ, అతి స్థూలకాయుడైన ఆసామీ, ముమ్మూర్తులా మనుషులు అనే భ్రాంతి కలిగించే రీతిలో కొన్ని శిల్పాలు ప్రేక్షకుల ముందు ప్రత్యక్షమవుతాయి! లండన్‌లోని పికాడిల్లీలో గల ట్రొకాడెలో సెంటర్లో ఈ గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్ మ్యూజియంను ఏర్పాటు చేశారు. బస్‌లో హాయిగా ఆ ప్రదేశానికి చేరుకోవచ్చు. ప్రదర్శన తిలకిం చడానికి పెద్దలకు 5 డాలర్లు, పిల్లలకు 3 డాలర్లు చెల్లించవలసి ఉంటుంది. లోపల వీడియోలు, సౌండ్ ఎఫెక్ట్స్, స్పెషల్ లైటింగ్స్ నడుమ సజీవ చిత్రాలా అనిపించే శిల్పాలు చూపరులకు

### గజల్ రాజు

పిన్నల్లో పెద్దల్లో కొంతకాలంగా ఏదో ఒక రంగంలో తమ ప్రతిభతో రికార్డ్ నెలకొల్పి, 'గిన్నెస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్'లోకి గానీ, 'లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్'లోకి గానీ ఎక్కాలనే ధ్యేయం ఎక్కువగా కనిపి స్తోంది. మధ్యప్రదేశ్‌లో గల దెవాస్ అనే ఊళ్లో రాజ్‌కుమార్ చాందర్ అనే 51 సంవత్సరాల వ్యక్తి ఉన్నాడు. అతనికి గజల్స్ రాయడం అంటే చాలా ఇష్టం. అందులో ప్రతిభ కూడా సాధిం చాడు. ప్రపంచ శాంతిని కోరుతూ ఓ అతి పెద్ద గజల్ రాశాడు. అందులో 10 వేల గజల్స్ ఉన్నాయి! ఆ విధంగా రాజ్ కుమార్ ఓ రికార్డ్ సృష్టించి, గజల్ రచనలో రాజుగా నిలిచాడు.



## విరబూసిన గోరింట

యాష్‌కుమార్ అనే యువకుడు తన ప్రతిభతో సరాసరి 'గిన్నెస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్'లోకి ప్రవేశించాడు! 'హెన్నా డ్రాయింగ్'లో అతను రికార్డ్ నెలకొల్పాడు. గోరింట అన్నా, అందుకు సంబంధించిన డ్రాయింగ్ అన్నా యాష్‌కు మక్కువ. అతను చేతుల మీద, భుజాలపై 134 మందికి ఒక గంటలో హెన్నా డిజైన్స్ చేశాడు. డిజైన్లు 17 సెం.మీ పొడవు, 5 సెం.మీ వెడల్పు ఉన్నాయి. లండన్‌లో ఉంటున్న యాష్ ఫోరెన్సిక్ సైన్స్‌లో డిగ్రీ పొందాడు. హెన్నా పెయింటింగ్‌లో 10 సంవత్సరాల నుంచీ కృషి సలుపుతున్నాడు. తనకు తెలిసిన వారినందరినీ పిలిచి, వారి చేతులపై హెన్నా డ్రాయింగ్ వేసేవాడు. అతని ప్రతిభ విని, జూలియా రాబర్ట్స్, మెడొన్నా, హెల్విన్ క్లెయిన్, సోఫేథాల్, విక్టోరియా బెక్‌హామ్‌లు క్లయింట్‌లుగా మారారు. మరొక విశేషం ఏమంటే 7 ఖండాలలోనూ అతిచిన్న హెన్నా ఆర్టిస్ట్ అతనే! అంతేకాక ఆ రంగంలో పాల్గొన్న ఏకైక యువకుడు!

అబ్బురపాటు కల్గిస్తాయి. అవన్నీ గిన్నెస్ బుక్‌లో రికార్డు సృష్టించినవే.

ఆ మ్యూజియంలో రికార్డులను 6 వివిధ భాగాలుగా ఏర్పాటు చేశారు. అవి మానవ ప్రపంచం, జంతుప్రపంచం, ప్లానెట్ ఎర్త్, స్ట్రక్చర్స్, మెషీన్లు, ఎంటర్‌టైన్‌మెంట్. జంతు



ప్రపంచంలో అతి పొడవైన వ్యక్తిగా రికార్డు సృష్టించిన రాబర్ట్ సెర్లింగ్ వాడ్లో ప్రతిమ వద్ద సందర్శకులు

ప్రపంచంలో, వీడియోలో వివిధ రకాల జంతువులను, వాటి అలవాట్లను, ప్రవర్తనను మనం చూస్తున్నప్పుడు - ప్రకృతి ఒడిలో ఉండి, మన కళ్లముందే ఆ జంతుజాలం సంచరిస్తున్న అనుభూతి కలుగుతుంది!

ప్లానెట్ ఎర్త్ విభాగంలో మానవుడు రోదసిలో సాధించిన అద్భుత విజయాలు స్పుత్నిక్ విశేషాలు- పిన్నలకు, పెద్దలకు విజ్ఞానాన్ని అందిస్తాయి. ఎంటర్‌టైన్‌మెంట్ విభాగంలో, ప్రపంచ వ్యాప్తంగా సంచలనం సృష్టించిన చిత్రాల విశేషాలు, ముఖ్య సన్నివేశాలు, ఆస్కార్ పురస్కారం పొందిన చిత్రాలలోని కీలక సన్నివేశాలను నయనానందకరంగా ప్రదర్శిస్తున్నారు. హ్యూమన్ వరల్డ్ భాగంలో ఆసక్తి, ఆశ్చర్యం కలిగించే వారిని కలుసుకుంటాం. ప్రపంచంలోనే అతిపొడవైన రాబర్ట్ సెర్లింగ్ వాడ్లో (అతను ఎంత పొడవైతే ఉన్నాడో, అంత పొడవైన రూపంలో) అతి బరువైన మనిషి (485 కేజీల బరువుతో యథాతథంగా) పూనాకు చెందిన మన భారతీయుడు శ్రీధర్‌చిలాల్ గోళ్లు (363.2 సెం.మీ పొడవు) నమూనా అచ్చుట సంభ్ర

మాశ్చర్యాలు కలిగిస్తాయి.

కెనడాకు చెందిన మార్క్ థాంప్సన్ హెబ్బర్ గురకను మనం టేప్ రికార్డ్‌లో వినవచ్చు. అతగాడు ప్రపంచంలోనే గొప్ప గురకల స్పెషలిస్ట్. అతని గురక 90 డెసిబిల్స్. ముళ్లు దిగిన పడకపై 274 గంటలు శయనించిన ఇంజ్ విడేర్ స్ప్రింజెన్ మనకు ఆశ్చర్యం కలిగిస్తే, శరీరమంతా అతి హెచ్చుగా పచ్చబొట్లు వేయించుకున్న అమ్మడు రష్టీఫీల్డ్, 13 బ్లేడ్లను మింగిన అమెరికాకు చెందిన ఎడ్వర్ బెంజమన్ మనకు అక్కడ కనిపించి ఆశ్చర్యం కలిగిస్తారు.

## బుడుత రికార్డ్

ఆ బాలుడి పేరు సుదర్శన్. వయస్సు 12 సంవత్సరాలు. చెన్నైలో ఉంటున్న ఆ డింభకుడు ఈ మధ్య ఓ రికార్డ్ సృష్టించాడు. 60 గంటల పాటు నీటిమీద తేలుతూ ఆ చిన్నారి గడిపాడు. ఇదివరలో 24 సం.రాల ఓ మహిళ 54 గంటల 27 ని.లు నీటిపై తేలి రికార్డ్ నెలకొల్పింది. దీన్ని సుదర్శన్ బద్ధలు కొట్టి తానొక కొత్త రికార్డ్ సృష్టించాడు.

యానిమల్ వరల్డ్‌లో బ్లూవేల్ (తిమింగలం)కు చెందిన అతి పెద్ద ఎముక దిగ్భ్రాంతిని కలిగిస్తుంది. అతి పెద్దదైన జిరాఫీ, ఆఫ్రికాలోని పర్వతం వంటి కరిరాజు, పెద్ద రెక్కలు గల పక్షి మనకు విస్మయం కలిగిస్తాయి. తన పాలను వర్షంలా కురిపించి రికార్డు సృష్టించిన ఆవు మనకు ఎంతో కుతూహలం కల్గిస్తుంది.




మ్యూజియంలో ఏర్పాటు చేసిన సుమో భారీకాయుడి విగ్రహం

సంవత్సరంలోని 365 రోజుల్లో 353 గుడ్లను పెట్టిన కోడి మనకు ఆనందం కలిగిస్తుంది. డానిష్‌కు చెందిన ఓ పంది 34 పిల్లలు కన్న వైనం ఆశ్చర్యం కలిగిస్తుంది. మీరు లండన్ వెళ్లినప్పుడు గిన్నిస్ మ్యూజియంను తప్పక చూసి ఆనందిస్తారు గదూ!

## ట్యాగ్ వీరుడు

రాఘవ్ సోమాని 15 సం.రాల కుర్రవాడు. చెన్నైలో ఉంటున్న అతను గిన్నెస్ బుక్‌లోకి ప్రవేశించాడు. విమానాలలోని సూట్‌కేస్‌లకు బ్యాగ్‌లకు జతపరిచే 'బ్యాగేజ్ ట్యాగ్స్'ను అధిక సంఖ్యలో సేకరించడంలో అతను రికార్డ్ నెలకొల్పాడు. పేపర్, లోహం, చర్మాలతో రూపొందించబడిన 469 ట్యాగ్స్‌ను ప్రపంచానికి చెందిన వివిధ దేశాలవి రాఘవ్ సేకరించగలిగాడు. ఈ విషయం 'గిన్నెస్' వారికి తెలియజేశాడు. వారు ఆ సంఖ్య సరిపోదని, మరిన్ని సేకరించమని అతనికి రాశారు. రాఘవ్ విజృంభించి నెట్‌లో అనేక మందిని 'బ్యాగేజ్ ట్యాగ్'లను పోస్ట్ చెయ్యమని కోరాగా చాలా మంది ట్యాగ్స్ పంపారు. క్రమేపీ ఆ సంఖ్య అమితంగా పెరిగి అతడికి రికార్డ్ తెచ్చిపెట్టింది.





ఒక బంగ్లాదేశస్థుడు వ్యాపారం నిమిత్తం ఇంగ్లాండుకు వెళ్లాడు. ఓ రోజు డిపార్ట్‌మెంట్ స్టోర్‌కు వెళ్లి, షెల్ఫ్‌లోంచి పిల్లులకు పెట్టే ఆహారం వున్న టిన్ ఒకటి తీసి, క్యాష్‌కౌంటర్ వద్దకు వెళ్లాడు. అక్కడే వున్న స్టోర్ మేనేజర్,

"మిస్టర్! ఇదేమిటో నీకు తెలుసా?" అని అడిగాడు

"తెలుసు. ఇది పిల్లుల ఆహారం" చెప్పాడు.

"ఈ కేట్‌ఫుడ్ గురించి ఈ మధ్య కొన్ని కేసులు

# ఋజువు!

జరిగాయి. మనషులు తినే ఆహారం కన్నా ఇది చవక అవ్వడం వల్ల, కొందరు దీన్ని తీసుకువెళ్లి తమ పిల్లలకు పెడుతున్నారు. నువ్వు ఈ టిన్ తీసుకు వెళ్తున్నావు కనుక, నీ పిల్లిని తెచ్చి నాకు చూపించు" అన్నాడు మేనేజర్

వెంటనే బెంగాలీ బాబు ఇంటికి వెళ్లి, తనతో పిల్లులను తెచ్చి మేనేజర్‌కు చూపించాడు. వాటిని చూసి సంతృప్తి చెందిన మేనేజర్, బెంగాలీ ఆయనకు పిల్లుల 'ఆహారం ఇచ్చాడు.

కొద్ది రోజులు గడిచాక ఆ బెంగాలీ ఆసామీ స్టోర్‌కు మరొకసారి వెళ్లి తనకు కుక్కలు తినే ఆహారం ఉన్న టిన్ కావాలని మేనేజర్‌ను అడిగాడు.

"నువ్వు రెండు పిల్లులు పెంచుతూ, ఒక కుక్కను కూడా పెంచుతున్నావంటే నేను నమ్మను! కుక్క తిండి తీసుకువెళ్లి నువ్వు మీ పిల్లలకు పెడతావు! ఆ కుక్కను చూడందే నువ్వు చెప్పేది నేను నమ్మను!" మేనేజర్ సెలవిచ్చాడు అక్కడకు దగ్గర్లో మరోస్టోర్ ఏదీ లేకపోవడం వల్ల తప్పని పరిస్థితిలో ఇంటికి వెళ్లి కుక్కను తెచ్చి మేనేజర్‌కు చూపించాడు బంగ్లాదేశీయుడు.

ఓ వారం గడిచాక బెంగాలీ ఆసామీ ఒక బ్రౌన్ బ్యాగ్ తీసుకొని, స్టోర్‌కు హడావిడిగా వెళ్లి, "మీ చేతిని ఈ బ్యాగ్‌లో పెట్టండి" అంటూ ఒక బ్యాగ్ పట్టుకొని మేనేజర్ ముందు నిలబడి అన్నాడు. మేనేజర్ ఏమీ ఆలోచించకుండా బ్యాగ్‌లో చెయ్యిపెట్టాడు. వెంటనే అతను కంగారు పడ్డాడు. భయంతో, చిరాకుతో అతని ముఖకవళికలు మారిపోయాయి.

"ఇది... ఇది" అంటూ అతను బ్యాగ్ నుంచి చెయ్యి తీసివేశాడు.

"అవును అదే!" అన్నాడు బంగ్లా బాబు. మరుక్షణం మేనేజర్ బాత్‌రూమ్‌లోకి అతి వేగంగా వెళ్లి చేతిని సబ్బుతో శుభ్రం చేసుకున్నాడు. తర్వాత ఆసామి వద్దకు వచ్చి "ఎందుకిలా చేశావు?" అంటూ బిగ్గరగా అరిచాడు.

"మా అబ్బాయికి విరోచనాలవుతున్నాయి అవి తగ్గడానికి నాకు మందు కావాలి. నువ్వు నాకు మందివ్వాలంటే నేను నీకు ఋజువు చూపించాలి గదా! అందుకని ఈ బ్యాగ్‌లో ఋజువును తెచ్చాను!" చెప్పాడు బెంగాలీ బాబు.

మేనేజర్ మొహంలో కత్తిపోటుకు నెత్తురు చుక్కలేదు. బెంగాలీబాబు లోలోపల నవ్వుకున్నాడు!

## బాప్‌రే, అన్ని వేల ఇంజెక్షన్లా!

ఏ ఘు అనేక రికార్డులు సృష్టించడం గురించి విన్నారు, చూశారు. అయితే ఇటువంటి రికార్డ్ గురించి విని ఉండరు! నాగ్‌పూర్‌లోని ఓ హాస్పటల్ లిమ్కా బుక్‌లోకి ప్రవేశించింది. ఎవ్వరైనా ఒక ఇంజక్షన్ చేయించుకోడానికి, అంతో ఇంతో భయపడతారు. అటువంటిది ఆ హాస్పటల్‌కు వైద్యం నిమిత్తం వచ్చిన ఓ ఆసామి ఏకంగా 7 రోజుల్లో 20,530 ఇంజక్షన్లు చేయించుకున్నాడు. అతగాడు ఆత్మహత్యకు ప్రయత్నం చెయ్యడం వల్ల ఈ సూది మందుల కార్యక్రమం తప్పలేదు. అతణ్ణి బతికించడం కోసం డాక్టర్ వందలాది సూదులు, వేలాది మందులతో విపరీతమైన కృషి సలిపాడు! అనిల్ రాథోడ్ అనే అతను 300 మిల్లీలీటర్ల ఎండో సల్ఫాన్‌ను తాగాడు. తర్వాత హాస్పటల్‌కు చేరాడు. డాక్టర్ రాజేంద్ర చందక్ అతడికి 7,920 అట్రోపిన్ ఇంజక్షన్లు గంటకు 33 చొప్పున మొదటి 24 గంటలు చేశాడు. వారం రోజుల్లో కనీవినీ ఎరుగని రీతిలో ఆ ఇంజెక్షన్ల సంఖ్య పెరిగిపోయింది! చివరికి వాటి స్కోరు 20,530కు చేరింది! అంత వరకూ రాజేంద్ర లైఫ్ సపోర్టింగ్ సిస్టమ్ సహాయంతో ఉన్నాడు. చివరికి అతని శరీరంలో విష ప్రభావం పూర్తిగా తొలగింది. పిమ్మట అతణ్ణి డిస్చార్జ్ చేశారు.

డాక్టర్లు తాపీగా కూర్చుని తాము ఎన్ని ఇంజక్షన్లు చేసిందీ లెక్క వేసి, దిగ్భ్రాంతి చెందారు! ఇదివరలో ఒక విదేశంలో ఇటువంటి సందర్భంలో ఓ వ్యక్తికి 3 వేల ఇంజక్షన్లు చేశారని డాక్టర్ చందక్ పేర్కొన్నారు. అప్పటికి అదొక రికార్డు ఇప్పుడు చందక్ ఆ రికార్డ్‌ను నిలువునా బద్ధలు కొట్టాడు!

---

## ఎంత సచ్ఛీలుడో!

వొళ్లు వంచకుండా, ఏ శ్రమా పడకుండా ఉద్యోగం చేస్తూ జీతాలు పొందాలని కొందరు చూస్తూ ఉంటారు. వాళ్లందరికీ 'పనిగండం' ఉంది! తాము తీసుకొంటున్న జీతానికి తగినట్లుగా చిత్తశుద్ధితో పనిచేసేవారు కొంతమంది ఉంటారు. ఆ కోవకు చెందిన వాడు రాజేంద్రప్రసాద్. అతను ఢిల్లీలోని హార్టీకల్చర్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తున్నాడు. ఒక పూలతోటను, పళ్ల చెట్లను బహు శ్రద్ధగా పెంచేవాడు. పూలన్నా, పండ్లన్నా రాజేంద్రప్రసాద్‌కు మక్కువ ఎక్కువ. అయితే అతడి పైఅధికారి అతణ్ణి ఉద్యోగం సరిగా నిర్వహించనిచ్చేవాడు కాదు! ఆ అధికారి అతడితో తన స్వంత పనులు చేయించుకునేవాడు. క్రమేపి రాజేంద్రకు పూల తోటలో ఏ పనీ లేకుండా చేశాడు ఆ అధికారి.

తనను తోట పని చెయ్యనివ్వమని రాజేంద్రప్రసాద్ ఎన్నిసార్లు అధికారిని కోరినా, ఆయన అందుకు నిరాకరించాడు. రోజులో ఎక్కువ భాగం ఖాళీగా ఉండేవాడు ఆ తోటమాలి. జీతం మాత్రం ముట్టేది. తోటపని లేకుండా జీతం తీసుకోవడం అతడికి మనస్కరించేదికాదు. పై అధికారికి తన బాధ గురించి చెప్పాడు. చివరికి అధికారి, రాజేంద్రను ఉద్యోగం నుంచి తీసేశాడు! ఇది జరిగిన 15 సంవత్సరాలైంది. రాజేంద్రప్రసాద్ కోర్టుకు వెళ్లాడు. అక్కడ అతడికి న్యాయం జరిగింది. తిరిగి ఉద్యోగంలో చేరాడు. అయితే తిరిగి పాత కథే ప్రారంభమయింది. తోట పని లేదు. జీతం వస్తోంది. మళ్లీ కోర్టుకు మొరపెట్టుకొన్నాడు. కోర్టువారు అధికారులను కఠినంగా మందలించి, అతనికి తోట పని ఇప్పించారు. సిబ్బంది చేత పనులు చేయించక ప్రభుత్వ ధనాన్ని వృథా చేస్తున్నందుకు అధికారులపై బాగా అక్షింతలు వేశారు.



## డిసెంబరు 2005 'చతుర' నవల

# కనిపించని సూర్యుడు

## పై సమీక్షలు



### మళ్ళీ పుట్టాలి (మొదటి బహుమతి రూ. 100/– పొందిన సమీక్ష)

నాడు-నేడు ఆటవికుల జీవనం నాగరికుల చేతిలో వడిశెల రాయిగానే మిగిలిపోయింది. సాండర్స్ లాంటి ఏ పుణ్యాత్ముడో పూనుకుని ఉద్ధరించబోయినా సవాలక్ష ఆటంకాలు, లేకపోతే బదిలీలు.

సాండర్స్ బ్రిటిషు అధికారే అయినా సాటి మనుషులన్న సానుభూతితో అర్థం చేసుకుని గిరిజనులకు అండగా నిలిచిన మహానుభావుడు. డోలీలు మోయటం అనాగరిక చర్య అని, దౌర్జన్యాన్ని ప్రతిఘటించాలని చెప్పి వారిలో ఆలోచనలను రేకెత్తించాడు. దాని ఫలితంగానే డోలీలు మోసే దుష్ట సంస్కృతి పరిసమాప్తమైంది. ఆయనింకా మన దేశంలోనే ఉంటే బావుండేది అని జీవితాంతం తల్చుకునేలా వారి మనసులో స్థానం సంపాదించాడు. తాను చనిపోయిన తర్వాత ఆ లోకంలో సాండర్స్ పాదాలకు నమస్కరిస్తాను అన్న సాహోతు జామిరికోదు మాటలు చాలు, ఆటవికులు చేసిన మేలు మర్చిపోరని చెప్పటానికి.

జాగిలిని అంతగా ప్రేమించి కూడా తను చెయ్యలేని పనిని సొనాకోదు సాధించి ఆమెను దక్కించుకున్నందుకు, పగ, ప్రతీకారంతో రగిలిపోకుండా నిశ్శబ్దంగా పక్కకు తప్పుకున్న చీచిరికోదు ప్రవర్తనను బట్టి ఆటవికులు నీతి నియమాలకు ఎంత విలువిస్తారో అర్థమవుతుంది. సాహోతు స్థానంలో వున్నా సరే నీతి తప్పితే అతన్ని అందరూ ఒక్కటై వెలివేయటం రివాజు. వారు ఏ పని చేసినా ఖచ్చితంగా వుంటారనటానికి ఈ నిదర్శనం చాలు. కాని నాగరికులుగా చలామణి అవుతున్న మనలో ఇలాంటి గుణం మచ్చుకైనా కానరాదు. అందుకే దుష్టులకు ఓటెయ్యటానికి కూడా వెనుకాడము.

ఆటవికుల ఆచార వ్యవహారాల్లో మరింత ఆకట్టుకునే మరో అంశం స్త్రీని పురుషునితో సమానంగా చూడగలగటం. తను ఎంచుకున్న వాడిని వివాహం చేసుకోవడంలోను, కుదరనప్పుడు విడిపోవటంలోను స్త్రీకి పూర్తి స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వుందని చెప్పటానికి జాగిలి, పుల్మేల పెళ్ళిళ్ళే తార్కాణం. ఈ విషయంలో ఆటవికులే నాగరికులని, నాగరికులుగా చెప్పుకుంటున్న మనం ఆటవికులమని ఘంటాపథంగా చెప్పవచ్చు

పిందె తొడిగిన చెట్టును, గర్భిణి స్త్రీని ఒక్కతీరుగా అభిమానిస్తున్నారంటే వారికి పచ్చదనం మీద ఎంత మమకారముందో గమనించాలి.

అధికారులు అటవీ సంరక్షణను, వన్యమృగాల సంరక్షణను చేపట్టగానే సరిపోదు. ఆ అడవులలో జీవిస్తున్న గిరిజనులను కూడా కంటికి రెప్పలా కాపాడుకోవాలి. వారి ఆచార వ్యవహారాలకు భంగం కల్గకుండా తగిన సౌకర్యాలను ఏర్పాటు చెయ్యాలి. బతకటానికి ప్రత్యామ్నాయ మార్గాలను అర్థమయ్యే రీతిలో విశదపరచి సహకారమందిస్తే వాళ్ళు అటవీ సంపదను సంరక్షించటంలో ప్రభుత్వానికి సహాయపడతారు. ఇవన్నీ జరగాలంటే సాండర్స్‌లాంటి విశాల హృదయులు మళ్ళీ పుట్టాలి.

స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళు గడిచినా ఆట వికుల జీవితాల్లో సూర్యుడు ఉదయించకపో వటం నిజంగా దురదృష్టం. గిరిజనుల జీవన పోరాటాన్ని, వారికి జరిగిన జరుగుతున్న అన్యాయాన్ని చక్కగా విశ్లేషించిన రచయిత మంజరిగారు నవలకు తగిన పేరే పెట్టారు. మంచి రచయిత అనిపించుకున్నారు.

–వి.లక్ష్మి, మిర్యాలగూడ.

---

## అడవి బిడ్డల్ని ఆదుకోండి! (రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)

అడవిలో పుట్టి, అడవిలో పెరిగి, అడవి మట్టిలోనే కలిసిపోయే అడవి బిడ్డల జీవితాలను గూర్చి ఎంత రాసినా తక్కువేననిపిస్తుంది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా వారికి మాత్రం స్వాతంత్ర్యం వచ్చిన దాఖలాలు కనిపించవు. నాటికీ నేటికీ ఇంచుమించు అదే పరిస్థితి. అందుక్కారణం నాటి తెల్లదొరల హయామే మేలనిపించే, నేటి 'నల్లదొరల దౌష్ట్యమే. 'దున్నే వాడిదే భూమి' అంటూ ఓట్లకోసం నినాదాలు చేసే రాజకీయ నాయకులు సైతం 'అడవి - అడవి బిడ్డదే'నన్న సత్యం విస్మరించి వారిని ఎక్స్ప్లాయిట్ చేయడం మిక్కిలి శోచనీయం.

కోదు జాతి జీవన విధానం నేపథ్యంగా, స్వాతంత్ర్యోద్యమ కాలపు పరిధిలో ఉత్కృష్టంగా సాగిన ఉత్తమ నవల ఇది. ఇతివృత్తం పాతదే అయినా చెప్పిన తీరు నూతనంగా వుండి ఆసక్తి కలిగిస్తుంది.

జాతికంటే నీతి ముఖ్యమనీ, మనిషికంటే మానవత్వం ప్రధానమనీ... ప్రేమాభిమానాలకు భాష, ఎల్లలూ వుండవనీ నిరూపిస్తుంది సాండర్స్ పాత్ర. 'పిల్లల్ని విచక్షణా రహితంగా దండించేవాడు, ఆ పిల్లల ప్రేమను పొందలేడు' అన్న సాండర్స్ ఉవాచ పెద్దలకూ వర్తిస్తుందనడానికి నిదర్శనం-'ఫారెస్టే'. సాండర్స్ మంచితనం, అభిమానం, ఉపకారగుణం అతన్ని కోదుల హృదయాలకు చేరువ చేసి వారి గుండెల్లో గుడి కట్టించుకుంటే- ఫారెస్టే క్రూరత్వం, నిరంకుశత్వం, స్వార్థం వారికి అతనిపట్ల భయాన్ని, ద్వేషాన్నే మిగులుస్తాయి.

శాంత గంభీరంగా సాగే జామిరికోదు పాత్ర, సాండర్స్ తరువాత ఉన్నతంగా నిలుస్తుంది. డోక్రిబేడా గ్రామమంతటినీ వొంటి తాటిపైన సమర్థవంతంగా నడిపించగల సత్తా గల ధీరుడు ఆ సావోతా.

సాండర్స్ తన దేశానికి మరలిపోయిన సన్నివేశమూ, జామిరికోదు మరణమూ పాఠకుల గుండెల్ని బరువెక్కించకమానవు.

'తమని ప్రేమించినవాడిని, తమకోసం తపించినవాడిని సమాజం ఎన్నటికీ మరవదు. అది నాగరికమైనా, అనాగరికమైనా సరే'- అన్న ముగింపు వాక్యాలు అక్షర సత్యాలు. కేవలం తమ రాజకీయ లబ్ధికే ఉపయోగించుకునే కొండజాతిని ఉద్ధరించడానికి చేయవలసింది ఎంతైనా ఉందన్న సత్యం ప్రభుత్వాలు గ్రహించి, అందుకు కంకణం కట్టుకుంటే తప్ప- కోదులైనా, కోయలైనా, మరింకో జాతయినా... వారి జీవితాలు ఆ అడవిలోనే మగ్గిపోతాయి. తీవ్రవాద శక్తులకు ఊతంగా మారతాయి.

కోదుజాతి జీవన విధానాన్ని, వారి ఆచార వ్యవహారాలను, అలవాట్లను కళ్లకు కట్టినట్లుగా వివరించిన రచయితకు ఆ తెగపట్ల గల క్షుణ్ణమైన అవగాహన, పట్టు అర్థమవుతాయి... ఉత్సుకత కలిగించే సన్నివేశాలతో, సంఘటనలతో, ఉత్కృష్టమైన శైలితో సాగిన ఈ నవల ఆద్యంతం ఉత్కంఠతో చదివించడమే కాక, ఈ మధ్య 'చతుర'లో ప్రచురిత మైన నవలల్లో తలమానికంగా నిలుస్తుందని చెప్పవచ్చును.

– సత్యనారాయణ, సికింద్రాబాద్.

## తులనాత్మక వర్ణన

(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

డిసెంబరు చతురలో ప్రచురించిన 'మంజరి' (గంధం నాగేశ్వరరావు)గారి 'కనిపించని సూర్యుడు' నవల నిప్పులాంటి నిజాయితీతో చీకటిలో వెలుగునిచ్చే సూర్యునిలా ఉంది. అమాయకత్వం, అజ్ఞానం, నిజాయితీతో ప్రకృతిలో మమేకమై జీవించే అడవి తల్లి సంతానపు జీవన విధానం- ఈ తరానికి తెలియని ఎన్నో విషయాలు తెలియచేస్తుంది. "స్వాతంత్ర్య సమరం' - గిరిజనులపై బ్రిటిషు, ప్రభుత్వాధికారుల జులుం, వెట్టిచాకిరీ, డోలీల మోత తులనాత్మకంగా అభివర్ణించారు. స్వాతంత్ర్యం వచ్చినందుకు భారతజాతి సంతోషంతో ఎలా పండుగలు చేసుకుందో అలాగే అధికారుల జులుం తప్పినందుకు కోదులు అంత సంతోషించి పండుగ చేసుకున్నారు.

కోదుల ఆచార వ్యవహారాలూ, ముఖ్యంగా స్త్రీలకు స్వాతంత్ర్యం చూస్తుంటే 'రాహుల్ సాంకృత్యాయన్'గారి 'ఓల్గా నుంచి గంగా వరకు' పుస్తకం మొదటి కథలోని స్త్రీ స్వేచ్ఛ, మాతృస్వామ్యం గుర్తొచ్చింది. ఇది ఒక నవల కాదు సామాజిక శాస్త్రం. 'డోక్రీబేడా' సావోతా (కోదుల నాయకుడు) జామిరికోదు ఐదు తరాలను తన ఆలోచనల్లో విశ్లేషించాడు. వాళ్ళ తాత సరుబసావోతా కాలంలో నరబలిని మాన్పించి, జంతుబలిని ప్రవేశపెట్టి ఆచార వ్యవహారాలను సంస్కరించిన తీరు బాగుంది.

బ్రిటిష్ అధికారి సాండర్స్‌లోని అంతర్మథనం చక్కగా చిత్రీకరించి కోదుల ఆరాధ్య దైవంగా నిల్పిన తీరూ, ఆయనను పాస్టర్‌గా కాక ఒక గిరిజన బాంధవుడైన అధికారిగా మార్చి, ఆయన మనసులోని కోరికను తీర్చుకొన్న విధానాన్ని రచయిత చక్కగా చిత్రీకరించారు. ఒక వైవిధ్యమైన నూతన ప్రపంచాన్నీ, జానపద చిత్రాన్ని ఈ నవలా రచన ద్వారా రచయిత మన కనుల ముందు ఆవిష్కరింపచేశారు.

-ఎన్.రమాదేవి,
కావలి.

---

## వైవిధ్యభరితం

(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

బ్రిటిష్ పరిపాలన కాలం నాటి నేపథ్యంలో, అడవి తల్లి ఒడిలో జీవన సమరం సాగించే బడుగు కోయజీవుల వ్యధలను కళ్లకు కట్టినట్లు వ్యక్తీకరించిన 'కనిపించని సూర్యుడు' నవల ఎంతో ఆసక్తికరంగా నడిచింది. 'డోక్రీబేడా' గ్రామ పెద్ద 'జామిరి కోదు' గత జ్ఞాపకాల కథనం వైవిధ్య భరితంగా ఉంది. ఎక్కడో పుట్టి పెరిగిన బ్రిటిష్ పౌరుడు 'సాండర్స్' కోయజాతి పట్ల చూపిన కరుణ, వారి అభ్యున్నతి కోసం పడిన తపన ఎంతో మెచ్చుకోదగ్గవి. మనిషిని మనిషి మోసే 'డోలీ కట్టడం' అనే అమానుష చర్యలకు గోరీ కట్టడం కోసం ప్రభుత్వ ఆర్డర్‌ను రప్పించిన సాండర్స్ దాన్ని ఖాతరు చేయకుండా కోయలను పీడిస్తున్న ఫారెస్ట్ ఆఫీసర్ పీచ మడిచిన కథనం ఎంతో ఆసక్తికరంగా మలిచారు. సాండర్స్ ఫాదర్‌గా ఉండగా పోలీస్ ఆఫీసర్ ఉద్యోగానికి పిలుపు వస్తే ప్రాణాలకు తెగించి కోయబిడ్డ రామయ్య అడవి

మార్గంలో కష్టనష్టాల కోర్చి అతడిని బండిలో స్టేషన్ వరకు దింపడాన్ని మరిచిపోకుండా, ఎన్నో ఏళ్ల తర్వాత రామయ్య కొడుక్కి బంగారు గొలుసు బహూకరించిన సాండర్స్ వ్యక్తిత్వం ఎంతో ఉన్నతమైనది. కోయజాతి అభ్యున్నతికి శ్రమించిన సాండర్స్ భారతదేశం స్వతంత్ర దేశమయ్యాక తన స్వదేశం తిరిగి వెళ్లేటప్పుడు బరువెక్కిన హృదయంతో పులిగోరు పతకాన్ని తనతో భద్రంగా తీసుకెళ్తాడు. ఈ విషయం తెలియని వృద్ధ జామిరికోదు తన జీవితమంతా 'ఆ కనిపించని సూర్యుని' కోసం ఎదురు చూస్తూనే గడుపుతాడు. వైవిధ్యం ఉన్న కథా వస్తువును ఎన్నుకుని, అడవిలోని కోయ జీవనం ప్రతిబింబించేలా రచించడంలో 'మంజరి'గారు కృతకృత్యులయ్యారు.

– యమ్.వి. రమణారావు,
విశాఖపట్నం

---

## పూవుకు తావిలా...

(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

"కనిపించని సూర్యుడు" ఇప్పుడు కన్పించక పోతేనేం అతడి వెలుగును రమ్యాతి రమ్యంగా చూపించారు రచయిత. అడవి తల్లి ముద్దు బిడ్డల జీవన చిత్రాన్ని అద్భుతంగా అక్షరీకరించినా మా మనోనేత్రంతో రచయిత కలం వెంట అన్ని దారులూ తిరిగాం. అన్నీ దర్శించాం. మహోన్నతమైన మానవత్వం నిండిన మనిషి ఏ దేశం వాడైతేనేం - ప్రత్యక్ష దైవమేగదా - ప్రజలకు మేలు చేయాలన్న దృఢ సంకల్పంతో తనకున్న అధికారాలను సద్వినియోగం చేసుకుని దురాచారాలను, పద్ధతులను రూపుమాపడం వీరోచితంగా ఉంది. చదువుతుంటే ప్రజల్ని పీడిస్తూ, మానవత్వానికి మచ్చ తెచ్చే అధికారులు అప్పుడే కాదు. స్వాతంత్ర్యం వచ్చాక కూడా ఇంకా దుర్భరం కావడం శోచనీయం. "అలాంటోడు తరానికి ఒకడు పుడితే మన బతుకులు బాగుపడిపోను" సాండర్స్‌ను ఉద్దేశించి రచయిత అన్న మాటలు ముమ్మాటికి నిజం. తమని ప్రేమించిన వాడిని, తమ కోసం తపించిన వాడిని సమాజం ఎన్నటికీ మరువదు. హృదయ లోయల్లో ఈ నవల జీవనదిలా సాగుతుంటే, సజల నయనాలతో "ఓ సాండర్స్, ఓ మహాత్మాగాంధీ, ఓ మదర్ థెరీసా మళ్లీ పుట్టండి" అని ప్రార్థించాను. రచయిత శైలి, అద్భుత వర్ణన పువ్వుకు తావిలా వుంది.

శేషేంద్రశర్మగారి విప్లవ కథ వెనుక కథ విషాదం మిగిల్చింది. కాలాతీతం, చతుర భాషితాలు, వావ్, చతుర ఫ్లాష్ బ్యాక్ వేటికవే ప్రత్యేకతలు కలిగి, చివరి పేజీ ముగించేసరికి షడ్రుచుల కమ్మని భోజనం చేసినంత తృప్తి మిగిలింది.

– *జి. సుధాకర్,* రాజమండ్రి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www. eenadu .net

## గద్దగారి ఉపాయం

ఇదేమిటి ఈ గద్దగారు గుడ్డునొదిలేసి రాయిని నోట కరుచుకుందేమిటనుకుంటున్నారా? అదే గమ్మత్తు. ఆ రాయితో గుడ్డు పగలకొట్టి అందులోని పచ్చ, తెల్లని సొనలను గుటుక్కుమనిపించడానికే దాని యత్నమంతా. భారీ సైజులో ఉన్న ఉష్ట్రపక్షి గుడ్డును ముక్కున కరిచి పైకి లేపి పగలగొట్టలేకే ఈ ఉపాయం. గుడ్డు ఆకారపు రాయినే అతి జాగ్రత్తగా ఎంచుకుని గుడ్డు పగిలేదాకా పదే పదే కొట్టి లోపలి సొనలను జుర్రుకుంటుంది. మనుషులే కాదు, పక్షులు కూడా పనిముట్లు వాడతాయనడానికి ఈ దృశ్యమే నిదర్శనం.



